# శ్రీరంగనాథస్తోత్రమ్

## ఉపోద్ఘాతము

**శ్రీ పరాశరభట్టార్యః శ్రీ రంగేశపురోహితః।**
**శ్రీ వత్సాంకసుత శ్రీమాన్ శ్రేయసే మే ఽస్తు భూయసే॥**

అనితర సాధారణమైన ప్రతిభా పాండిత్యములకు మారుపేరును, కూరేశుల కుమారులును అగు పరాశర భట్టారకులను ఆచార్యులచే ఈ స్తోత్రము రచింప బడినది. ఒకానొక సమయమున చోళరాజుతో కల్గిన భేదాభిప్రాయము వలన భట్టరు కొంతకాలము గోష్ఠీపురమను విష్ణుక్షేత్రమున నివసించిరి. ఆ వృత్తాంతము క్లుప్తముగా ఇట్లున్నది.

భట్టరు శ్రీరంగమున భగవద్రామానుజుల స్థానమును అలంకరించి, సంప్రదాయ రక్షణమును చేయు సమయమున, ఆ క్షేత్రములోని ఏడు ప్రాకారములలో ఆరవ ప్రాకారమగు త్రివిక్రమవీథి ప్రాకారము మిక్కిలి జీర్ణ మయ్యెను. దానిని పునఃరుద్ధరింపదలచిన అచటి ప్రభువు వీరసుందర బ్రహ్మ రాయుడు, ఆ ప్రాకారమును నేరుగా కట్టుటకు కూరేశుల ప్రియశిష్యులైన ఒక మహనీయుల (పిళ్ళై పిళ్లై ఆళ్వాన్ అనిపేరు) గృహము అడ్డువచ్చుటచే దానిని పడగొట్టి ప్రాకారమును నిర్మింపదలచెను. ఆ విషయమును తెలిసికొనిన భట్టరు ఆ ప్రభువుతో, "నీవు కట్టు ప్రాకారములు భగవానునకు రక్షకములని తలచు చుంటివా! పరమభాగవతులగు ఆమహనీయుల మంగళాశాసనమే కదా రక్షకము. పూర్వము తిరుమంగై ఆళ్వార్లు నాల్గవ ప్రాకారమును కట్టునపుడు భక్తాంఘ్రిరేణు లను ఆళ్వార్లు భగవానునకు పూమాలెను కూర్చుచోటు అయిన ఉద్యానవన ప్రదేశము అడ్డురాగా, దానిని తొలగించి ప్రాకారమును నేరుగా కట్టుటమాని, ఆ చోటును వదలి ప్రాకారమును కొంచెము ప్రక్కకు కట్టిన సందర్భమును మఱచితివా? అట్లే ఇపుడును ఈ భాగవతుల గృహమును వదలిపెట్టి, ప్రాకారమును కొంచెము ప్రక్కగా కట్టుము.'' అని పల్కిరి. ఆ రాజు తన ఆచార్యుల పుత్రులగు భట్టరు ఆదేశించిరికదా అని కాని, ఒక మహనీయులు



మంచిని పల్కిరి కదా అనికాని తలపక, ఆ మాటలను పెడచెవిని బెట్టి, పిళ్లై పిళ్లై ఆళ్వాన్ ఇంటిని కూలగొట్టి ప్రాకారమును కట్టుటకు ప్రారంభించెను. ఆ కారణముగా భట్టరునకు, ఆ ప్రభువునకు మధ్య కల్గిన అభిప్రాయ భేదములు క్రమముగా వృద్ధి అయ్యెను. భట్టరు పై కక్షను పెంచుకొనిన వీరసుందర బ్రహ్మరాయుడు ఆ ఆచార్యులను శ్రీరంగమున నివసింపకుండ చేయవలయు నను ప్రయత్నములను ప్రారంభించెను. అపుడు భట్టరు ఎవరికిని తెలుపక శ్రీరంగమును వీడి గోష్ఠీపురమను క్షేత్రమును చేరిరి. అట్లు శ్రీరంగమునకు, శ్రీరంగనాథునకును దూరముగా ఉండవలసివచ్చినదే అను ఆర్తి వలన "ఎపుడు మరల శ్రీరంగమును దర్శింతును? శ్రీరంగనాథుని సేవింతును?'' అను భావోద్వేగము ఆచార్యులకు కల్గెను. కులశేఖరసూరి తమ ప్రబంధమున, "శ్రీరంగ దివ్యనగరమున కావేరీ నది తన కెరటములను కరములతో సేవించుచుండగా శయనించియున్న నీలమణి సదృశుడు, మిక్కిలి సౌకుమార్యమును కలవాడగు శ్రీరంగనాథుని కన్నులారా సేవించి, నా కన్నులేనాడో కదా సంతోషించునది?'' అని, "తేనెను స్రవించు పూలను కల్గిన తోటలతో చుట్టబడియున్న శ్రీరంగమున ఆదిశేషునిపై శయనించియున్న సముద్రవర్ణుడు, కమల నేత్రుడు అగు స్వామి యొక్క ప్రకాశించు చంద్రబింబమువంటి ముఖమును కన్నులార సేవించి నా మనస్సు ఎపుడోకదా ద్రవించునది'' అని, " అత్యాశ్చర్యకరములైన లీలనుచేయు స్వామిని సేవించి నేను నా కన్నులు నీరు నిండగా నించునది ఏనాడోకదా'' అనియు పరితపించిన రీతిలో భట్టరును ఈ స్తోత్రమును తమ ఆర్తిని ప్రకటించుచు కొన్ని శ్లోకముల ద్వారా ఆశువుగా రచించిరి. అవి శ్రీరంగనాథస్తోత్ర రూపమును పొందినవి. కులశేఖరసూరి భావమును అనుసరించు ఈ శ్లోకములు ఆ మహనీయుల సూక్తికిని మెఱుగుపెట్టినవని చెప్పనగును. ఈ శ్లోకముల భావము, విశేషములును యథామతి తెలుపబడుచున్నవి. ప్రస్తుతవ్యాఖ్యా మహావిద్వాంసులు, ప్రాతఃస్మరణీయ కీర్తివైభవులును అగు ప్ర.భ. అణ్ణాస్వామివారి ద్రావిడ వ్యాఖ్యానమును కృతజ్ఞతాపూర్వకముగ అనుసరించి వ్రాయబడినది.

భవదీయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

## శ్రీ పరాశర భట్టర కృత

# శ్రీరంగనాథస్తోత్రమ్

## శ్రీ సేవా వ్యాఖ్యా - ఈ. ఏ. శింగరాచార్యులు

**శ్లో॥సప్తప్రాకారమధ్యే సరసిజముకులోద్భాసమానే విమానే**
**కావేరీ మధ్యదేశే మృదుతరఫణిరాడ్భోగ పర్యంకభాగే।**
**నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వ విన్యస్తహస్తం**
**పద్మాధాత్రీకరాభ్యాం పరిచిత చరణం రంగరాజం భజే2హమ్॥1**

కావేరీమధ్యదేశే=ఉభయ కావేరుల నడుమ ప్రదేశమున నున్న శ్రీరంగమున, సప్తప్రాకారమధ్యే=ఏడు ప్రాకారముల మధ్యలో, సరసిజముకుల+ఉద్భాసమానే=తామర మొగ్గవలె శోభిల్లు, విమానే=ప్రణవాకార శ్రీరంగవిమానమునందు, మృదుతరఫణిరాట్+భోగపర్యంకభాగే=మిక్కిలి సుకుమారమైన ఆదిశేషుని శరీరమను పడుక అను పరుపుపై, నిద్రాముద్రాభిరామమ్=నిద్రించు సన్నివేశముతో మనోహరమైన వాడు, కటినికట శిరఃపార్శ్వవిన్యస్తహస్తమ్=నడుము సమీపమున ఒకచేతిని, తలకు సమీపమును వేరొక చేతిని పెట్టుకొనినవాడు, పద్మాధాత్రీకరాభ్యామ్=లక్ష్మీదేవి, భూదేవుల హస్తములతో, పరిచిత చరణమ్= సేవింపబడు పాదములను కలవాడును, అగు, రంగరాజమ్=శ్రీ రంగనాథుని, అహమ్=నేను, భజే=భజించుచున్నాను.

ఉభయ కావేరీనదీమధ్యదేశమగు ద్వీపమున వెలసియున్న శ్రీరంగక్షేత్రములో సప్తప్రాకారముల మధ్య తామర మొగ్గవలె శోభిల్లు విమానమునందు, సుకుమారమైన ఆదిశేషుడను పడుకపై నిద్రించు భంగిమలో మనోహరముగనున్న వాడు, నడుము వద్ద ఒక చేతిని, తల వద్ద వేరొక చేతిని పెట్టుకొనినవాడు, శ్రీదేవి భూదేవులు తమ కరములతో సేవించు పాదములను కలవాడును అగు శ్రీరంగనాథుని నేను సేవింతును.

ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగక్షేత్రమున శ్రీరంగనాథుడు వేంచేసియున్న సన్నివేశమును మన కన్నులముందు నిలుపుచున్నారు.



**సప్తప్రాకారమధ్యే** - ప్రణవప్రతిపాద్యుడు భగవానుడు. శ్రీరంగక్షేత్రములోని ఏడు ప్రాకారములు, విమానమును కలిసిన ఎనిమిది అగును. ఈ ఎనిమిదియు అష్టాక్షరీమంత్రమునకు చిహ్నములని పిళ్లైప్పెరుమాళ్ అయ్యంగార్ అను తమిళ కవి అభివర్ణించిరి. శ్రీరంగమందిరము "వైకుంఠమ్ రంగమందిరమ్" అనునట్లు సాక్షాత్తు వైకుంఠమునకు ప్రతీక. వైకుంఠమును చేరవలెనన్న ఏడు లోకములను దాటి పోవలయును. అట్లే, శ్రీరంగమందిరమును చేరవలెనన్నను ఏడు ప్రాకారములను దాటి పోవలయును. ఇట్లు, శ్రీరంగనాథునకు, శ్రీరంగ మందిరమునకును ఏడు అంకెతో అవినాభావసంబంధము కలదు. భట్టరు రచించిన ఏడు (2+3+2) అగుటయు ఇచట స్మరింపతగినది.

**సరసిజ ముకులోద్భాసమానే** - ఆకారమున, అందమున తామరమొగ్గతో విమానమునకు పోలిక.

**కావేరీమధ్యదేశే** - ఉభయ కావేరీమధ్య పుళిన ప్రదేశము సాక్షాత్తు పరమ పదము. "యద్విష్ణోఃపదమపరం పరోరజో2గ్ర్యం ముక్తానా మనువిరజం విదీప్రమాహుః, తత్పుణ్యం పుళినమిదం తయా2ద్య మధ్యే కావేరి స్ఫురతి"(26) అనుచు భట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కుట గమనింపతగినది.

**మృదుతర ఫణిరాడ్భోగ పర్యంకభాగే** - అత్యంతము మృదువైన ఆదిశేషుని భోగమే పడక. "రంగభర్తురపిలోచన చర్చాం సాహసావళిషులేఖయామానమ్, పుష్పహాస్ ఇతి నామదుహానం సౌకుమార్యమ్" అనుచు భట్టరు శ్రీరంగనాథుని సౌకుమార్యము లోకోత్తరమని వర్ణించిరి. అట్టి స్వామి దివ్యదేహమునకును శ్రమకల్గింపనట్టి మెత్తనితనమును కలిగినది ఆదిశేషుని శరీరము. కావున ఇద్దరి మధ్య తారతమ్యమును తెలుపు ఇచటి "తరప్" ప్రత్యయము భగవానుని సౌకుమార్యము కంటె ఆదిశేషుని సౌకుమార్యము అతిశయించియుండుటను తెలుపునని చెప్పనగును.

**నిద్రాముద్రాభిరామమ్** - "నిద్రాసి జాగర్యయా" అని శ్రీరంగనాథుని నిద్రా ముద్రను గూర్చి భట్టరు నుడువిరి. శ్రీరాముని నిద్రాముద్రలోని అందమును దర్శించిన అదృష్టశాలి విశ్వామిత్రుడు. ఆ సౌందర్యమునకు అచ్చెరువొంది

"కౌసల్యాసుప్రజారామ" అని కీర్తించెను. "సమయాబోధితః శ్రీమాన్" అనుచు నిద్రా సన్నివేశమునకు మంగళము పాడెను. శ్రీరామచంద్రునకు ప్రతిరూపమగు శ్రీరంగనాథుని నిద్రాముద్రను భట్టరు ఇచట కీర్తించుచున్నారు. భట్టరు శ్రీరామభక్తాగ్రేసరులగుట ఇచట స్మరణీయము.

**కటినికటి శిరఃపార్శ్వ విన్యస్తహస్తమ్** - ఆదిశేషునిపై పరుండియున్న శ్రీరంగనాథుడు తన రెండు చేతులలో ఒకచేతిని నడుముపై, వేరొకచేతిని తల వద్ద పెట్టుకొనియున్నాడు. ఈ సన్నివేశము ఇచట ప్రస్తుతము. భట్టరు దీనిని శ్రీరంగరాజస్తవమున కీర్తించుచు, "కిరీటం రంగేశయితు రుపధానీకృతభుజో విధీశాదీశత్వాత్ ఘటిత ఇతి సంస్పృశ్యవదితి, నిహీనానాం ముఖ్యం శరణ మితి బాహుస్తదితరః స్ఫుటం భూతే పాదాంబుజయుగళ మాజానునిహితః "(110)అని పల్కిరి. కిరీటమును సూచించు చేయి, ఆ కిరీటమును తాను ధరించుట బ్రహ్మేశ్వరులకు సైతము ప్రభువగుటచే తగునని తెలుపుచున్నదని, మోకాలి వరకు చాచుకొనియున్న ఇంకొకచేయి తన పాదములే భక్తజనరక్షకములని తెలుపు చున్నదని ఈ శ్లోకములోని భావము. అది ప్రస్తుతముననను అనుసంధేయము. కిరీటమును తాకు కుడిచేయి పరత్వమును, పాదములను చూపు ఎడమచేయి సౌలభ్యమును తెలుపుచున్నవని సారాంశము. దీనివలన శరణ్యత్వము సిద్ధము.

**పద్మాధాత్రీకరాభ్యాం పరిచిత చరణమ్** - "నిరుపమాన సౌందర్యముకల లక్ష్మీదేవి, మిగిలిన భూదేవియు మెల్లగా స్పృశించు చరణములను మహాపాపినగు నేను స్పృశించునట్లు నీవు పిలుచుటయో, లేక నా వద్దకు వచ్చుటయో చేయక పోతివికదా!" అను నమ్మాళ్వార్ల (9-2-10)సూక్తి ఇచట స్మరణీయము. పరిచిత శబ్దప్రయోగము వలన స్వామి పాదముల మర్దనము సూచితము. "లక్ష్మీమహీత దనురూప నిజానుభవ నీళాది దివ్యమహిషీకరపల్లవాఖ్యామ్, సంవాహనే 2పి సపదిక్లమమాదధానౌ........ పాదౌ" అను శ్రీ వేంకటేశప్రపత్తి సూక్తియు అనుసంధేయము. స్వామిని స్తుతించు ఈ శ్లోకము స్రగ్ధరావృత్తమున కూర్ప బడుట విశేషము. శ్లోకమాలికయే కదా ఈ స్తుతి.

**శ్లో॥కస్తూరీ కలితోర్ధ్వపుండ్రతిలకం కర్ణాంతలోలేక్షణం**
**ముగ్ధస్మేరమనోహరాధరతలం ముక్తాకిరీటోజ్జ్వలమ్।**



**పశ్యన్మానస పశ్యతోహరరుచః పర్యాయ పంకేరుహం**
**శ్రీరంగాధిపతేః కదా ను వదనం సేవేయ భూయో 2ప్యహమ్॥2**

పశ్యన్మానసపశ్యతోహరరుచః=దర్శించు మనస్సును చూచుచుండగనే హరించు అందమును కల్గినదగు, శ్రీరంగ+అధిపతేః=శ్రీరంగనాథునియొక్క, కస్తూరీకలిత+ఊర్ధ్వపుండ్రతిలకమ్=కస్తూరితో దిద్దబడిన ఊర్ధ్వపుండ్రతిలకమును కల్గినది, కర్ణ+అంత లోల+ఈక్షణమ్=కర్ణముల చివరవరకు (చెవుల వరకు) విస్తరించి అటు ఇటు కదలాడు కన్నులను కల్గినది, ముగ్ధస్మేర మనోహర అధరతలమ్= వ్యామోహమే రూపుదిద్దుకొనిన చిఱునవ్వును కల్గిన, మనస్సును దోచుకొనునట్టి అధరమును(క్రింది పెదవి)కల్గినది. ముక్తాకిరీట+ఉజ్జ్వలమ్= ముత్యములు,పొదిగిన కిరీటముతో ఉజ్జ్వలముగానున్నది, పర్యాయపంకేరుహమ్= వేరొక తామరవలె నున్నది అగు, వదనమ్=ముఖమును, అహమ్=నేను, భూయః =తిరిగి, కదా ను= ఎప్పుడో కదా, సేవేయ=సేవింపగలను!

సేవించువారి మనస్సును ప్రత్యక్షముగనే దోచుకొను అందము కల్గినది, కస్తూరిచే దిద్దబడిన ఊర్ధ్వపుండ్రతిలకమును కల్గినది, ఆకర్ణము విస్తరించిన చంచలములైన నేత్రములను కల్గినది, వ్యామోహము మూర్తీభవించినదగు చిఱునవ్వుతో మనస్సును ఆకర్షించు అధరమును కల్గినది, ముత్యాలతో కూడిన కిరీటముతో మిక్కిలిగా ప్రకాశించునది, తామరపూవువలెనున్నదగు శ్రీరంగ నాథుని ముఖమును మరల నేను ఎపుడు దర్శింపగలనోకదా!

ఈ శ్లోకము నుండి నాల్గుశ్లోకములలో భట్టరు శ్రీరంగక్షేత్రమును, శ్రీరంగ నాథుని ఎడబాయుటచే తమకు కల్గిన ఆర్తిని ప్రకటించుచున్నారు. "అయ్యో! నాతాపము ఏనాడు తీరును? అట్టి సమయమును నా జీవితమున నేను చూడగలనా?" అని పరితపించుట ఇందలి విషయము.

"మధువును కల్గిన పూవులతో కూడిన తోటలచే పరివేష్ఠింపబడిన శ్రీరంగ క్షేత్రమున ఆదిశేషునిపై పవళించియున్న సముద్రవర్ణుని, కమల నేత్రములను, చంద్రునివలె శోభిల్లు ముఖమును సేవించి నా మనస్సు ఇక ఏనాడు ద్రవించునో కదా" అను కులశేఖరుల సూక్తికి ఈ శ్లోకము అనువాద ప్రాయము.

**కస్తూరీకలితోర్ధ్వపుండ్రతిలకమ్** - కస్తూరీ తిలకముతో దిద్దబడిన శ్రీరంగనాథుని ఊర్ధ్వపుండ్రతిలకమును భట్టరు "హ్రాదయం ప్రసాదయతి రంగపతేః మధురోర్ధ్వ పుండ్రతిలకంలలితమ్, అళికార్థచంద్రదళ సంవలితా మమృతస్రుతం యదభిశంకయతే" అనుచు ముఖమను చంద్రుని నుండి స్రవించు అమృతప్రవాహముగా ఉత్ప్రేక్షించిరి. ఊర్ధ్వపుండ్రతిలకము ఆత్మలను ఊర్ధ్వగమనము పొందునట్లు స్వామి చేయునని సూచించుననుచు శ్రీశంకరులు పాదాదికేశాంతస్తుతిలోని "ఊర్ధ్వం తత్పుండ్రమూర్ధ్వం జని మరణతమఃఖండనం మండనం నః" అను సూక్తి ద్వారా సూచించిరి. కూరేశులును వరదరాజస్తవమున, "ఉద్ధరత్యుపరి భక్తజనానితి ఊర్ధ్వతాశ్రయణ సూచితశక్తిమ్, ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిము బిభర్షి" అనుచు స్వామి భక్తులను ఉద్ధరించుటను ఊర్ధ్వ పుండ్రము తెలుపుననిరి.

**కర్ణాంతలోలేక్షణమ్** - చెవుల పర్యంతము వ్యాపించియున్న నేత్రశోభ ఈ విశేషణమున ప్రస్తుతము. కర్ణముల వరకు విస్తరించుట ఒక విశేషముకాగా, ఎల్లప్పుడు చలించుట వేరొక విశేషము. మొదటి అంశమును భట్టరు రమణీయముగ, "కృపయా పరయా కరిష్యమాణే సకలాంగం కిలసర్వతో2 క్షినేత్రే, ప్రథమం శ్రవసీ సమాన్యణీతే ఇతి దైర్ఘ్యేణ విదంది రంగనేతుః" (98) అని స్తుతించిరి. అన్ని అంగములను ఆవరింపదలచిన స్వామి కన్నులు మొదట తమకు సమీపములో నున్న కర్ణముల వరకు వ్యాపించుచున్నవను ఈ సూక్తి భావము ఇచటను అనుసంధేయము. అట్లే ఎల్లప్పుడు కదలాడు స్వభావమును స్వామి నేత్రములు కల్గియుండుటను భట్టరు "శ్రవో నాసారోధాత్ తదవధిక డోలాయిత గతే ....... మిథోబద్ధస్పర్థస్ఫురితశఫరద్వంద్వలలితే క్రియాస్తాం శ్రీరంగప్రణయి నయనాబ్జే మయి దయామ్" (99) అను సూక్తితో అభివర్ణించిరి. అంగములందు అంతటి వ్యాపింపదలచిన నేత్రములకు అటు కర్ణములు, ఇటు నాసికము అడ్డు తగులుట, పరస్పరము స్పర్ధించుటయు స్వామి నేత్రములు చాంచల్యమునకు హేతువులు అను ఈ శ్లోకములోని రమ్యమైన భావమును ఇచట స్మరింపనగును.

**ముగ్ధస్మేరమనోహరాధరతలమ్** -శ్రీరంగనాథుని చిఱునవ్వు శోభను భట్టరు



వర్ణించిన ఈ సూక్తి ఇచట అనుసంధేయము. "అమృతతటాకచంద్రాంబుజ స్మయహరశుచి ముగ్ధమందస్మితమ్" (93) అనుచు స్వామి చిఱునవ్వు అమృత సరస్సు, చంద్రుడు, పద్మముల గర్వమును హరించునది అని పల్కిరి. స్వామి చిఱునవ్వు ముగ్ధమనుట మిక్కిలి అర్థవంతము. ముగ్ధమనగా మోహమును కల్గినది. ఈ వ్యామోహము భక్తులపై గల వ్యామోహమే! ఈ చిఱునవ్వుద్వారా స్వామి భక్తులతో భాషించునట. "సంభాషమాణమివ సర్వవశంవదేన" (69) అని భట్టరు పల్కిరి కదా! ఈ చిఱునవ్వు స్వామి తన ఆయుధముల ద్వారా భక్తరక్షణనుచేయునని, పాదద్వంద్వము భయములన్నిటిని తీర్చి, ఇష్టప్రాప్తిని కల్గించునని వ్యాఖ్యానించుచున్నదా, అనియు భట్టరు "స్మేరేణ వక్త్రేణ తత్ వ్యాకుర్వన్నివ" (70) పల్కుట ప్రకృతమున స్మరణీయము. ఇట్టి చిఱునవ్వుతోనే స్వామి చూపరుల మనస్సును దోచుకొనుచున్నాడు. "రామః కమలపత్రాక్షః సర్వ సత్త్వమనోహరః" అనుచు వాల్మీకి శ్రీరాముడు తన కమలనేత్రముల ద్వారా అందఱి చిత్తములను ఆకట్టుకొనెనని పల్కెను. ఇచట భట్టరు శ్రీరంగనాథుడు తన చిఱునవ్వుతో అందఱిని వశపఱచుకొనుచున్నాడనిరి.

**ముక్తాకిరీటోజ్జ్వలమ్** - స్వామి కిరీటము ముఖమును ఉజ్జ్వలముగా చేయుచున్నదని భావము. భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని కిరీటమును వర్ణించుచు, "కిరీటచూడరత్నరాజిరాధిరాజ్యజల్పికా, ముఖేందు కాంతి రున్ముఖం తరంగితేవ రంగిణః" అనుచు స్వామి ముఖకాంతి పైకి ప్రసరించి నట్లున్నదని పల్కిరి. ఇచట కిరీటకాంతిచే ముఖము శోభిల్లుచున్నదనిరి. ఈ రెండిటికిని మూలము శఠకోపసూరి భావనావిశేషమే అనదగును. శఠకోపులు తమ ప్రబంధమున భగవానుని స్తుతించుచు, "స్వామీ! నీ ముఖశోభ నీ కిరీట శోభగా వికసించెనా?" అని ఉత్ప్రేక్షించిరి. ఉత్కటకోటికమైన సంశయము ఉత్ప్రేక్ష కావున, సంశయము కోటి ద్వయాత్మకము కావున, ఇచట రెండవ భావన ఏమనగా, "స్వామీ! నీ కిరీట శోభయే ముఖకాంతిగా వికసించెనా?" అనునది. అదియే ప్రస్తుతమున కవిచే స్వీకృతము అనదగును.

**పశ్యన్మానస పశ్యతోహరరుచః** - పశ్యతోహరుడనగా చూచుచుండగానే హరించువాడని భావము. స్వామి ముఖశోభ భక్తుల మనస్సులను దోచు

పశ్యతోహరము. ఇట్టి గుణము స్వామి అంగము లన్నిటికిని ఉన్నను ముఖశోభ అన్ని అంగముల శోభకంటె అతిశయించియుండుటచే అది ఇచట కీర్తింపబడినది.

**పర్యాయ పంకేరుహమ్** - స్వామి ముఖము వేరొక తామరపూవు అనుటచే సాదృశ్యము పూర్ణమని భావము. "ముఖ పుండరీకము" ఇత్యాది సూక్తులు ఇచట స్మరణీయములు.

**"పశ్యన్మానసపశ్యతోహరరుచిమ్"** అను పాఠాంతరము నపుంసకలింగ విశేష్యమగు ముఖమునకు అన్వయింపదు కావున గ్రహింపతగినది కాదు. అనుస్వారములేక "రుచి" అని ఉన్నచో అన్వయించును. అపుడు ఛందస్సుకు భంగము కల్గును. కావున ప్రకృత పాఠమే సరిఅయినది.

శ్రీరంగనాథుని ముఖశోభ ప్రస్తుతింపబడిన ఈ సందర్భమున గోదాసూక్తమను ద్రావిడ ప్రబంధములోని (10-5) సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీకృష్ణసూరి ఉట్టంకించిన రెండు వృత్తాంతములు తప్పక స్మరింపతగినవి. భట్టరు తమ చివరిదశలో నడుముపై పుండు ఏర్పడి బాధపడు సమయమున శ్రీరంగనాథుడు అర్చకముఖమున ఆ ఆచార్యులను పిలచి, "ఓయీ! భయపడుచుంటివా ఏమి?" అని ప్రశ్నింపగా, భట్టరు, "స్వామి! నాకు నీవు అనుగ్రహింపని వైభవము ఏమియును లేదు. ఇచటనే ఉన్నను పరమపదమును నేను చీటి వ్రాసి ఇచ్చిన చెల్లునట్లుగా అధీనము చేసితిని. ఈ విషయమున ఏ కొఱతయు లేదు. కాని పరమపదమునకు పోయినచో అచట ఈ చల్లని ముఖమును, ఈ తిరు నామమును, చిఱునవ్వును దర్శింపలేను కదా! అని భయమగుచున్నది." అని సమాధానమును పల్కిరి.

శ్రీయామునుల కుమారులగు శొట్టైనంబి అను ఆచార్యులు అంతిమ సమయమున కొందఱు మీరు ఇపుడు తలచునది ఏమని ప్రశ్నింపగా, "యామునుల సంబంధమువలన నాకు పరమపదప్రాప్తి కలుగుటలో సందేహము లేదు. కాని, అచట పరమపదనాథుని ముఖము శ్రీరంగనాథుని ముఖమువలె చల్లగానుండకపోయినచో, అండభిత్తిని చీల్చుకొని శ్రీరంగమును తిరిగి చేరవలయునని తలచుచుంటిని" అని పల్కిరి.



పై ఉదంతములు రెండును శ్రీరంగనాథుని ముఖశోభ, మందస్మిత శోభయు భక్తులకు ఎంత ఆకర్షకములో తెలుపుచున్నవికదా!

ఈ శ్లోకము శార్దూలవిక్రీడితవృత్తమున నిబద్ధము.

**శ్లో॥ కదాహం కావేరీతట పరసరే రంగనగరే**
**శయానం భోగీంద్రే శతమఖమణిశ్యామలరుచిమ్।**
**ఉపాసీనః క్రోశన్ మధుమథన నారాయణహరే**
**మురారే గోవిందేత్యనిశ మవనేష్యామి దివసాన్॥** 3

కావేరీతట పరిసరే=కావేరీనదీతీర సమీపమున, రంగనగరే=శ్రీరంగమున, భోగి+ఇంద్రే=ఆదిశేషుని పై, శయానమ్=పరుండియున్నవాడు, శతమఖమణి శ్యామలరుచిమ్=ఇంద్రనీలమణి వంటి పచ్చని రంగను కలవాడును అగు స్వామిని, ఉపాసీనః=ఉపాసించువాడనై, మధుమథన=మధుసూదనా!, నారాయణ= నారాయణా!, హరే=హరీ, మురారే=మురారీ!, గోవింద=గోవిందా!, ఇతి=అని, అనిశమ్=ఎల్లప్పుడు, క్రోశన్=పలవరించుచు, అహమ్=నేను, కదా=ఎపుడు, దివసాన్=దినములను, అవనేష్యామి=గడుపగలను?

కావేరీ తీర సమీపముననున్న రంగనగరములో ఆదిశేషునిపై పవళించియున్న వాడు, ఇంద్రనీలమువంటివాడును శ్రీరంగనాథుని భక్తితో ఆరాధించుచు, "మధుసూదనా! నారాయణా! హరీ! మురారీ! గోవిందా!" అనుచు ఆ స్వామి గుణములను తెలుపు నామములను పలవరించుచు దినములను గడుపు సమయము నాకు ఎపుడు వచ్చునో కదా!

ఈ శ్లోకమున "కావేరీతట పరిసరే" అను ప్రయోగమును "రంగనగరే" అను పదముతో చేర్చి అన్వయించుటకంటే, 'కావేరీతట పరసరే క్రోశన్' అని అన్వయించుట మిక్కిలి స్వరసము. పూర్వాన్వయమున శ్రీరంగము కావేరీ నది తీరముననున్నదని శ్రీరంగనాథుడు "తేటనైన నీటిని కల కావేరి తన కెరటములను చేతులతో సేవింపగా పరుండియున్నాడనియు అర్థము వచ్చును. రెండవ అన్వయమున తాము (కవి) కావేరీ నదీ తీరమున నుండి "మధుసూదన! నారాయణ!" అను మొదలగు నామములను అనుసంధించుచు కాలక్షేపమును

చేయుటకు కుతూహలపడుట తెలుపబడినది. ఈ శ్లోకమును చూచిన శివభక్తులు ఒకరు, "కదా వారాణస్యామమరతటినీ రోధసి వసన్ వసానః కౌపీనం శిరసి నిదధానో 2/0/జలిపుటమ్, అయే గౌరీనాథ! తిపురహర! శంభో! త్రినయన! సితేతి క్రోశన్ నిమిషమివనేష్యామి దివసాన్" అను శ్లోకమును రచించిరి.

**శతముఖమణిశ్యామల రుచిమ్**-భట్టరు శ్రీరంగనాథుని "ఫణిశయ మరతకమణి కిరణ గణః" అని కీర్తించుట స్మరణీయము. కవులు నీలవర్ణమును పచ్చని రంగును, నలుపును అభేదముగా వర్ణించుట పరిపాటి. కావున ఇచట నీలవర్ణ హరితవర్ణములు అభేదముతో వర్ణింపబడినది. వృత్తము శిఖరిణి.

**శ్లో॥ కదాహం కావేరీ విమలసలిలే వీతకలుషః**
**భవేయం తత్తీరే శ్రమముషి వసేయం ఘనవనే।**
**కదా వా తం పుణ్యే మహతి పులినే మంగళగుణం**
**భజేయం రంగేశం కమలనయనం శేషశయనమ్॥** 4

కావేరీ విమల సలిలే=కావేరీనది యొక్క నిర్మలమైన నీటిలో, (అవగాహ్య= స్నానమొనర్చి), వీతకలుషః=పోయిన పాపములను కలవాడనై, అహమ్=నేను, కదా=ఎపుడు, భవేయం=కాగలను?, తత్తీరే=ఆ కావేరీ తీరమున, శ్రమముషి= శ్రమను పోగొట్టునట్టి, ఘనవనే=గొప్పవనమునందు, వసేయమ్=నివసింతును?, పుణ్యే=పవిత్రమైన, మహతి=గొప్పదైన, పులినే=ఇసుకతిన్నెయందు, (శ్రీరంగ క్షేత్రము నందు), శేషశయనమ్=ఆదిశేషుని పడుకగా కల్గిన, కమలనయనమ్= కమలములవంటి నేత్రములను కల్గిన, మంగళగుణమ్=కల్యాణగుణములను కల్గిన, తమ్=ఆ, రంగ+ఈశమ్=శ్రీరంగనాథుని, కదావా=ఎపుడో కదా, భజేయమ్ =సేవింతును?

కావేరీనది యొక్క స్వచ్ఛమైన నీటిలో స్నానమొనర్చి, పోగొట్టుకొనిన పాపములను కలవాడను నేనెపుడు కాగలను? ఆ నదీతీరమున నున్న, శ్రమహరమైనదగు గొప్పవనమునందు ఎపుడు నివసింపగలను? పవిత్రమైనది, గొప్పదైనది అగు శ్రీరంగక్షేత్రమున కమలాక్షుడు, కల్యాణగుణుడును అగు శ్రీరంగనాథుని నే నెపుడు సేవింతునో కదా!



మొదటి పాదమున 'అవగాహ్య' (స్నానముచేసి) అను పదము అధ్యాహారము చేసికొనతగును.

**కావేరీవిమల సలిలే** - కావేరీ నదీ జలములను గూర్చి దివ్యసూరులు రెండు విధములుగా వచించుట ఇచట స్మరణీయము. కులశేఖరులు, "స్వచ్ఛమైన నీటిని కల కావేరీనది" అనుచు తమ ప్రబంధమున (1-) పలుకగా, భక్తాంఘ్రిరేణులు తిరుమాల అను ప్రబంధమున "తేటపడని, కలగియున్న నీటిచే వ్యాప్తమైన కావేరి" అని తెలిపిరి. "రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా" అను వాల్మీకి సూక్తి చొప్పున నదీ జలములను స్వచ్ఛముగానున్నట్లు వర్ణింపవలసి యుండగా కలుషితములైనట్లు వర్ణించుట ఎట్లు తగును? అను శంకకు పరిహారముగా భట్టరు శ్రీరంగరాజస్తవమున, "దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహమియం శ్రీరేవ పుత్రీవరః శ్రీరంగేశ్వర ఏతదర్హమిహ కిం కుర్యామి తీవాకులా చంచచ్చామర చంద్రచందన మహామాణిక్యముక్తోత్కరాన్ కావేరీం కరీకరైర్విదధతీ పర్యేతి" అనుచు పల్కిరి.

నదీ జలములు ఒక సమయమున (వర్షాకాలమున) కలసియుండుట, శరదృతువులో తేట పడుటయును సహజముకదా! ప్రస్తుతమున భట్టరు కావేరీ జలముల నైర్మల్యమును స్తుతించిరి. కావున కులశేఖరుల సూక్తిని అనుసరించిన దగును.

కావేరీనదికి కల ఈ విమలత్వము కేవలము భౌతిక దృష్టితోనేకాక, పరమార్థ దృష్టిలో కూడా సిద్ధము. ఎందులకనగా, సాక్షాత్తు పరమపదనాథునకు ప్రతిరూప మగు శ్రీరంగనాథుని పాదముల స్పర్శను నిత్యమును కల్గినది కదా కావేరి! గంగానదికి త్రివిక్రమావతార సందర్భమున మాత్రమే భగవానుని పాద సంబంధము కలుగగా, కావేరీ నది దానిని నిత్యము కల్గియుండుట విశేషము. అంతియే కాదు, స్వామిని ప్రకాశింపచేయునట్టి అపూర్వమైన మహిమను కల్గినది. కావుననే గర్వించు గంగాదేవిని చూచి కావేరి పరిహాసముగా నుఱుగు రూపమున మందహాసమును చేయుచున్నదనుచు "శ్యామం వేదరహోవ్యనక్తి పులినే ఫేనైర్హసంతీవ తత్ గంగాం విష్ణుపదీత్వమాత్ర ముఖరాం హేమాపగా"(22) అను శ్లోకమున పల్కిరి కదా! మఱియు వైకుంఠనగరమే శ్రీరంగముగా ఆవిర్భవించి నట్లు విరజానదియే కావేరియయ్యెను. విరజ అనగా రజోగుణము లేనిది. ఇది

తమస్సు లేకుండుటకును ఉపలక్షణము. దాని ప్రతిరూపమైన కావేరియు అట్టిదే. కావున ఆ నది యొక్క విమలత్వము సిద్ధము.

**వీతకలుషః -** పరమపదమును చేరు జీవుడు విరజానదీస్నానముచే తన కల్మషములన్నిటిని పోగొట్టుకొనును. ఆ పాప పంకిలమంతయు విరజానదికి ప్రతిరూపమగు కావేరీ జలములందు స్నానముచేయుటవలన తొలగుననిభావము.

**తత్తీరే శ్రమముషి ఘనవనే -** కావేరీ నదీ తీరములోని ఉద్యానవనములు సకలవిధ తాపములను తీర్చునవి, నిబిడమైనవియును. విప్రనారాయణసూరి తమ ప్రబంధమున కావేరీ నదీతీరములోని తోటల వైభవమును తిరుమాల ప్రబంధమున వర్ణించుచు, "తుమ్మెదలు మధురముగా ధ్వనించుతోట, నెమళ్ళ గుంపులు చేరుతోట, మేఘములు ఉపరిభాగమున సంచరించుతోట, కోయిలలు కూయుతోట, బ్రహ్మాండనాయకుడు నిత్యనివాసముచేయు చోటు'' అనుచు పల్కుట ఇచట స్మరింపతగినది. ఈ శ్లోకములోని భావములకు మెఱుగులు దిద్దు శ్లోకములను భట్టరు శ్రీరంగరాజస్తవమున రచించిరి. "త్రయ్యంతప్రహతి మతీషు వైష్ణవానాం ప్రాప్యాసు ప్రచుర భవశ్రమాపహాసు, కావేరీపరిచితాసు పావనీషు శ్రీరంగోపవనతటేషు'' (27) అను శ్లోకములోని తోటల శ్రమ హరత్వమును, "రంగారామరమ్యస్థలాని క్రముకవన సమోచామేచకాని''(28) అను సూక్తి యందు నిబిడత్వమును తెలిపిరి. శ్లోకములోని ఘనశబ్దమునకు దట్టమైన అనియే కాక, గొప్పదైన అనియు అర్థము. భగవానుని విహారమునకు ఉపయోగపడుట ఆ తోటల యొక్క ఘనతను తెలుపుచున్నది.

**మహతి పులినే -** ఇచట ఇసుకతిన్నె శ్రీరంగక్షేత్రమే. "తత్పుణ్యాం పులిన మిదంతయ్యార్ద్య మధ్యే కావేరి స్ఫురతి'' (26) అనుచు భట్టరు స్వయముగా పల్కిరి కదా!

మూడవ పాదమున "తత్పుణ్యే'' అను పాఠాంతరము అనన్వితము. "పుణ్యాం పులినమ్'' అను విశేషణ విశేష్య భావమునకు అన్వయింపదు. ఇచటి పులినము శ్రీరంగమే. వేదాంతదేశికుల భగవద్ధ్యానసోపానమున "ప్రాదుర్భూతం కనకసంతతే స్సైకతే హంసజుష్టే'' అను శ్లోకములోని సైకత శబ్దమునకును శ్రీరంగమనియే కదా అర్థము.



**శ్లో॥ పూగీకంఠద్వయస సరస స్నిగ్ధనీరోపకంఠాం**
**ఆవిర్మోదస్తిమిత శకునానూదిత బ్రహ్మఘోషామ్।**
**మార్గే మార్గే పథిక నివహై రుంచ్యమానాపవర్గాం**
**పశ్యేయం తాం పునరపి పురీం శ్రీమతీం రంగధామ్నః॥** 5

పూగీ=పోకచెట్లు, కంఠద్వయస=కంఠపర్యంతము వృద్ధిచెందినది, సరస= తీయని, స్నిగ్ధ=స్నేహయుక్తమైనది అగు, నీర=నీటిని, ఉపకంఠామ్=సమీపమున కల్గినది, ఆవిర్మోద=సంతోషము కల్గుటచే, స్తిమిత=స్తబ్దమైన, శకున=పక్షులచే, అనూదిత=అనువదింపబడిన, బ్రహ్మఘోషామ్=వేదఘోషకల్గినది, పథకనివహైః =బాటసారుల సమూహములచే, మార్గేమార్గే=ప్రతి మార్గమునందు, ఉంచ్యమాన +అపవర్గామ్=సేకరించి గ్రహింపబడు అపవర్గమును (అనగా మోక్షమును) కల్గినది అగు, రంగధామ్నః=శ్రీరంగనాథుని, తామ్=ఆ, శ్రీమతీమ్=సంపదను కల్గిన, పురీమ్=నగరమును, పునః=తిరిగి, పశ్యేయం అపి=చూడగలనా?

పోకచెట్లు కంఠము ఎత్తువరకు వృద్ధిచెందిన, తేనె కూడిన స్నేహగుణమును కల్గినదగు నీటిని సమీపమున కల్గినది, ఆనందమును పొందుటచే స్తబ్ధముగా నున్న పక్షులచే అనువదింపబడిన వేదఘోషను కల్గినది, దారిలో ఎల్లెడల పథికుల సమూహములచే సేకరింపబడిన అపవర్గమును కల్గినదగు శ్రీరంగనాథుని ఆ దివ్యమైన నగరమును ఎపుడు సేవింతునో కదా!

ఇందు శ్రీరంగనగరములోని నీటి సమృద్ధి, ఆ నీటి యొక్క భోగ్యత, అచట తోటలో నివసించు పక్షుల సంతోషాతిశయము, ఆ ప్రదేశము యొక్క పావనత్వము దివ్యత్వమును సూచితములు.

శఠకోపసూరి తమ ప్రబంధమున "వేంకటాద్రిని దర్శించిన మాత్రముననే మన పాపములు తొలగును'' అని పల్కిరి. కావున భగవానుని దర్శించుట కంటే ఆ స్వామి భక్తులను అధివసించియుండు దివ్యదేశమును సేవించుటయే గొప్ప భాగ్యమని ఏర్పడుచున్నది. అట్టి భావముతో ఇందు భట్టరు శ్రీరంగనగరమును ఎపుడు దర్శింతునో కదా అని పల్కుచున్నారు. శ్లోకములోని మూడు పాదములు శ్రీరంగనగరమును వర్ణించుచున్నవి.

**పూగీకంఠద్వయస సరస స్నిగ్ధనీరోపకంఠామ్ -** శ్రీరంగరాజస్తవమున భట్టరు "కదళవకుళజంబూపూగ మాకందకంఠద్వయస సరస నీరామ్" అనుచు పల్కుట ఇచట అనుసంధేయము. కావేరీ తీరమున పోకచెట్లు ఎత్తుగా పెరిగి వృద్ధిచెందినవి. కాని కంఠము ఎత్తు వరకు నీటి ప్రవాహము పొంగిపొఉచున్నది. ఆ ప్రవాహ జలము తేనెతో కూడినదగుటచేత తీయనిది. స్నేహగుణమును కల్గినది. "ప్రవాహ జలము వ్యాపించి, ప్రవహించునట్టి శ్రీరంగము" అని భక్తాంఘ్రిరేణులు వచించిరి కదా!

**ఆవిర్మోదస్తిమిత......బ్రహ్మఘోషామ్-**కావేరీ తీరమున పరమైకాంతులు, వేద విదులును, నిత్యకర్మానుష్ఠానమును చేసికొని, బ్రహ్మయజ్ఞరూప పారాయణము ను చేయుగా, దానిని వినిన అచటి చిలుకలు మొదలగు పక్షులు ఆ వేదవాక్యములను అనువదించుచున్నవి. ఈ సందర్భమున శ్రీరంగరాజస్తవము లోని "త్రయ్యంత ప్రహతి మతీషు ........ పావనీషు శ్రీరంగోపవనతటేషు" అను సూక్తి అనుసంధేయము. విష్ణుచిత్తులు తమ ప్రబంధమున "పెద్ద ఱెక్కలను కల తుమ్మెద సంధ్యాసమయమున సర్వస్వామి యగు శ్రీరంగనాథుని దివ్యగుణములతో భక్తితో పాడుచు" (4-8-8) అని, "పక్షి సమూహాలు పూలలో అమరియుండి పక్షీంద్రుని కీర్తిని పొగడుచు" (4-9-5) అనియు పల్కుట ప్రస్తుత భట్టరు సూక్తికి మూలము.

**"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః"** అనునట్లు వేదమంతయు భగవానుని ప్రతిపాదించునదియే. అట్టి వేదమును కావేరీనదీ తీరములోని పక్షులు అనువదించుట అనగా భగవానుని గుణకీర్తనమును చేయుటమే కదా! శ్లోకములోని మొదటి రెండు పాదముల భావమునకు అనుగుణముగా విష్ణుచిత్తప్రబంధము లోని, "పరిశుద్ధముగా ఉతికి, ఆరబెట్టిన వస్త్రములను ధరించువారై, పవిత్రమైన వేదమును తమకు నిరూపకముగా కల్గిన వారైన శ్రీవైష్ణవులు గంగకంటే పవిత్రమైన కావేరీనది ఘట్టములందు గుంపులు గుంపులుగా స్నానము చేయుటవలన అంతట కెరటములు ఎగసిపడగా, పూవుల నాళములు అటు నిటు కదలాడినవి. అపుడు ఆ పూలలోని తేనె అచటి ఇసుక తిన్నెలపై స్రవించినది. అట్టి మహిమ కల్గినది శ్రీరంగదివ్యనగరము" (4-8-1) అను సూక్తి అనుసంధేయము.



**మార్గే మార్గే .... అపవర్గామ్ -** శ్రీరంగవమున వీథులలో అంతట పయనించు వారు మోక్షమును సేకరించి పొందుచున్నారనుటకు దారిలో అంతయు పయనించు వారికి ముక్తి హస్తగతమైయుండునని తాత్పర్యము. శ్రీరంగవాసమే ముక్తి అని కొందఱు వ్యాఖ్యానింతురు. "కావేరీ విరజా సేయం వైకుంఠ రంగమందిరమ్, స వాసుదేవో రంగేశో ప్రత్యక్షం పరమం పదమ్" అను ప్రసిద్ధి కలదు కదా! కావున ఇట్టి శ్రీరంగదివ్యక్షేత్రమును నేను తిరిగి ఎపుడైన ఒకసారి అయినను సేవింప గల్గుదునా? అని తమ ఆర్తిని భట్టరు వెలిబుచ్చిరి. నాల్గవపాదములోని "అపి" అను అవ్యయము ప్రశ్నార్థకము.

**శ్లో॥ నజాతు పీతామృతమూర్ఛితానాం**
**నాకౌకసాం నందన వాటికాసు।**
**రంగేశ్వర! త్వత్పదమాశ్రితానాం**
**రథ్యా శునా మన్యతమో భవేయమ్॥** 6

రంగ+ఈశ్వర=శ్రీరంగనాథా!, నందనవాటికాసు=దేవేంద్రుని ఉద్యానవాటిక లందు, (నందనవనమందు), పీత+అమృతమూర్ఛితానామ్=అమృతమును త్రాగి మైకమును పొందిన, నాకౌకసామ్=దేవతలలో, అన్యతమః=ఒకడను, న జాతు భవేయమ్=ఎప్పటికిని కాను, త్వత్పదమ్=నీ నివాస స్థానమగు శ్రీరంగమును, ఆశ్రితానామ్=ఆశ్రయించినవారి యొక్క, రథ్యా=వీథులందు(తిరుగాడు), శునామ్=శునకములలో, అన్యతమః=ఒకడను, భవేయమ్=అగుదును.

శ్రీరంగనాథా! దేవేంద్రుని నందనవనమున అమృత పానమును చేసి, మైకమును పొందినట్టి దేవతలలో ఒకడను అగుటను నేను కోఱను. నీ నివాసమగు శ్రీరంగమును ఆశ్రయించి, జీవించు మహనీయులు సంచరించు వీథులలో తిరుగు శునకములలో ఒకడనైనను చాలును.

భక్తాంఘ్రిరేణులు తమ ప్రబంధమున, "ఇంద్రలోకమును ఏలు ఆ ఆనందమును సైతము నేను కోరను. శ్రీరంగనాథా! ఇచటనే ఉండి నీ దివ్య సుందరరూపమునే దర్శింప కోరెదను" అను సూక్తి ఇచట స్మరణీయము. భగద్భక్తులలో కొందరు ప్రార్థించునపుడు వేరు జన్మము వలదని, ముక్తిని

ప్రసాదించుమని వేడెదరు. గోదాదేవి, "ఎప్పటికి ఏడేడు జన్మలందును నీతో సంబంధమును కలిగియుండుటయే కోరెదము'' అని తిరుప్పావై (20) ప్రబంధమున పల్కుటచే ఎన్ని జన్మలు సంభవించినను అవి తమకు అనిష్టములు కావని, తమకు కల్గు జన్మలు అన్నియు దివ్యదేశవాసమునకు అనుకూలములైనచో అవి ఉపాదేయములే అని భావించినట్లు తెలియుచున్నది కదా! ఇట్టి భావమునే పులువురు దివ్యసూరులు వెలిబుచ్చిరి. భట్టరు ఆ క్రమములోనే ఈ శ్లోకమును రచించిరి. మిక్కిలి ఉన్నతమైన దేవతోపభోగము నేను వాంఛింపను. శ్రీరంగ క్షేత్రమున వీథులలోని తలుపులు తెఱచియుంచిన ఇండ్లలో ప్రవేశించు శునకములలో ఒక్కడుగా పుట్టిన చాలును అని భట్టరు హృదయము. ఈ కవియే శ్రీరంగరాజస్తవమున "అకృత సహజదాస్యాః సూరయః'' అను శ్లోకమున శ్రీరంగ క్షేత్రమున నున్న మనుష్య-తిర్యక్-స్థావరములన్నియు నిత్యులు ముక్తులేనని తెలుపుట ఇచట అనుసంధేయము.

ఈ ఆఱు శ్లోకములతో కూడినదే శ్రీరంగనాథ స్తోత్రము. ఇకపై వ్యాఖ్యానింప బడు రెండు శ్లోకములు ముక్తకములని, పిమ్మట ఇందు చేర్చబడినవని పెద్దల అభిప్రాయము.

**శ్లో॥ అసన్నికృష్టస్య నికృష్టజంతోః**
**మిథ్యాపవాదేన కరోషి శాంతిమ్।**
**తతో నికృష్టే మయి సన్నికృష్టే**
**కాం నిష్కృతిం రంగపతే కరోషి॥ 7**

రంగపతే=శ్రీరంగనాథా!, అసన్నికృష్టస్య=(నిజమునకు)నీ సమీపమునలేని, నికృష్టజంతోః=నీచప్రాణియగు శునకము యొక్క, మిథ్యా+ అపవాదేన=అసత్య మైన నెపముతో, శాంతిమ్=శాంతికర్మను, కరోషి=చేయుచున్నావు, తతః=ఆ శునకముకంటే, నికృష్టే=నీచుడనైన, మయి సన్నికృష్టే=నేను సమీపించినవాడను కాగా, కామ్=ఎట్టి, నిష్కృతిమ్=శాంతిని, కరోషి=చేయుచున్నావు?

శ్రీరంగనాథా! శునకము నీ సన్నిధిలో ప్రవేశించినదను అసత్యవ్యాజమున నీవు శాంతి కర్మను చేయించితివి. కాని, నేను ఆ శునకము కంటెను నీచుడను. అట్టి నేను నీ వద్దకు వచ్చినపుడు ఏ పరిహారమును చేయింతువు?



ఈ శ్లోకమును భట్టరు రచించుటకు ఒక సంఘటన మూలమని పెద్ద లందురు. భట్టరు ఒకనాడు శ్రీరంగనాథుని తిరువీథి ఉత్సవమును సేవించుటకై తమ ఇంటి నుండి బయలుదేరి, పొన్నచెట్టు వద్దకు వచ్చి, అచటనున్న ఆచార్యులతో ఉభయవేదాంతరహస్యములను గూర్చి ముచ్చటించుచుండిరి. ఆలయ పరిచారకులు ముందుగా వచ్చి శ్రీరంగనాథుని ఉత్సవమును గూర్చి తెలుపుట పరిపాటి. ఆనాడు ఎంత సమయమైనను ఎవరును రాలేదు. చాల ఆలస్యమైనను ఏ కారణము వలన స్వామి వీథి ఉత్సవము జరుగలేదు? అను సందేహమును తీర్చుకొనుటకై భట్టరు స్వయముగా ఆలయములోనికి పోయి విచారింపగా, ఒక శునకము కోవెలలోనికి వచ్చుటచే, అందులకు తగిన శాంతి హోమమును జరుపవలసివచ్చెను. అందుచే స్వామి ఉత్సవమునకు ఆలస్యమయ్యెను అని భట్టరు తెలిసికొని, శ్రీరంగనాథుని సమక్షమున ప్రస్తుత శ్లోకమును ఆశువుగా విన్నవించిరి. శునకము ఆలయములో ప్రవేశించినను, ఏదో ఒక మూల దాగియున్నదే తప్ప గర్భగృహములోనికి పోలేదు. అందులకే ఇంతటి పరిహారమును జరిపినచో, ఆ కుక్క కంటే నికృష్టుడనగు నేను నీ ముందుకు వచ్చితిని, ఇపుడు ఎట్టి పరిహారమును చేయింతువు? అనుచు రస్యముగ భట్టరు భగవానుని ప్రశ్నించుట ఇచటి విషయము.

**"మిథ్యాపవాదేన"** అను ప్రయోగ స్వారస్యమును కొందఱు పెద్దలు ఇట్లు చమత్కారముగ వివరింతురు. శ్రీరంగములోని ఆలయములో శాంతిహోమము జరిపినపుడు అర్చక-పరిచారక వర్గమునకు ధనలాభము కల్గు అవకాశము కలదు. కావున ఒక్కొక్కప్పుడు వారిలో కొందరు కుక్కపిల్లను బుట్టలో పెట్టి, ఆలయము లోనికి పోయివదలి, "అయ్యో! కుక్క లోనికి వచ్చినదే! శాంతిహోమము జరుప వలెను'' అని అందురట. కొన్ని సమయములలో ఇట్టి ప్రయత్నము కూడ లేకనే ఊరకనే "కుక్కలోనికి పరుగెత్తినది, నేను చూచితిని'' అని అసత్యమును పల్కి, శాంతి హోమమును చేయింతురట. ఈ విషయము భట్టరు చెవికి సోకుటచే "మిథ్యాపవాదేన కరోషి శాంతిమ్'' అని పల్కిరి, అని మహావిద్వాన్ ప్ర.భ.అణ్ణాస్వామి వివరించిరి. ముందు శ్లోకమున "రథ్యా శునా మన్యతమో భవేయమ్'' అని పల్కుటను బట్టి ఈ ముక్తక శ్లోకమిచట చేర్చబడియుండవచ్చును. భట్టరు

నైచ్యానుసంధానము కొఱకే తమను శునకముగా పేర్కొనుట శ్రీరంగరాజస్తవము ఉత్తరశతకములోని "శ్వేవదేవవషట్కృతం త్వాం శ్రియో2ర్థమకామయే'' (99) అను శ్లోకములో కూడ గమనింప తగినది.

**శ్లో॥ శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ**
**శ్రీకూర్మం పురుషోత్తమంచ బదరీనారాయణం నైమిశమ్।**
**శ్రీమద్వారవతీప్రయాగ మధురాయోధ్యా గయా పుష్కరం**
**సాలగ్రామఖనిం నిషేవ్యరమతే రామానుజో2యం మునిః॥ 8**

అయమ్=ఈ, రామానుజః మునిః=శ్రీరామానుజమునులు, శ్రీరంగమ్=శ్రీరంగమును, కరిశైలమ్=హస్తిగిరిని, అంజనగిరిమ్=వేంకటాచలమును, తార్క్ష్య+అద్రి=మేల్కోటై అనబడు తిరునారాయణపురమును, సింహాచలౌ=సింహాచలమును, శ్రీకూర్మమ్=శ్రీకూర్మమును, పురుషోత్తమమ్=పురుషోత్తమ క్షేత్రమును, బదరీనారాయణమ్=బదరికాశ్రమమును, నైమిశమ్=నైమిశారణ్యమును, శ్రీమత్+ద్వారవతీ=ద్వారకను, ప్రయాగ=ప్రయాగను, మధురా=మధురా నగరమును, అయోధ్యా=అయోధ్యా నగరమును, గయా=గయను, పుష్కరమ్=పుష్కరక్షేత్రమును, సాలగ్రామఖనిమ్=సాలగ్రామమును నిషేవ్య=సేవించి, రమతే =ఆనందిచుచున్నాడు.

ఇది భగవద్రామానుజుల దివ్యక్షేత్రయాత్రను గూర్చి నిత్యానుసంధానమును చేయుటకొఱకై ఈ స్తోత్రరచనకు పూర్వమే భట్టరు రచించిన ముక్తకము. మూడవ పాదము మొత్తము సమస్తపదము. "సర్వోద్వంత్వో విభాషయా ఏకవత్ భవతి'' అను పరిభాషను బట్టి ఏకవచనాంతము అయినది. "అయోధ్యా గయాః'' అను విసార్గాంతముగా కూడ పాఠము కలదు. అపుడు అంతవరకు సమస్తపదము ద్వితీయా విభక్తి బహువచనాంతరూపము. ఇదియు అర్థవంతమైన పాఠమే.

శ్రీరంగమును, హస్తిగిరిని, వేంకటాద్రిని, తిరునారాయణపురమును, సింహాచలమును, శ్రీకూర్మమును, పురుషోత్తమ క్షేత్రమును, బదరికాశ్రమమును, నైమిశారణ్యమును, ద్వారకను, ప్రయాగను, మధురను, అయోధ్యను, గయను పుష్కరమును, సాలగ్రామమును సేవించిన ఈ భగవద్రామానుజ ముని ఆనందమును పొందుచున్నారు. **ః శ్రీః**

# మున్నుడి

శ్రీరంగరాజ వింశతి అనబడు ప్రస్తుత స్తోత్రము శ్రీరంగములోని అర్చారూప మగు శ్రీరంగనాథుని స్తుతించు ఇరువది శ్లోకములతో కూడిన లఘుకృతి. సంస్కృత సాహిత్యములో వేదకాలము నుండి నియమిత సంఖ్యా నిబద్ధములగు కృతులు రచింపబడుట సర్వవిదితమైన విషయము. పంచాశత్(50) వేదవాక్యము లతో కూడిన భాగములే పనసలుగా మారెననుట ఇందులకొక ఉదాహరణము. అట్లే నక్షత్రములకు సంబంధించిన అష్టకవాక్యములును వేరొక నిదర్శనము.

సంస్కృతమున ఇరువది శ్లోకములతో కూడిన స్తుతులును కొన్ని కన్పించు చున్నవి. వేదాంతదేశికుల గోపాలవింశతి, వరవరమునుల యతిరాజ వింశతి మొదలగునవి అట్టివి. శ్రీవైష్ణవ సంప్రదాయమున ఇరువది అను సంఖ్యకు మిక్కిలి ప్రాధాన్యము కలదు. అష్టాక్షరి - ద్వయమంత్రము - శ్రీకృష్ణచరమ శ్లోకము అనబడు రహస్యత్రయములోని పదముల సంఖ్య ఇరువది. అష్టాక్షరిలోని పదములు మూడు, ద్వయమున ఆరు, చరమశ్లోమున పదనొకండు. వీనిని అన్నిటిని కలుపగా వచ్చు సంఖ్య ఇరువది. ప్రస్తుత స్తోత్రమున ఈ మూడు రహస్యములలోని తాత్పర్యము అనుసంధింపబడుటచే ఇందలి శ్లోకముల సంఖ్య ఇరువదిగా నియమితమై యుండవచ్చును. శ్రీవైష్ణవ స్తోత్రసాహిత్యమంతయు రహస్యత్రయ వివరణాత్మకమనుట ప్రసిద్ధమైన విషయము. ఈ స్తోత్రమున శ్లోక సంఖ్య ఇరువది అగుటకు వేరొక హేతువును కూడ చెప్పవచ్చును. శ్రీరంగరాజ వింశతి అనబడు ఈ స్తోత్రము శ్రీరంగరాజ శబ్దముచే నిర్దేశింబడు శ్రీరంగనాథుని గూర్చిన మంగళాశాసనస్తుతి. శ్రీరంగరాజ శబ్దము ఇరువది అను సంఖ్యను సూచించును. ఎట్లనగా - యకారము మొదలుగా గల హల్లులలో శకారము అయిదవ అక్షరము కావున అది అయిదును సూచించును, రకారము రెండవ అక్షరము కనుక రెండును తెలుపును. అట్లే, కకారము మొదలుగా గల పది హల్లులలో గకారము మూడవ అక్షరము కావున మూడును నిర్దేశించును. అట్లే, మరల రకారము రెండును తెలుపును. చివరలోనున్న జకారము ఎనిమిదవ అక్షరమగుటచే ఎనిమిదిని తెలుపును. ఈ అంకెలను అన్నిటిని కలిపిన (అనగా $5+2+3+2+8=20$) ఇరువది వచ్చును. శ్రీరంగరాజశబ్దమిట్లు ఇరువది అను సంఖ్యను సూచించుటచే ఆ శబ్దముచే నిర్దేశింపబడు స్వామిని స్తుతించు ఈ స్తోత్రమున ఇరువది శ్లోకములుండుట సంఖ్యాశాస్త్రప్రక్రియలో సంగతమే కదా!

తిరుమంత్రమనబడు అష్టాక్షరిలోని మూడు పదములు ఆత్మ యొక్క అనన్యార్హశేషత్వ - అనన్యశరణత్వ - అనన్యభోగ్యత్వరూప లక్షణములను తెలుపును. ద్వయములోని పూర్వఖండము సలక్ష్మీకుడైన భగవానుని ఆశ్రయింప తగునని, ఉత్తరఖండము ఆ స్వామికి స్వరూపానురూప - కైంకర్యమును చేయుటయే పరమపురుషార్థమని తెలుపుచున్నవి.



శ్రీకృష్ణచరమ శ్లోకములోని పూర్వార్థము ఫలాపేక్షలేకుండ శాస్త్రవిహితమైన కర్మాచరణమును చేయుచు, రక్షణ భారమును పరమాత్మయందు నిక్షిప్తము చేసి, శరణాగతిని చేయతగునని, ఉత్తరార్థము అట్టి శరణాగతులకు భగవానుడు అనిష్టనివృత్తి పూర్వక ఇష్టప్రాప్తిని కల్గించునని తెలుపుచున్నవి. ఈ అంశములే ప్రకృత స్తోత్రమునను అనుసంధింపబడినవి."జగదేశబంధో'', లోకబంధో'' వంటి విశేషములు అష్టాక్షరీలో తెలుపబడిన జీవేశ్వరుల మధ్యగల "పితాచ రక్షకః శేషి భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారోమమాత్మాచ భోక్తా చాద్యమనూదితః'' అను నవవిధబంధమును సూచించుటచే అష్టాక్షరీమంత్రార్థము అనుసంధింపబడినది. ప్రథమశ్లోకములోని "శ్రీమన్, కృపాజలనిధే, దేవాధిదేవ పరిపూజిత పాదపద్మ'' వంటి విశేషములు శ్రియఃపతిత్వ, కృపావత్త్వ, దేవాధిదేవత్వ (సౌలభ్య, వరత్వములు) ములను తెలుపుటచే ద్వయములోని పూర్వఖండార్థప్రతిపాదితమైన భగవానుని శరణ్యాత్వము ప్రతి పాదితము. ఇక, స్తోత్రమంతయు మంగళాశాసనాత్మక మగుటచే ఉత్తర ఖండార్ధమును ప్రతిపాదించుచున్నది. "మాదృఙ్మముక్షుజన రక్షణ జాగరూక'' వంటి విశేషణములచే చరమ శ్లోకమున చెప్పబడిన భగవానుని ప్రణత రక్షణ నిర్వాహము సూచింపబడినది. ఇట్లు ఈ స్తోత్రము రహస్య త్రయార్థప్రతిపాదక మనుటలో సందేహము లేదు.

ఈ స్తుతి కర్తృత్వమును గూర్చిన వివరములు స్పష్టముగా లభించుట లేదు. కొన్ని ముద్రితప్రతులలో శ్రీవరవరముని కృతమని ఉన్నను అందులకు ఆధారములు లేవు. కాని, ఈ స్తోత్రము సుమారు 70 సంవత్సరములకు పూర్వము ఆనందాప్రెస్ వారిచే తెనుగులిపిలో ప్రచురింపబడిన స్తోత్రార్ణవము మొదటి భాగమునందు కలదు. కావున ఇది శిష్టపరిగృహీతమని తెలియుచున్నది. ఇందలి పలు శ్లోకములు శ్రీభట్టార్యకృత మైన శ్రీరంగరాజస్తవ - పూర్వ శతకములోని శ్లోకములతో పోలియున్నవి. ఆ సామ్యములు ఆయా శ్లోక వ్యాఖ్యానములలో సంగ్రహముగా తెలుపబడినవి. అట్లే, పలు దివ్యసూరుల సూక్తుల భావములను కూడ ఈ శ్లోకములు ప్రకాశింపచేయుచున్నవి. శ్రీరంగనాథుని దివ్యకృపతో, పెద్దల ఆశీస్సులతో, మిత్రుల సహకారముతో ఈ స్తోత్రమునక యథామతి వ్యాఖ్య వ్రాయబడినది. గుణగ్రహణపారీణులు, దోషజ్ఞులును అగు విజ్ఞులు ఈ ప్రయత్నమును సహృదయతతో కటాక్షించి ఆశీర్వదింతురని తలంతును.

భవదీయుడు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

**శ్లో॥ వ్యాఖ్యేయం రంగరాజస్య వింశతే రాంధ్రవాఙ్మయీ।**
**శింగరార్యకృతా భూయాత్ విదుషాం ప్రీతయే సదా॥**

# శ్రీః

## శ్రీ వరవరముని కృతమ్

# శ్రీరంగరాజ వింశతి

### శ్రీ సేవా వ్యాఖ్య ఈ.ఏ.శింగరాచార్యులు

**శ్లో॥ శ్రీమన్! కృపాజలనిధే! జగదేకబంధో!**
**దేవాధిదేవ పరిపూజిత పాదపద్మ!**
**హేమాపగా పులిన మధ్య నివాసశీల!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 1

శ్రీమన్=లక్ష్మితో నిత్యయోగమును కలవాడా!, కృపాజలనిధే=కరుణకు సముద్రమువంటి వాడు!, జగదేకబంధో=జగత్తునకు ఏకైక బంధువైనవాడా!, దేవ+అధిదేవ=దేవతలకు ప్రభువగు ఇంద్రునిచే, పరిపూజిత=బాగుగా పూజింపబడిన, పాదపద్మ=పద్మముల వంటి పాదములను కలవాడా!, హేమ+ఆపగా= "పొన్ని" అనబడు కావేరీనది యొక్క, పులిన=ఇసుక తిన్నె యొక్క, మధ్య= నడుమ, నివాసశీల=నివసించుట స్వభావముగా కలవాడా!, సింధుతనయాప్రియ= సముద్రుని కుమార్తెఅగు లక్ష్మికి ప్రియుడా!, రంగ+ఈశ= శ్రీరంగనాథా!, తే=నీకు, మంగళమ్=శుభమగుగాక!

ఎల్లప్పుడు లక్ష్మితో కూడియుండువాడా!, కరుణాసముద్రుడా!, జగత్తునకు ఏకైక బంధువా!, ఇంద్రునిచే ఆరాధింపబడిన పాదపద్మములను కలవాడా!, కావేరీ నది ఇసుక తిన్నె మధ్యగల శ్రీరంగక్షేత్రమున వెలసి అచట నిత్యవాసమును చేయువాడా!, లక్ష్మికి ప్రియమైనవాడా!, శ్రీరంగనాథా! నీకు మంగళమగుగాక!

**శ్రీమన్** - "నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ", "పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా", "నిత్యానపాయినీమ్" ఇత్యాది సూక్తులు లక్ష్మీదేవి భగవానుని ఎల్లప్పుడు వెంట నంటియుండునని తెలుపుచున్నవి. ఇట్లు ఆమె ఎల్లప్పుడు స్వామితో కలసి యుండుటకు గల కారణములను అభిజ్ఞులు రెండు



విధములుగా తెలియజేసిరి. భగవానునిపై తనకు గల ప్రేమాతిశయము ఒక కారణము కాగా, ఆశ్రితులను రక్షించుటలో గల అభినివేశము వేరొక కారణము. నిరంకుశస్వాతంత్ర్యమునుకల భగవానుడు కరుణాళువు అయినను జీవుడు చేయు అసహ్యాపచారములకు విసుగుచెంది, కోపించి, శిక్షింతునని పల్కినపుడు, తన చల్లని పలుకులతో ఆ కోపమును చల్లార్చి, భక్తులను అతడు రక్షించునట్లు చేయు స్వభావమును జగన్మాతయగు లక్ష్మికి కలదు కదా!

**కృపాజలనిధే** - లక్ష్మీదేవితో కలసియుండుట వలన ఏర్పడు ఫలమును ఈ విశేషణము సూచించుచున్నది. భగవానుడు లక్ష్మీదేవితో నిత్యయోగమును కలవాడగుటచేతనే అతడు కృపాజలనిధి అయ్యెనని తాత్పర్యము. ఈ అన్వయము నహినిందాన్యాయమున చేయబడినదే కాని, భగవానుని కరుణ సోపాధికమని అర్థము కాదని మాత్రము గ్రహింపనగును.

**జగదేక బంధో** - "పితా త్వం మాతా త్వం దయిత తనయ స్త్వం ప్రియసుహృత్, త్వమేవ త్వం మిత్రం గురురసి గతిశ్చాసి" అను యామునుల సూక్తి భగవానుడు సర్వవిధబంధువని తెలుపుచున్నది కదా! "పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః, స్వామ్యాధారో మమాత్మా చ భోక్తాచాద్య మనూదితః" అనునట్లు అష్టాక్షరీమంత్రము ఇట్టి సర్వవిధబంధుత్వమును చాటుచున్నది. లోకములోని బంధువులందఱు ఆభాసబంధువులు మాత్రమే. వారితో మనకు గల సంబంధము సోపాధికము, కావున మిక్కిలి అనిత్యము. అంతియే కాదు, తండ్రి తల్లి కాలేడు, తల్లి తండ్రి కాలేదు కదా! ఇట్లు సంబంధమును పరిమితమే. భగవానునితో మనకుగల సంబంధము అట్టిది కాదు. స్వామితో మనకు సకలవిధ సంబంధమును కలదు. అది నిరుపాధికము కావున సహజము, నిత్యము. అతడే నిజమైన బంధువు. ఏకైక బంధువు. "కన్న తల్లిని నీవే, జన్మకు కారణమైన తండ్రివి నీవే" అనుచు ఆళ్వార్లు స్తుతించిరి కదా!

**దేవాధిదేవ పరిపూజిత పాదపద్మ** - "ఇంద్రో మహేంద్ర స్సురనాయకః" అనునట్లు దేవతలందఱిలో ఇంద్రునకు ప్రాధమ్యము కలదు. అట్టి ఇంద్రుడును అవశుడై భగవానుని ఆరాధించిన సందర్భములెన్నియో కలవు. గోవర్ధనోద్ధరణము, పారిజాతాపహరణము మొదలగు వృత్తాంతములందు ఇంద్రుడు పరాజితుడై

స్తుతించుట సుప్రసిద్ధము. ఇంద్రునకు ఎపుడు ఆపద కల్గినను సహాయమునకై అర్థించినది స్వామినే కదా!

**హేమాపగా పులిన మధ్యనివాసశీల -** కావేరీనదికి హేమాపగ అని పేరు. ఈ పేరు ద్రావిడములోని "పొన్ని" అను పదమునకు సంస్కృతీకరణము. పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవమున "హేమాపగా హంత్వఘమ్" (22) అనుచు కావేరీనదిని ఈ పేరుతోనే నిర్దేశించిరి. కావేరీనది ఇసుకలో బంగారము కలదని, అందువలన ఆ నదికి అట్టి పేరు వచ్చెనని కొందఱు అందురు. "కనకా" అను ఉపనది కావేరీనదిలో కలియుటవలన ఈ పేరు వచ్చెనని మఱి కొందరు భావింతురు. అట్టి కావేరీనది మధ్యలోని ఇసుకతిన్నెలో అనగా ద్వీపమున నివసించు స్వభావమును కలవాడని తాత్పర్యము. "తత్పుణ్యం పులిన మిదం తయా2ద్యమధ్యే కావేరి స్ఫురతి" అనుచు భట్టరు శ్రీరంగరాజస్తవమును బట్టి, పరమపద - క్షీరాబ్ధి - యోగిహృదయములలో నెలకొని యుండుటకన్న, శ్రీరంగాదిక్షేత్రములలో నిత్యవాసము చేయుట స్వామి యొక్క స్వభావమని, కావున మిక్కిలి ఇష్టమని స్ఫురించుచున్నది.

**సింధుతనయా ప్రియ -** "సింధూతనయా ప్రియా యస్య సః" అని, "సింధు తనయాయాః ప్రియః" అనియు రెండు విధములైన విగ్రహవాక్యములను ఈ సమాసమునకు చెప్పవచ్చును. మొదటి వివరణమునకు "లక్ష్మీదేవి ఎవరికి ప్రియురాలో అతడు" అని, రెండవ వివరణమునకు "సముద్రరాజపుత్రికి ప్రియు" డనియు అర్థము. ఈ రెండు వివరణముల వలన దివ్యదంపతుల నిత్య సాన్నిహిత్యము, పరస్పర ప్రేమాభిమానములును వ్యక్తమగుచున్నవి. "రాఘవో2ర్హతి వైదేహీం తం చేయమసితేక్షణా" అనునట్లు ఆనురూప్యమును సిద్ధము.

**తే మంగళమ్ -** అట్టి నీకు మంగళము. ఈ విధముగా కవి ప్రస్తు శ్లోకమున శ్రీరంగనాథుని లక్ష్మీనిత్యయోగత్వమునకు, కరుణాస్వభావమునకు, సర్వవిధ బంధుత్వమునకు, దేవేంద్రునిచే పూజింపబడుటకు, శ్రీరంగమున నిత్య నివాసమును కల్గియుండుటకు, లక్ష్మీప్రియత్వమునకును మంగళమాశాసించిరి. శరణ్యునకే మంగళాశాసన కైంకర్యమును చేయదగును. "శక్తత్వేనతి దయావత్త్వమ్ "శరణ్యత్వమ్" అను సూక్తివలన శక్తిని, దయను కల్గియుండువాడే శరణ్యుడని



ఏర్పడుచున్నది. ప్రస్తుత శ్లోకమున గల "జగదేకబంధో", "దేవాధిదేవపరిపూజిత పాదపద్మ" ఇత్యాది విశేషణములు సామర్థ్యమును, "శ్రీమన్, కృపాజలనిధే, హేమాపగా పులిన మధ్య నివాసశీల" వంటి విశేషణములు దయావత్త్వమును తెలుపుచున్నవి. కావున శరణ్యుడగు శ్రీరంగనాథునకు కవి మంగళమాశాసించుట స్వరూపానురూపమైన సేవ అయినది. ఇందు మొదట శ్రీ శబ్దప్రయోగము ద్వారా స్తోత్ర ప్రారంభమున మంగళాచరణమును చేసినట్లయినది. ఇందలి శ్లోకము లన్నియు వసంతతిలక వృత్తమున కూర్చబడినవి. "పాదపద్మ", "కృపాజలనిదే" అను ప్రయోగములు సాలంకారములనుట స్పష్టము. "శ్రీమన్! కృపాజలనిధే" అను ప్రారంభసూక్తి శ్రీ వేంకటేశ ప్రపత్తిలో ప్రారంభమున గల అదే విధమైన సూక్తిని స్మరింపచేయుచున్నది. ఈ స్తోత్రమునందుగల శ్లోకము లన్నిటిలో నాల్గవ పాదము సమాసముగా "రంగేశ సింధుతనయా ప్రియ మంగళం తే" అను మకుటమును కల్గియున్నది.

**శ్లో॥ భోగీంద్ర భోగశయనే శరదభ్రశుభ్రే**
**దేదీప్యమాన ఫణరత్నమయూఖ చిత్రే।**
**స్వామిన్! శయాన! నతరక్షణ జాగరూక!**
**రంగేశ! సింధుతనయా ప్రియ! మంగళం తే॥** 2

శరత్+అభ్రశుభ్రే=శరత్కాలములోని మేఘము వలె తెల్లని, దేదీప్యమాన ఫణరత్నమయూఖచిత్రే=గొప్పగా ప్రకాశించుచున్న పడగలలోని రత్నముల కాంతులచే చిత్రవర్ణమును కల్గిన, భోగి+ఇంద్రభోగశయనే=ఆదిశేషుని శరీరము అను శయనమునందు, శయాన=శయనించియున్న, స్వామిన్=స్వామీ!, నతరక్షణ జాగరూక=భక్తులరక్షణలో మెలకువతో నుండువాడా!, రంగ+ఈశ=శ్రీరంగనాథా! సింధుతనయాప్రియ=లక్ష్మికి ప్రియమైన వాడా!, తే=నీకు, మంగళమ్=మంగళ మగుగాక!

శరత్కాలములోని మేఘమువలె తెల్లనిది, మిక్కిలి వెలుగొందు పడగలలోని రత్నముల కాంతుల వలన చిత్రవర్ణముతో శోభిల్లునది, అగు ఆదిశేషుని శరీరమును పడకపై శయనించియున్న స్వామీ! ఆశ్రితుల రక్షణలో జాగరూకతతో నున్న వాడా! శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగుగాక!

తెల్లనితనము, మెత్తనితనము, సౌగంధ్యము, శైత్యము, విస్తృతి అను అయిదు విధములైన గుణములను ఉత్తమమైన శయనము కల్గియుండును. ఈ గుణములన్నింటిని ఆదిశేషుని రూపములో నున్న శయనమున కలవు. ప్రస్తుత శ్లోకమున మొదటి పాదములో ధావళ్యము అనగా తెల్లనితనము. ప్రస్తుతము స్వామి శయనించియున్నను లోకములోని వ్యక్తులవలె నిద్రింపబడు. నిద్రించువాని వలె కన్నులను మూసికొని యోగనిద్రలోనుండి జగద్రక్షణను గూర్చి చింతించు చుండును. ఈ అర్థమునకు అనుగుణముగా "విశ్వత్రాణ విమర్శనస్ఫవితయా నిద్రాపి జాగర్యయా'' అను శ్రీరంగరాజస్తవసూక్తిని స్మరింపనగును.

ఈ విధముగా కవి ప్రస్తుత శ్లోకమున శేషశయానుడై, భక్తరక్షణ తత్పరుడైన శ్రీరంగనాథునకు మంగళ మాశాసించినట్లు అయినది.

**శ్లో॥ నీలామ్బువాహనిభ మంగళ దివ్యమూర్తే!**
**శ్రీలాలనీయ చరణాంబుజ! దేవదేవ! ।**
**సౌందర్యదుగ్ధజలధే! సుగుణాభిరామ!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 3

నీల+అంబువాహనిభ=నల్లని మేఘము వంటి, మంగళ=శుభకరమైన, దివ్య= గొప్పదైన, మూర్తే=రూపము కలవాడా!, శ్రీలాలనీయ=లక్ష్మీదేవిచే లాలింపతగిన (సేవింపతగిన), చరణ అంబుజ=పద్మముల వంటి చరణములను కలవాడా!, దేవదేవ=దేవాధిదేవా!, సౌందర్యదుగ్ధజలధే=సౌందర్యమునకు పాలకడలి వంటి వాడా!, సుగుణ+అభిరామ=సద్గుణములచే అందమైన వాడా!, రంగ+ఈశ= శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళ మగుగాక!

నల్లని మేఘమువంటి, శుభకరమైన, గొప్పదైన దివ్యమంగళ విగ్రహమును కలవాడా! శ్రీదేవిచే సేవింపబడ తగిన పద్మముల వంటి పాదములను కలవాడా! దేవతలకు ప్రభువైన వాడా! సౌందర్యమునకు పాలసముద్రమువంటి వాడా! సద్గుణ సమూహముచే ఆకర్షణీయమైనవాడా! శ్రీరంగనాథా! లక్ష్మీనాథా! నీకు మంగళ మగుగాక!



భగవానుని దేహవర్ణము నీలవర్ణము కావున నీటిని కల్గియున్న మేఘము యొక్క రంగుతో పోల్చుట కవి సమయము. వర్షించు శక్తిని కల నీలమేఘమునకు భగవానునకు పలువిధముల సామ్యములు కలవు. అడుగకనే నీటిని వర్షించుట, ఎత్తుపల్లముల భేదమును చూడక అంతట సమానముగ వర్షించుట, అడిగిన దాని కంటే అధికముగా వర్షించుట, కంటికి ఆకర్షణీయముగా నుండుట, విరహములో నున్న వారికి తాపమును కల్గించుట, విష్ణుపదమును స్థానముగా కల్గియుండుట, మెఱుపుతో కూడియుండుట మొదలగునవి నీలమేఘము యొక్క ధర్మములు. అట్లే భగవానుడు అద్వేషమును మాత్రమే హేతువుగ తలచి అనుగ్రహించును. తనను అనన్యముగా భజించువారు ఎట్టివారైనను, ఏ కులము నందు జన్మించినవారైనను వారిని అనుగ్రహించును. "గోసహస్రప్రదాతారమ్'' అనునట్లు అడిగిన దానికంటే అధికముగా నిచ్చును. స్వామి రూపము కన్నులకు ఆకర్షణీయమై యుండుట సుప్రసిద్ధము. మహర్షులు, ఆళ్వార్లు వంటి భక్తాగ్రేసరులకు స్వామి రూపము విరహతాపమును కల్గించును. భగవానుని స్థానమగు వైకుంఠమునకు విష్ణుపదమని పేరు. స్వామి ఎల్లప్పుడు మెఱుపుతీగ వంటి లక్ష్మీదేవితో కలసి యుండును. "నీలాంబువాహనిభ'' అనుటను వ్యస్తవిశేషణముగను చెప్పవచ్చును.

శ్రీరంగనాథుని రూపమును భట్టరు పలు శ్లోకములతో నీల మేఘముతో పోల్చుచు వర్ణించిరి. "అద్రౌ శయాళురివ శీతలకాలమేఘః"(82), "సకల జలధిపాన శ్యామజీమూత జైత్రమ్'' ఇత్యాదులు ఉదాహరణములు.

**శ్రీలాలనీయ చరణాంబుజ** - "లక్ష్మీకర సౌఖ్యసాక్షి'' (124), "యుంజాన చేతః కమలాకరేభ్యః సంక్రాంతరాగా వివపాదపద్మా'' (123) ఇద్యాది భట్టరు సూక్తులు నమ్మాళ్వార్లు భగవానుని పాదసౌకుమార్యమును వర్ణించుచు, అతి కోమలమగు తన కరపల్లవములతో లక్ష్మీదేవి ఎక్కడ కందిపోవునో? ఏమో? అను సందేహముతో మెల్లగా సంవాహనము చేయుననిరి, ఇట్టి భావము "లాలనీయ'' పదప్రయోగము వలన స్ఫురించుచున్నదని చెప్పవచ్చును. ఈ సందర్భమున, "లక్ష్మీమహీ తదనురూప నిజానుభావ ................. సంవాహనే2పి సపదిక్లమమాదధానౌ'' అను శ్రీవేంకటేశ్వర ప్రపత్తిలోని సూక్తి స్మరణీయము.

**సౌందర్యదుగ్ధ జలధే** - సౌందర్య మనగా ప్రత్యవయవశోభ. స్వామి సౌందర్యము అనితర సాధారణమైన భోగ్యతను కలిగినది. భట్టరు ఈ విషయమును "ఏకైకస్మిన్ పరమవయవే2నంత సౌందర్యమగ్నమ్" అనుచు ప్రస్తుతించిరి. ఇట్టి భోగ్యతను కల్గియుండుటచే సౌందర్యమును దుగ్ధముతో పోల్చి, అట్టి సౌందర్యమునకు స్వామి సముద్రమువంటివాడనుటచే అది అనంతమగుట తెలుపబడినది.

**శ్లో॥ మార్తాండకోటి సదృశోజ్జ్వల! లోకహృద్య!**
**మాణిక్య దివ్యమకుటోల్లసితోత్తమాంగ!**
**రాకేశమండల నిభానన! దివ్యమూర్తే !**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 4

మార్తాండకోటి సదృశ+ఉజ్జ్వల=కోటి సూర్యులతో సమానముగా ఉజ్జ్వలమైన వాడా!, లోకహృద్య=లోకములోని జనుల హృదయములను ఆకర్షించువాడా!, మాణిక్య=మాణిక్యములతో కూడిన, దివ్య=గొప్పదైన, మకుట=కిరీటముచే, ఉల్లసిత=ప్రకాశింపజేయబడిన, ఉత్తమ+అంగ=శిరస్సును కలవాడా!, రాకా+ఈశమండలనిభ=చంద్రబింబము వంటి, ఆనన=ముఖమును కలవాడా!, (కావుననే), దివ్యమూర్తే=గొప్పరూపమును కలవాడా!, రంగ+ఈశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళమగుగాక!

కోటి సూర్యులతో పోలిన ఉజ్జ్వలమైన రూపమును కలవాడా! లోకములోని జనుల హృదయములకు ఆనందమును కలిగించువాడా! మణులు పొదిగిన కిరీటముచే భాసించు శిరస్సును కలవాడా! చంద్రబింబముతో సమానమైన ముఖ మండలమును కలవాడా! దివ్యమైన రూపమును కల్గినవాడా! శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా! నీకు మంగళము.

**మార్తాండకోటి సదృశోజ్జ్వల** - "దివి సూర్యసహస్రస్య భవేత్ యుగపదుత్థితా యది భాః సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మనః", ఇత్యాది సూక్తులు స్మరణీయములు.

**మాణిక్య దివ్యమకుటోల్లసితోత్తమాంగ** - "ఉత్తమాంగ" శబ్దమునకు శిరస్సు



అని అర్థమున్నను, ఆ అంగములోని భాగమగు ముఖమును ఈ పదము ఉపలక్షించుచున్నదని చెప్పుటకు వీలున్నది. కావున కిరీటశోభచే ప్రకాశించు ముఖమును కలవాడా! అను అర్థము ఈ విశేషణము వలన వ్యక్తమగుచున్నదని చెప్పవచ్చును. ఇందులకు అనుగుణముగా భట్టరు రంగనాథ స్తోత్రములోని "ముక్తాకిరీటోజ్జ్వలమ్ ................ వదనం" అను సూక్తి అనుసంధేయము.

ఈ విశేషణము నుండి క్రమముగా శ్రీరంగనాథుని దివ్యరూపమును కవి కిరీటము మొదలు పాదము వరకు వర్ణించుట గమనింపతగినది. మానవులను అవరోహణక్రమమున అనగా కిరీటము నుండి పాదముల వరకు, దేవతలను ఆరోహణక్రమమున- అనగా, పాదముల నుండి కిరీటము వరకు వర్ణించుట కవి సంప్రదాయము. "మానవా మౌళితో వర్ణ్యాః దేవాశ్చరణతః పునః" అని అలంకారశేఖరమున తెలుపబడినది. కాని, ఇచట కవి కిరీటము నుండి వర్ణించుట ఎట్లు సబబు? అనినచో భగవానుని వర్ణించుటలో ఆచార్యులు ఈ రెండు క్రమములను అనుసరించుట కాననగును. శ్రీ కూరేశులు సుందర బాహు స్తవమున, వరదరాజస్తవమున భగవానుని కిరీటాది పాదాంతము వర్ణించిరి. వారి కుమారులగు భట్టరు శ్రీరంగరాజస్తవమున ఆ క్రమమునే పాటించిరి. ప్రస్తుతము కవి ఆ పద్ధతినే అనుసరించెను. కావున ఎట్టి దోషమును లేదని చెప్పనగును.

**రాకేశమండల నిభావన** - ముఖమును చంద్రబింబముతో పోల్చుట కవి సమయము. "ముఖస్యేంద్వబ్జదర్పణాః" అని అలంకారశేఖరకారుని వచనము. "చంద్రకాంతాననమ్ రామమ్" అనుచు వాల్మీకి శ్రీరాముని వదనము చంద్రుని కంటే ఆకర్షణీయమని పల్కుట ప్రకృతముననను అనుసంధేయము.

**శ్లో॥ కస్తూరికా తిలకలాంఛన శోభమాన!**
**బాలేందు గర్వహర సుందర ఫాలభాగ!**
**లోలంబ నీల కుటిలాలక పంక్తిరమ్య!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 5

కస్తూరికాతిలక లాంఛన=కస్తూరిచే దిద్దబడిన తిలకము గుర్తుచే, శోభమాన=

ప్రకాశించువాడా!, బాల+ఇందు=బాలచంద్రుని, గర్వ=గర్వమును, హర=పోగొట్టు, సుందర=అందమైన, ఫాలభాగ=నుదుటి భాగమును కలవాడా!, లోలంబ= తుమ్మెదలవలె, నీల=నల్లని, కుటిల=గుండ్రని, అలక=ముంగురుల, పంక్తి= వరుసచే, రమ్య=అందమైనవాడా!, రంగ+ఈశ=శ్రీరంగనాథా!, సింధుతనయా ప్రియ=లక్ష్మీప్రియుడా!, తే=నీకు, మంగళం=మంగళము.

కస్తూరీ తిలకముచే భాసించువాడా!, బాలచంద్రుని గర్వమును పోగొట్టు అందమైన ఫాలమును కలవాడా! తుమ్మెదల వలె నల్లని ముంగురులతో శోభిల్లువాడా! రంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళము.

**కస్తూరికాతిలకలాంఛన శోభమాన** - "కస్తూరీ కలితోర్ధ్వపుండ్ర తిలకమ్" అనుచు భట్టరు శ్రీరంగనాథస్తవమున తెలుపుటను గమనింప నగును.

**బాలేందు గర్వహర సుందరఫాలభాగ** - ఫాలమును అష్టమీ చంద్రునితో పోల్చుట కవి సమయము. 'లలాట మర్ధచంద్రేణ" అని అలంకారశేఖరసూక్తి. అట్టి బాలచంద్రుని గర్వమును అణచినది ఫాలభాగము అనుటచే శోభాతిశయము వ్యక్తమగుచున్నది. "జుష్టాష్టమీక జ్వల దిందుసన్నిభం..లలాటం విమలం విరాజతే వనాద్రినాథస్య" (41) అనుచు కూరేశులు సుందర బాహుస్తవమున పల్కుట ఇచట స్మరణీయము.

**లోలంబనీల కుటిలాలక పంక్తి రమ్య** - "రమః శైవాలపాథోదబర్హ భ్రమరచామరైః" అను అలంకారసూక్తి చొప్పున కేశములు తుమ్మెదలతో పోల్చుట కవి సమయము. "లోలంబ నీలకుటిల" అను ప్రయోగమును "లోలంబయుక్త నీలకుటిల" అను మధ్యమపదలోపి సమాసముగా గ్రహించి, "తుమ్మెదలతో కూడిన నల్లని కుటిలములైన" అని అర్థమును చెప్పవచ్చును. "సర్వగంధః సర్వరసః" అని స్తుతింపబడు స్వామి యొక్క కేశములు సుగంధయుక్తములు అగుటచే సుగంధలుబ్ధములగు తుమ్మెదలు అందు చేరియున్నవని తాత్పర్యము. భట్టనాథులును తమ సూక్తమున "ఎఱ్ఱ తామరపూవులో తేనెను భుజించు తుమ్మెదల వలె" అనుచు (1-8-2), కూరేశులు "కేశవహరే రళికాలిజాలం తత్తుల్య కుల్య మధుపాధ్య మహావనన్య" అని (40) సుందరబాహుస్తవమున



పల్కుట పూర్వము చూపిన అన్వయమునకు ఉదాహరణములుగా స్మరింప వచ్చును. అట్లే రెండవ అన్వయమునకు అనుగుణముగా "ఆజానత స్వగత బంధుర గంధలుబ్ధ భ్రామ్యత్ విదగ్ధ మధుపాళి సదేశకేశమ్" (39) అనుచు కూరేశులు సుందర బాహుస్తవమున పల్కుట ఉదహరింపనగును.

**శ్లో॥ కందర్పచాప సదృశాయత సుందరభ్రు!**
**కర్ణాంతలోల కమలోజ్జ్వల చారునేత్ర!**
**నాసాగ్రలంబి పృథులాయత మౌక్తికాఢ్య!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 6

కందర్పచాప=మన్మథుని విల్లుతో, సదృశ=పోలిన, ఆయత=విస్తృతమైన, సుందరభ్రు=అందమైన కనుబొమలు కలవాడా!, కర్ణాంత=కర్ణముల చివరకు వ్యాపించిన, లోల=చలించు, కమల=తామరలవలె, ఉజ్జ్వల=మిక్కిలి ప్రకాశించు, చారు=అందమైన, నేత్ర=కన్నులుగలవాడా!, నాసాగ్రాలంబి=నాసిక చివర వ్రేలాడు, పృథుల=పెద్దదైన, ఆయత=విస్తృతమైన, మౌక్తిక=ముక్కెఱవలన కల్గిన శోభచే, ఆఢ్య=ధనికుడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధు తనయా ప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళమగుగాక!

మన్మథుని వింటితో సమానమైన, పెద్దవైన, అందమైన కనుబొమలు కలవాడా, చెవుల వరకు విస్తరించిన, చంచలములైన తామరలవంటి ఉజ్జ్వలములైన, అందమైన కన్నులను కలవాడా! ముక్కుచివర వ్రేలాడు పెద్ద ముక్కెఱతో ప్రకాశించువాడా!, శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగు గాక!

**కందర్పచాప సదృశాయత సుందరభ్రు** -"వల్లీ స్మరధనుర్వీచి భృంగాలీ వల్లతైర్భ్రువౌ" అను అలంకారశేఖరకర్త వచనము ప్రకారము కనుబొమ్మలు మన్మథుని వింటితో పోల్చుట కవి సంప్రదాయము. శఠకోపసూరి తమ ప్రబంధమున "మన్మథుని తండ్రియగు శ్రీకృష్ణుని భ్రూద్వంద్వము ఆ మన్మథుని నల్లని ధనుస్సు కాబోలు" (7-7-4) అని, భట్టరు శ్రీరంగరాజస్తవమున "స్మరశర నళిన భ్రమాత్ నేత్రయోః పరిసరసమదిక్షు చాపచ్ఛవి" (97) అనియు పల్కుట ప్రస్తుత ప్రయోగమునకు అనుగుణముగా ఉదాహార్యములు.

**కర్ణాంతలోల కమలోజ్జ్వల చారునేత్ర** -నేత్రములు కర్ణాంతము విస్తరించి యుండుట నేత్రవైశాల్యమును తెలుపును, చలించుట శఫర సామ్యమును సూచించును. కమల సామ్యము ఆకారము, రంగు, శైత్యము మొదలగు వానిలో సిద్ధము. ఉజ్జ్వల, చారు పదముల వలన కమలము కంటె ఆధిక్యము ధ్వనించును. ప్రస్తుత ప్రయోగములోని విశేషణముల స్వారస్యమునకు తగినట్లు మునివాహనసూరి తమ ప్రబంధమున శ్రీరంగనాథుని నేత్రములను స్తుతించుచు "వికసించి, మెఱసి, ఎఱ్ఱని రంగును పర్యంతమున కల్గి, విస్తరించిన ఆ పెద్ద నేత్రములు'' అని పల్కుటను స్మరింపనగును. శ్రీరంగనాథుని నేత్రములు ఆకర్ణము విస్తరించుటకు గల హేతువును భట్టరు ఉత్ప్రేక్షించిన తీరు అనితర సాధారణము. శ్రీరంగరాజస్తవములోని "కృపయా పరయా కరిష్యమాణే సకాలాంగం కిల సర్వతో2క్షి నేత్రే ప్రథమం శ్రవసీ నమాన్వగీతే ఇదిదైర్ఘ్యేణ విదంతి రంగనేతుః'' అను శ్లోకమున ఆ హేతువును భట్టరు ఉత్ప్రేక్షించిరి. ఈ శ్లోకములోని భావమును కడు హృద్యముగా అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అను ఆచార్యులు ఇట్లు వివరించిరి. "శ్రీరంగనాథుని కన్నులు కర్ణాంతరము వ్యాపించి, విస్తృతములై యుండుటకు ఒక కారణమున్నదని భట్టరు పల్కిరి. అది ఏమనగా-చేపకు నీటిని అందించినట్లు నిత్యసూరులకు దర్శనమును అనుగ్రహించు పరమపదనాథులకు కన్నులు రెండుగా, రామకృష్ణాది అవతారములు పరిగ్రహించి గుహాదులకు, విదురాదులకు కొందరికి మాత్రము దర్శనమిచ్చి, అల్పకాలము అనుగ్రహించిన అవతారమూర్తికి కన్నులు రెండుగా, సంసారమును పూర్తిగా పోగొట్టనిదే ఇచటినుండి కదలను అని శ్రీరంగమున ఆర్చామూర్తియై, ఆయా వ్యక్తుల తక్కువదనమును గమనింపక దర్శనమిచ్చు శ్రీరంగనాథునకును కన్నులు రెండుగా ఉండతగునా? శ్రీరంగనాథుని కృపను చూచినచో శరీరమంతయూ కన్నులు కావలయును కదా!-అని తలచిన స్వామి నేత్రములు, అన్ని మండలములు తన వశముకావలెనని కోఱు ప్రభువులు ముందుగా తనకు సమీప ప్రదేశములోని బలహీనులను ఆక్రమించునట్లే, మిగిలిన అవయవములన్నియు తామే కావలయునని తలచి, ప్రక్కనే ఉన్నవి చెవులగుటచే వానిని ఆక్రమించి, ఆవలివైపునకు పోవుటకు సమకట్టి, వానితో స్పర్ధించు చున్నట్లున్నవి.'' అట్లే శ్రీరంగనాథుని నేత్రములు చలించుటకు గల కారణమును



భట్టరు ఉత్ప్రేక్షించిన తీరు కూడ పరమరమణీయము. "శ్రవోనాసారోధాత్ తదవధిక డోలాయిత గతే,.....మిథో బద్ధస్పర్ధస్ఫురిత శఫరద్వంద్వలలితే'' అను సూక్తియందు భట్టరు పై కారణమును ఉత్ప్రేక్షించిరి. శ్రీరంగనాథుని నేత్రములు పూర్వోక్త విధానమున అంగములందు అంతట వ్యాపింపవలెనని ప్రయత్నించినను, అటు కర్ణములు ఇటు నాసికయు వాటికి అడ్డు తగిలినవి. ఆ అడ్డంకులను రెండింటిని అది దాటలేక పోవుటచే అటు ఇటు కదలుచున్నవి'' అని, శఫరముల వంటి స్వామి నేత్రములు, చేపలు ఒకదానితే వేరొకటి స్పర్ధించి త్రుళ్ళిపడునట్లు చంచలముగానున్నవని పై సూక్తి తాత్పర్యము. ఇది అంతయు ప్రకృతమున అనుసంధేయము.

**కమలోజ్జ్వల చారు నేత్ర**-కమలములకంటె, మిక్కిలిగా ప్రకాశించు, అందమైన నేత్రములను కలవాడనియు చెప్పవచ్చును. ఇందుచే ఉపమానాధిక్య రూపమైన వ్యతిరేకాలంకారము స్ఫురించును. శఠకోపసూరి భగవానుని నేత్రముల శోభను స్తుతించుచు, "స్వామీ! నిజముగా విచారించి పల్కినచే తామరలు నీ కంటికి, పాదములకు, కరములకు సమానములు కావు'' (3-1-2) అని పల్కుట, కూరేశులు సుందరబాహుస్తవమున "అదీర్ఘ మప్రేమదుఘం క్షణోజ్జ్వలం నచోర మంతఃకరణస్య పశ్యతామ్, అనుబ్జమబ్జంను కథం నిదర్శనం వనాద్రినాథస్య విశాలయోః దృశోః'' అని స్తుతించుటయు ఇందులకు నిదర్శనములు. ప్రస్తుత ప్రయోగమునకు శ్రీరంగనాథస్తోత్రములోని "కర్ణాంతలోలేక్షణమ్'' అను ప్రయోగ సూక్తికిని మధ్యకల అర్థసామ్యము మిగుల రమణీయము.

శ్లో॥ **బింబాధరోష్ఠ! రుచిరస్మిత! కుందదంత!**
**భాస్వత్కపోలమణిదర్పణ రోచమాన!**
**మాణిక్య కుండల విరాజిత కర్ణయుగ్మ!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 7

బింబ+అధర+ఓష్ఠ=దొండపండువంటి (ఎఱ్ఱని) క్రింది పెదవిని కలవాడా!, రుచిర=అందమైన, స్మిత=చిఱునవ్వును కలవాడా!, కుంద=మొగ్గలవంటి, దంత= దంతములను కలవాడా!, భాస్వత్=ప్రకాశించు, కపోలమణిదర్పణ=మణి

దర్పణముల వంటి కపోలములచే (చెక్కిళ్ళచే), రోచమాన=ప్రకాశించువాడా!, మాణిక్యకుండల=మణులు పొదిగిన కుండలములచే, విరాజిత=మిక్కిలి ప్రకాశించిన, కర్ణయుగ్మ=రెండు కర్ణములను కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళము (అగుగాక!)

దొండపండువంటి అధరములను, ప్రకాశించు చిఱునవ్వును, కుందపుష్పము వంటి దంతములను కలవాడా!, వెలుగొందు మణికుండలములతో శోభిల్లువాడా!, మణిదర్పణములవంటి చెక్కిళ్ళను కలవాడా!, శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా!, నీకు మంగళమగుగాక!

ఇందు శ్రీరంగనాథుని అధరము, చిఱునవ్వు, దంతములు, కపోలములు, కుండలములతో శోభిల్లు కర్ణములును ప్రస్తుతములు.

**బింబాధరోష్ఠ** - అధరము ఎఱ్ఱగా నుండుట మహాపురుష లక్షణము. కావున దానిని బింబఫలముతో పోల్చుట పరిపాటి. "ప్రవాళబింబ బంధూక పల్లవై రధరోష్ఠకౌ'' అను అలంకార శేఖరకారుని వచనము స్మరణీయము. దివ్య సూరులను తమ ప్రబంధములలో ఈ పద్ధతినే అనుసరించిరి. వేదాంత దేశికులును దేవనాయక పంచాశత్ స్తోత్రమున "తే బింబాధరం స్పృశతి రాగవతీ మతిర్మే'' అనుచు పల్కుట ఇచట స్మరింపనగును.

**రుచిస్మిత**- స్వామి చిఱునవ్వు భక్తులకు మిగుల ఆకర్షణీయముగా నుండును. "ఎఱ్ఱని నోరు చిఱునవ్వును నా హృదయమును దోచుకొన్నవి.'' అనుచు శఠకోపసూరి ఇందులకు ఒక ఉదాహరణము. "ముగ్ధస్మేర మనోహరాధర దళం'' అను శ్రీరంగనాథస్తోత్ర ప్రయోగము, "నిర్వ్యాజ మందస్మితం'' అను శ్రీరంగరాజస్తవసూక్తి కూడ స్మరణీయములు. శ్రీరంగనాథుని చిఱునవ్వు ఒక గొప్ప రహస్యమును వ్యాఖ్యానించుచున్నదని భట్టరు పల్కుట ఇచట గుర్తుకు తెచ్చుకొనతగినది. "ఏతే శంఖగదాసు దర్శనభృతః క్షేమంకరాబాహవః, పాద ద్వంద్వమిదం శరణ్య మభయం భద్రం చ వో హే జనాః, ఇత్యూచుష్యభయంకరే కరతలే, స్మేరేణవక్త్రేణ తత్ వ్యాకుర్వన్నివ'' అను శ్రీరంగరాజస్తవ శ్లోకమున స్వామి చిఱునవ్వుతో కూడిన ముఖము, ఆయుధసహితములైన బాహువులు



క్షేమమును, పాదద్వంద్వము అభయము నిచ్చుననుటను వ్యాఖ్యానించుచున్న దనిరి. ఈ శ్లోకమునకు ముందు శ్లోకమునను "సంభాషమాణ మావ సర్వవశంవదేన మందస్మితేన'' అని పల్కుటయు గమనింపతగినది. అందఱిని వశపఱచు కొనునట్టి స్వభావమును, మహిమను స్వామి చిఱునవ్వు కల్గియున్నదని "సర్వవశంవదేన'' అను పదము ద్వారా వ్యక్తమగుచున్నది. అట్టి భావమే ప్రకృతమున "రుచిర'' శబ్దము తెలుపుచున్నదనియు చెప్పవచ్చును.

**కుందదంత** - దంతములకు పోలిక కుందమొగ్గలతో, ఈ సామ్యము ఆకారమున, వర్ణమునను కలదు. "ముక్తామాణక్యనారంగదాడిమీ కుందకోరకైః తారాభిః దంతాః'' అను అలంకారశేఖరసూక్తి ఇచట స్మరణీయము. "అధరః కిసల మంఘ్రిపద్మా కుందస్య కోరకా దంతాః''అను ప్రయోగమును గుర్తింప తగినది.

**భాస్వత్కపోల మణిదర్పణ రోచమాన** - ప్రకాశించు చెక్కిళ్ళకు అద్దము నందు పోలిక. నైగనిగ్యమును కల్గి, నునుపుగా, సమతలముగా నుండి స్వచ్ఛముగా ప్రకాశించుట మొదలగు గుణములు ఈ రెండిటికిని సమానములు. స్వామి కపోలములు దివ్యములు కాగా, మణిదర్పణము కేవలము భౌతికమగుట విశేషము కదా! "చంద్రదర్శౌ కపోలస్య'' అను అలంకారశేఖరవచనము, "గండస్థలీ కనకదర్పణ దర్పహంత్రీ'' అను ప్రయోగము ఇచట స్మరణీయములు.

**మాణిక్యకుండల విరాజిత కర్ణయుగ్మ** - "వ్యాలంబికుండలమ్ .... కర్ణపాశ యుగళం'' (48) అను శూరేశుల సుందరబాహుస్తవ సూక్తి స్మరణీయము.

**శ్లో॥ గ్రైవేయకాది పరిభూషిత కంబుకంఠ!**
**శ్రీవత్స కౌస్తుభ సుహృద్య భుజాంతరాళ!**
**ముక్తావళీనిచయ భూషిత పీవరాంగ!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 8

గ్రైవేయక=కంఠాభరము, ఆది=మొదలగు వానిచే, పరిభూషిత=అలంకరింప బడిన, కంబుకంఠ=శంఖమువంటి కంఠమును కలవాడా!, శ్రీవత్స=శ్రీవత్సమను పుట్టుమచ్చచే, కౌస్తుభ=కౌస్తుభమను మణిచే, సుహృద్య=మిక్కిలి హృద్యమైన,

భుజ+అంతరాళ=వక్షఃస్థలము కలవాడా!, ముక్తావలీనిచయ=ముత్యాలహారముల సమూహముచే, భూషిత=అలంకరింపబడిన, పీవర+అంగ=బలిష్టమైన అంగములను కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీ ప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళము (అగుగాక!)

మకరకంఠిమొదలగు ఆభరణములచే అలంకరింపబడిన, శంఖమువంటి కంఠమును కలవాడా!, శ్రీవత్సముచే, కౌస్తుభముచే మనసును దోచునట్టి వక్షఃస్థలమును కలవాడా!, ముత్యాలసరముల సమూహముచే భూషితములైన అంగములను కలవాడా!, శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా!, నీకు మంగళమగుగాక!

ఇందు శ్రీరంగనాథుని కంఠము, వక్షఃస్థలము, అందు అలంకరింపబడిన ఆభరణములును వర్ణింపబడినవి.

**గ్రైవేయకాది పరిభూషిత కంబుకంఠ** - "గ్రైవేయకం కంఠభూషా" అను అమరకోశవచనమును బట్టి గ్రైవేయకమనగా కంఠాభరణము. "కంటె" అని తెనుగున పేరు. స్వామి కంఠము శంఖముతో పోల్చుట కవి సమయము. "కంఠఃకంబ్వోః సమః స్మృతః"అని అలంకార శేఖరకారుని సూక్తి. "కంబుకంధరమ్" అను యామునుల సూక్తిని, "కంబుకంధరధరం" అను కూరేసుల సూక్తిని స్మరింపనగును. "రేఖాత్రయాలంకృతగ్రీవా కంబుగ్రీవేతి కథ్యతే" అను సాముద్రిక శాస్త్ర ప్రమాణము వలన మూడు రేఖలతో కూడుకొన్న కంఠమునకు కంబు కంఠమని పేరు. కావున ఇచట అట్టి అతిశయముతో కూడుకొన్న కంఠమును కవి స్తుతించుచున్నట్లు గ్రహింపనగును. శ్రీరంగనాథుని కంఠమున అట్లు మూడురేఖలుండుటకు కారణమును భట్టరు ఉత్ప్రేక్షించిన ఈ క్రింది శ్లోకము ఇచట ఉదాహార్యము. "రమయతు సమాంకంఠ శ్రీరంగనేతు రుదంచితక్రముక తరుణ గ్రీవాకంబుప్రలంబ మవిమ్లుచః, ప్రణయవిలగ లక్ష్మీ విశ్వంభరాకర కందళీకనయ వలయక్రీడా సంక్రాతరేఖ ఇవోల్లసన్". ఉభయదేవేరులును ప్రణయభావముతో స్వామి కంఠమును వలయములతో (గాజులతో) అలంకరింపబడిన తమ చేతులతో కౌగిలించుకొనుటచే అట్లు కంఠమును మూడు రేఖలు ముద్రింపబడినవను పై సూక్తిలోని తాత్పర్యమిచటను అనుసంధేయము.



**శ్రీవత్సకౌస్తుభసుహృద్యభుజాంతరాళ** - "శ్రీవత్సో లాంఛనం మతమ్" అనునట్లు శ్రీవత్సమనునది స్వామి పుట్టుమచ్చ. "శ్రీయుక్తోవత్సః శ్రీవత్సః మహత్వ లక్షణం, శ్వేతరోమావర్తవిశేషః" అను అమరసుధయందలి వివరణ మిచట ప్రస్తుతింప తగినది. దీనిని బట్టి తెల్లని రోమావర్తవిశేషమే శ్రీవత్సమని యేర్పడు చున్నది. మఱియు ఇది పరత్వచిహ్నము. కౌస్తుభము స్వామి వక్షఃస్థలమును అలంకరించుమణి. "కుం భూమిం స్తోభతే ఇతి కుస్తుభః విష్ణుః, తస్యేద మితి కౌస్తుభమ్" - అనగా భూమిని భరించువాడు విష్ణువు, అతని అసాధారణ లక్షణము (భూషణము) కౌస్తుభము, అని భావము, ఈ కౌస్తుభమణి భగవానుని వక్షఃస్థలమునకు కలిగించు శోభను దివ్యసూరులు పలుమార్లు పొగడిరి. "గొప్పదైన మణి అను ఆభరణము అటు ఇటు కదలాడగా" (1-2-10) అని భట్టనాథులు పలుకగా, "గొప్ప మణిని ధరించిన వీరెవ్వరో కదా!" (2-8-5) అనుచు కలివైరి సూరి కౌస్తుభమణివలన కల్గుశోభ భక్తులకు దిగ్భ్రమను కల్గించుననిరి. కౌస్తుభముతో శోభిల్లు శ్రీరంగనాథుని వక్షఃస్థలశోభను భట్టరు "కౌస్తుభన్వస్తి దీపం.....రంగసర్వం సహోరః" (112) అని, "వక్షఃస్థల్యాం తులని కమలాకౌస్తుభైః" (113) అనియు స్తుతించిరి. ప్రస్తుత ప్రయోగములోని "సుహృద్య" అను పదము వలన వక్షఃస్థలము గొప్పగా హృదయమును ఆకట్టుకొనుట తెలుపబడుటచే, భట్టరు శ్రీరంగరాజస్తమున "వక్షఃస్థల్యాంతులని కమలా కౌస్తుభైః వైజయంతీ సర్వేశత్వం కథయతి తరాం రంగధామ్నః తదాస్తామ్, కూర్మవాఘ్రీనఖ పరిమళత్ వందహేతి యశో నద్ధా మౌగ్ధ్యాభరణ మధికం నః సమాధిం ధినోతి" (113) అను శ్లోకమున సాయించిన భావము ఇచట అనుసంధేయము. కావున శ్రీవత్స, కౌస్తుభములతోపాటు, స్వామి హృదయ ప్రదేశమందు అలంకరింపబడిన పంచాయుధాభరణమువలన కల్గిన శోభ స్వామి వక్షఃస్థలమునకు అతిశయించిన హృద్యతను కల్గించెనని భావము.

**ముక్తావళీనిచయ భూషిత పీవరాంగ** - ముత్యాలహారములతో భూషితమైన బలిష్ఠమైన అంగములను కలవాడని భావము. ఇచట "అంగ" శబ్దముచే వక్షఃస్థలమే నిర్దేశింపబడుచున్నదనియు చెప్పవచ్చును. ఇందులకు అనుగుణముగా "హారస్ఫారితఫేనం", "సుమణిసరవితానం" వంటి భట్టరు సూక్తులు అనుసంధేయములు.

**శ్లో॥ సౌవర్ణ రత్న ఖచితాంగద రాజమాన!**
**భోగీంద్రభోగ సదృశాయత బాహుదండ!**
**సంఫుల్ల దివ్య సరసీరుహ మంజుహస్త!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 9

సౌవర్ణ=సువర్ణముతో చేయబడిన, రత్నఖచిత=మణులతో పొదగబడిన, అంగద=కేయూరములతో, రాజమాన=ప్రకాశించువాడా!, భోగి+ఇంద్ర= (ఆదిశేషుడను) గొప్పసర్పము యొక్క, భోగ=శరీరముతో, సదృశ=సమానమైన, ఆయత=పొడుగైన, బాహుదండ=బాహుదండములను కలవాడా!, సంఫుల్ల= బాగుగా వికసించిన, దివ్య=గొప్పదైన, సరసీరుహ=పద్మమువంటి, మంజు= మనోహరమైన, హస్త=చేతులను కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయా ప్రియ=లక్ష్మీ ప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళమగుగాక!

బంగారముతో చేయబడిన, మణులు పొదిగిన భుజకీర్తులను కలవాడా! ఆదిశేషుని యొక్క శరీరమువలె పొడుగైన బాహువులను కలవాడా!, బాగుగా పూచిన తామరలవంటి హస్తములను కలవాడా! శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళ మగుగాక!

ఇందు కవి స్వామి అంగదములను, వానిని తాల్చిన బాహువులను, ఆ బాహువుల పర్యంతభాగములగు హస్తములను స్తుతించుచున్నారు.

**సౌవర్ణరత్నఖచితాంగదరాజమాన** - కూరేశులు వరదరాజస్తవమున పల్కిన "పారిజాత విటపానభితో యా పుష్పసంపదుదితాయ కరినాథ, తాం విడంబయతి తావకబాహుషు ఆతతా కటకాంగదలక్ష్మీః "అను శ్లోకము యొక్క భావము అనుసంధేయము.

**భోగీంద్రభోగి సదృశాయతబాహుదండ** - భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని బాహువులను వర్ణించుచు, "ఫణీంద్రస్ఫీతస్రక్ వ్యతికరిత సందిగ్ధ విభవౌ'' అనుచు ఆదిశేషుని శరీరముతో వేరుచేసి చూచుటకు సాధ్యము కానట్లున్న వనిరి. శ్రీరంగనాథుని బాహువులు నీలవర్ణములో నుండును, ఆదిశేషుని వర్ణము తెలుపు. ఈ రెండింటికిని సామ్యము ఎట్లు తగును? అనినచో, స్వామి బాహువులు "చందనాగరువిలేపభూషితాః'' అనునట్లు చందనచర్చితములు కావున వర్ణమున



భ్రమ కల్గు అవకాశము కలదు. అట్లే రూపసామ్యము కూడ ఈ రెండిటి మధ్య కలదు. స్వామి బాహువులు ఆయతములు. అట్లే ఆదిశేషుని శరీరమును ఆయతము మఱియు స్వామి బాహువులు సువృత్తములు. ఆదిశేషుని శరీరమును సువృత్తము. సర్పశరీరము చుట్టలు చుట్టుకొనియుండుట సహజమేకదా!, వాల్మీకి రామాయణములోని "ఆయతాశ్చసువృత్తాశ్చ'' అను సూక్తిలోగల సువృత్త శబ్దమును గోవిందరాజీయ వ్యాఖ్యాత "భోగిభోగవత్ వృత్తాః'' అని వివరించుట ఇచట స్మరణీయము.

**సంఫుల్ల దివ్య సరసీరుహ మంజుహస్త** - "కరస్తుపద్మేన'' అనుచు అలంకార శేఖరకారుడు హస్తమును పద్మముతో పోల్చుట తగునని సూచించెను. స్వామి హస్తము బాగుగా పూచిన గొప్ప తామరవలె మనోహరముగా ఉన్నదని భావము.

"దివ్య'' అను విశేషణమును "సరసీరుహ'' మునకు కాక, "సరసీ'' శబ్దపర్యంతము మాత్రము అన్వయించిన, బాగుగా పూచినది దివ్యమైన సరస్సున ఉద్భవించినదగు పద్మమువలె అందమైన హస్తమును కలవాడని భావము కల్గును. ఇందుకూడ స్వామి హస్తమునకు పద్మసామ్యమే స్ఫురించినను, భగవానునకు సరసీ సామ్యము స్ఫుటముగా గోచరించు అవకాశము అధికముగ కలదని చెప్పవచ్చును. ఈ భావమునకు అనుగుణముగా భట్టరు శ్రీరంగరాజస్తవమున మూడు అద్భుత శ్లోకములలో స్వామిని సరస్సుతో పోల్చుటను స్మరింపనగును. ఉత్ఫుల్లపయజవివోవయవాని శ్రీరంగరాజ మిహ'' అని, "పిబ నయన పురస్తే రంగధుర్యాభిధానం స్థిత మిహ పరిఫుల్లత్ పుండరీకం తటాకమ్'' అని, "శ్రీరంగరాజమిష పద్మసరః ప్రసన్నమ్'' అనియు భట్టరు స్వామిని సరస్సుగా స్తుతించిరి. మఱియు, అర్చామూర్తియగు శ్రీరంగనాథుని సరస్సుగా ఉపమించుటయు మిక్కిలి యుక్తము. పరరూపమగు పరమపదనాథుని కంటె, పాలకడలిలోని వ్యూహమూర్తి కంటె, అవతార రూపము కంటె, అంతర్యామి రూపము కంటె అర్చామూర్తి అతిశయించిన సౌలభ్య సౌశీల్యాది గుణములకు నిలయము. పరవ్యూహములు రెండును దేశ విప్రకృష్టములు. అనగా, అందఱికిని చేరుటకు సాధ్యముకాని దేశముననున్నవి. అవతారములు కాల విప్రకృష్టములు. ఏదో ఒక కాలమున మాత్రము సంభవించినవగుటచే అన్ని కాలములందు

దర్శింప వీలులేనివి. అట్లే, అంతర్యామి అధికారి విప్రకృష్టము. అనగా, మహాత్ములైన యోగులకు మాత్రమే దర్శింప సాధ్యమైనవి. అర్చామూర్తికి ఇట్టి విప్రకర్షలు ఏమియు లేవు. అందఱు అన్ని వేళలా దర్శింపవీలున్నది. కావుననే లోకాచార్యుల వారు తమ శ్రీవచన భూషణమను దివ్యగ్రంథమున అర్చామూర్తిని సరస్సుగా ఉపమించిరి. అట్లే మిగిలిన నాల్గింటిని, అనగా, పరవ్యూహములను క్షీరాబ్ధితో, అవతారములను వర్షాకాలమున మాత్రము ప్రవహించు నదులతో, అంతర్యామిని భూగత జలముతో పోల్చిరి. కావున "ఏష బ్రహ్మప్రవిష్టో2స్మి గ్రీష్మేశీతమివహ్రదమ్" "హరి సరసి విగాహ్య" వంటి సూక్తుల అర్థము అర్చామూర్తి యందే పర్యవసించు ననవచ్చును. అందునను, అర్చామూర్తులలో ముఖ్యమైనదిగా పరగణింపబడు శ్రీరంగనాథుని అర్చామూర్తియందే మిక్కిలి పొసగును అనియు చెప్పవచ్చును.

**శ్లో॥ వైఢూర్య వజ్ర పరికల్పిత హస్త భూష!**
**రత్నోర్మికా విలసితాంగుళి పల్లవాఢ్య!**
**భ్రాజన్మణీరుచిర కింకిణి నూపురాఢ్య!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 10**

వైఢూర్య వజ్ర పరికల్పిత=వైఢూర్యములతో, వజ్రములతో చేయబడిన, హస్తభూష=హస్తాలంకరణమును కలవాడా!, రత్న+ఊర్మికా=రత్నాల అంగుళీయకముతో, విలసిత=ప్రకాశింపచేయబడిన, అంగుళిపల్లవ+ఆఢ్య= చిగుళ్ళవంటి వ్రేళ్ళను కలవాడా!, భ్రాజత్+మణీరుచిర=ప్రకాశించు మణులతో మనోహరమైన, కింకిణి=మువ్వల, నూపుర+ఆఢ్య=నూపురములతో శోభిల్లువాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా, తే=నీకు, మంగళమ్= మంగళమగుగాక!

వజ్రవైఢూర్యములు పొదిగిన హస్తాభరణములను కలవాడా!, రత్నాలతో చేయబడిన అంగుళీయకములతో అందమైనవాడా!, వెలుగొందు మణులతో మనోహరమైనవి, మువ్వలను కల్గినవైన నూపురములతో శోభిల్లువాడా!, శ్రీరంగనాథా!, నీకు మంగళము.



ఇందు శ్రీరంగనాథుని హస్తాభరణము, అంగుళీయక, నూపురముల శోభ వర్ణింపబడినది. శఠకోపులు తమ ప్రబంధమున స్వామి నామములవలె ఆభరణములును అనేకములని (2-5-6) పల్కిరి కదా!

"అంగుళీయక మూర్మికా" అను అమరకోశవచనము ప్రకారము ఊర్మికా అనుటకు అంగుళీయకమని అర్థము. అట్లే, చేతి వ్రేళ్ళను చిగుళ్ళతో పోల్చుటయు కవి సమయము. భట్టరు శ్రీరంగరాజస్తవమున "రంగిణః చరణచారుకల్పద్రుమ ప్రవాళ"అని పల్కిరి. "ప్రవాళశాఖావా2oగుళ్యాః"అనుచు అలంకారశేఖరకారుడును ఉదహరించెను. "కింకిణి" అనగా చిరుగంటలు. అనగా మువ్వలు. మువ్వలధ్వని "హంససారస శబ్దాభ్యాం వర్ణ్యతే నూపురధ్వనిః" అను కవి సమయమును బట్టి హంస, సారస పక్షుల ధ్వని వంటిది. అట్టి మనోహరమైన ధ్వనిని స్వామి నూపురములు చేయుచున్నవని తాత్పర్యము.

**శ్లో॥ జాతీ సరోజ తులసీ నవ వైజయంతీ-**
**మాలాభిరామ! నత భూసుర పారిజాత!**
**హైమోపవీత! లసమాన శుభోత్తరీయ!**
**రంగేశ! సింధుతనయా ప్రియ! మంగళం తే॥ 11**

జాతీ=జాజిపూవులు, సరోజ=పద్మములు, తులసీ=తులసి అను వీనిచే, నవ= నూతనమైన, వైజయంతీమాలా=వైజయంతీమాలచే (వనమాలచే), అభిరామ =అందమైనవాడా!, నతభూసుర=నమస్కరించిన ద్విజులకు, పారిజాత=పారిజాత వృక్షమువంటి వాడా!, హైమ+ఉపవీత=బంగారు యజ్ఞోపవీతమును కలవాడా! లసమాన-ప్రకాశించు, శుభ+ఉత్తరీయ మంగళకరమైన ఉత్తరీయమును కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్= మంగళము అగుగాక!

జాజిపూలతో, పద్మములతో, తులసితో నూతనమైన వైజయంతీమాలచే అందమైన వాడా!, కొలుచు ద్విజులకు పారిజాతము వంటి వాడా!, బంగారు యజ్ఞోపవీతమును కలవాడా!, ప్రకాశించు ఉత్తరీయమును కలవాడా! శ్రీరంగ నాథా! నీకు మంగళమగుగాక!

భగవానుడు ధరించు మాలకు వనమాల అని వైజయంతీమాల అని పేరు. శ్రీరంగనాథుడు వైజయంతీమాలను ధరించుటను భట్టరు "వక్షఃస్థల్యాం తులసికమాలాకౌస్తుభైః వైజయంతీ'' అనుచు పొగడిరి. తులసి, వైజయంతి మాలయు పర్వతసూచకములు. "వాడని వనమాల'' (2-1) అనుచు కులశేఖరులు తమ ప్రబంధమున పల్కుటను బట్టి "నవ'' శబ్దము ప్రయోగింప బడినది. ఈ వైజయంతీమాల భూతసూక్ష్మములకు ప్రతీక. మఱియు సువాసనకు అభిమాన దేవత. ఆపాదముకల మాలకు వనమాల అని పేరు. "ఆపాద పద్మం మా మాలా వనమాలేతి సా మతా'' అను ప్రమాణవచన మిచట స్మరణీయము. దివ్యమై సహజమైన గొప్పకాంతిని కల వనమాల తులసితో కూడుకొనియున్నచో మిక్కిలిగా శోభించును. "లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్'' అనుచు యామునులు పల్కిరి కదా! ఈ వైజయంతిమాల "తులసి, కుంద, మందార, కరవీర సరోరుహైః, పంచభిరచితా మాలా వనమాలేతి కీర్తితా'' అను ప్రమాణమును బట్టి తులసి, కుంద, మందార, కరవీర, పద్మములను అయిదు విధములైన పుష్పములతో కూర్చబడినదని తెలియుచున్నది. ఈ అర్థమును బట్టి శ్లోకమున కేవలము తులసి, పద్మములు మాత్రమే ప్రయోగింపబడినను, అవి మిగిలిన మూడింటికిని ఉపలక్షణములు అని అనదగును. "మణినా కాంచనేనాపి వజ్రవైడూర్య మౌక్తికైః రచితా పంచభి ర్మాలా వైజయంతీతి కీర్తితా "అను ప్రమాణమును బట్టి వజ్రవైడూర్యమౌక్తిక కాంచనాదులతో రచింపబడిన మాల వైజయంతి అని తెలియు చున్నది. ఈ అర్థమున "జాతీ సరోజ తులసీ'' పదములను వేరుగా అన్వయింపనగును.

**నతభూసుర పారిజాత** - పారిజాతము దేవలోక వృక్షముల అయిదింటిలో ఒకటి. అడిగిన వరములను ఇచ్చునట్టి శక్తిని కల్గినది. భగవానుడును అట్టి స్వభావమును కలవాడే కదా! శఠకోపసూరి తమ ప్రబంధములో "తనను నాకు అనుగ్రహించిన కల్పవృక్షము'' అనుచు కల్పవృక్షము కంటె భగవానునకు కల అతిశయమును తెలిపిరి. కల్పవృక్షము ఎట్టి ఫలములనైనను ఇచ్చును కాని, తనను తాను అర్పించుకొను స్వభావము దానికి లేదు. భగవానుడు అట్లుకాక, భక్తునకు తనను స్వాధీనము చేసికొనును. ఈ విశేషార్థము ప్రస్తుతమునను



అనుసంధించుట ద్వారా పారిజాతమున కంటె స్వామికి కల వైలక్షణ్యము కూడ ధ్వనించును.

**హైమోపవీత** - "ప్రకాశించు యజ్ఞోపవీతము'' (5-5-2) అను శఠకోపసూరి సూక్తి ఇచట అనుసంధేయము. "హైమోపవీత లసమాన శుభోత్తరీయ'' అను అంతటిని ఒకే సమస్తపదముగా కూడ అన్వయింపవచ్చును. అపుడు "బంగారు యజ్ఞోపవీతముతో ప్రకాశించు మంగళకరమైన ఉత్తరీయమును కలవాడా!'' అని భావము. కాని, పూర్వము చూపిన వ్యస్తమైన అన్వయమే మిక్కిలి సరసము.

**శ్లో॥ భాస్వద్వలిత్రయ శుభోదర! నిమ్ననాభే!**
**కాంచీగుణాంచిత కటీతట! సత్యకామ!**
**బాలార్క వర్ణ కనకాంబర రంజితాంఘ్రే!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥** 12

భాస్వత్=ప్రకాశించు, వలిత్రయ=మూడు వళులను (గీతలను) కల్గిన, శుభ= మంగళకరమైన, ఉదర=ఉదరభాగమును కలవాడా!, నిమ్ననాభే=లోతైన బొడ్డును కలవాడా!, కాంచీగుణ=మొలనూలుతో, అంచిత=అలంకరింపబడిన, కటీతట= కటిప్రదేశమును కలవాడా!, సత్యకామ=సత్యమైన కోరికలను కలవాడా!, బాల+అర్క=బాల సూర్యుని యొక్క, వర్ణ=వర్ణమైన, కనక=బంగారు వర్ణమును కల, అంబర=వస్త్రముతో, రంజిత=రంజిలచేయబడిన, (ఎఱ్ఱగా చేయబడిన), అంఘ్రే=పాదములను కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధూతనయాప్రియ= లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్(అస్తు)=మంగళమగుగాక!

ప్రకాశించు, త్రివళులతో కూడుకొనిన, శుభకరమైన ఉదరదేశమును కలవాడా! లోతైన బొడ్డును కలవాడా! మొలనూలుతో అందమైన కటితనమును కలవాడా! సత్యమైన ఇచ్ఛను కలవాడా! బాలసూర్యుని వర్ణమువంటి బంగారు రంగును కల వస్త్రముచే రంజిల్ల చేయబడిన పాదములను కలవాడా! శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగుగాక!

**భాస్వ ద్వలిత్రయ** - పరాశర భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని ఉదరప్రదేశములోని వళిత్రయమును "త్రివిధ చిదచిత్ బృందం తుందావలంబి

వలిత్రయం విగణయ దివైశ్వర్యం వ్యాఖ్యాతి రంగమహేశతుః'' (115) అని పల్కుట ఇచట స్మరణీయము. స్వామి త్రివళులు మూడు విధములైన చేతనా చేతనములను ఐశ్వర్యమును వ్యాఖ్యానించునట్లున్నవను పై సూక్తిలోని భావము ఇచటను అన్వయింపనగును.

**కాంచీగుణాంచిత కటీతటి -** శ్రీరంగరాజస్తవములోని "కటీకాంతి సంవాది చాతుర్య నీవీలసత్ రత్నకాంచీకలాపానులేపమ్'' (119) అను సూక్తి అనుసంధేయము.

**సత్యకామ -** కామ శబ్దము అనేకార్థకము. ఇచట కోరికను, కోరికకు ఆధారమగు విషయమును తెలుపును. ఇచట కల్యాణగుణములను, విభూతి ద్వయమును తెల్పునను గద్యవ్యాఖ్యాన మిచటను అన్వయింపనగును. నిత్యమైనవి, తనకు, భక్తులకును భోగ్యమైనవగు నిత్యవిగ్రహమును కల్యాణ గుణములను, విభూతులను కల్గినవాడని తాత్పర్యము. మఱియు భక్తులకు ఆనందమును కల్గింపవలెనను అప్రతిహతమైన ఇచ్ఛను కలవాడనియు భావము.

**బాలార్కవర్ణకనకాంబర రంజితాంఘ్రే -** స్వామి ధరించిన వస్త్రము బాల సూర్యుని వర్ణమును కల్గియుండుననుటకు మునివాహనసూరి ప్రబంధములోని "సంధ్యవంటి రంగు కల వస్త్రమును'' (3) అను సూక్తి ప్రమాణము. స్వామి దాల్చిన దివ్యాంబరము యొక్క కాంతిచే పాదములు రంజితములైన వనుటకు శఠకోపసూరి ప్రబంధములోని "నీ నడుము యొక్క కాంతి స్వభావ సిద్ధమైన తేజస్సునుకల పీతాంబరముతో అనేక విధములైన ఆభరణములుగా వ్యాపించెనా? ఏమి?'' (3-1-1) అను సూక్తి అనుసంధేయము. శఠకోపసూరి సూక్తిలో కటిశోభ -పీతాంబరశోభలకు అన్వయము చేయబడగా, ఇచట పీతాంబరశోభకు, పాదపద్మ శోభకును అన్వయము చేయబడినది. పీతాంబరకాంతి పాదమున సంక్రమించిన దని చెప్పుటచే తద్గుణాలంకారము.

**శ్లో॥ రంభాసమోరుయుగ! సుందర మీనకేతు-**
**తూణీర గర్వపరిచర్వణ శౌండ జంఘు!**
**భ్రాజన్మణీరుచిర కింకిణి నూపురాఢ్య!**
**రంగేశ! సింధుతనయా ప్రియ! మంగళం తే॥** 13



రంభాసమ=అరటిబోదెలతో సమానమైన, ఊరుయుగ=ఊరుద్వయమును కలవాడా!, సుందర=అందమైన, మీనకేతు=మన్మథుని, తూణీర=అంబుల పొది యొక్క, గర్వ=గర్వమును, పరిచర్వణ=పూర్తిగా గ్రసించుటలో, శౌండ= సమర్థమైన, జంఘ=పిక్కలను కలవాడా!, భ్రాజిత్=ప్రకాశించు, మణీ=మణులచే, రుచిర=అందమైన, నూపుర=కాలి అందెలతో, ఆఢ్య=గొప్పవాడా!, రంగేశ= శ్రీరంగనాథా, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్= మంగళమగు గాక!

అరటిబోదెలతో సమానమైన ఊరు ద్వయమును కలవాడా! అందమైన మన్మథుని తూణీరము యొక్క గర్వమును అనచునట్టి పిక్కలను కలవాడా! ప్రకాశించు మణులతో శోభిల్లు అందెలను కలవాడా! శ్రీరంగనాథా! లక్ష్మీప్రయా! నీకు మంగళమగుగాక!

**రంభాసమోరుయుగ -** "మదమివ మధుకైటభస్య రంభాకరభకరీంద్రకరాభి రూప్యదర్పమ్, స్ఫుట మివ పరిభూయగర్వగుర్వోః కిముపమిమీమహి రంగ కుంజరోర్వోః'' (118) అను శ్రీరంగరాజస్తవ శ్లోకభావము స్మరణీయము. ఊరువులను అరటి బోదెలతో పోల్చుట కవి సంప్రదాయము. "ఊరుస్తు కరిహస్తేన కదళ్యా'' అను అలంకారశేఖర - వచనము స్మరణీయము. "రంభాస్తంభాః ...... అపి సామ్యం నదధుః'' (56) అను కూరేశుల వరదరాజస్తవ సూక్తియు స్మరింపనగును.

**సుందరమీనకేతుతూణీర గర్వపరిచర్వణ శౌండజంఘ -** దేశికులు దేవనాయక పంచాశత్‌లో భగవానుని జంఘాయుగమును కందర్పకాహళముగా ఉత్ప్రేక్షింపగా ఇచట కవి మన్మథ తూణీరము కంటె ఆధిక్యమును వెలిబుచ్చిరి. భగవద్రామానుజుల అభిషేకచూర్ణికలో ఆ స్వామి జంఘాద్వయమును వర్ణించు "దేవరీరుడైయ పదసరసిజవ్యాజేన కుసుమశరసహితమాక అమైత్తు వైత్త అమ్బుఆ త్తూణికళ్ పోల్ ఇణైత్తు వైత్త కణైక్కాల్ కళుమ్'' (దేవరవారి పదపద్మముల వ్యాజమున కుసుమ బాణములతో కూడుకొని యుండునట్లు అమర్చియుంచిన అంబులపొదుల వలె జంటగా నుంచిన ముంగాళ్ళు) అను సూక్తి ఇచట స్మరణీయము. శౌండుడనగా సమర్థుడని అర్థము.

**శ్లో॥ బృందారకేంద్ర రమణీకర రత్నదీపైః**
**నీరాజితాంఘ్రి కమలాతుల దివ్యరూప।**
**కందర్పకోటి సదృశానఘ! పద్మనాభ!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 14**

బృందారక=దేవతలయొక్క, ఇంద్ర=ఇంద్రునియొక్క, రమణీ=స్త్రీల, కర=చేతులలోని, రత్నదీపైః=రత్నదీపములతో, నీరాజిత=నీరాజనము చేయ బడిన, అంఘ్రికమల=పాదపద్మములను కలవాడా!, అతుల=అసమానమైన, దివ్య=గొప్పదైన, రూప=రూపము కలవాడా!, కందర్పకోటిసదృశ=కోటి మన్మథులతో సమానమైన వాడా!, అనఘ=పాపరహితుడా!, పద్మనాభ=పద్మనాభా! రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్= మంగళమగుగాక!

దేవతా కాంతలచే, ఇంద్రుని భార్యయగు శచీదేవిచే రత్నదీపములచే హారతి చేయబడిన పాదపద్మములను కలవాడా!, అసమానమైన దివ్యరూపమును కలవాడా! కోటి మన్మథులకు సాటి వచ్చువాడా!, అనఘా! పద్మనాభా!, శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగుగాక!

**అతుల దివ్యరూప** - రూపశబ్దము అనేకార్థకము. "రూపం తు శ్లోక శబ్దయోః వశా వాకాశే సౌందర్యే, నాణకే, నాటకాదికే, గ్రంథావృత్తౌ స్వభావేచ" అను హైమనిఘంటువును బట్టి రూప శబ్దమునకు సౌందర్యమని, స్వభావమని, అర్థము. ఈ రెండును ఇచట సంగతములే. ఇంతవరకును వర్ణింపబడిన దివ్య భగవానుని అసమానమైన దివ్యసౌందర్యము కావున అది ఇచట సింహావలోకన న్యాయమున రూపశబ్దముచే పరామర్శింపబడినదనదగును, అట్లే, ఇంతవరకు దివ్య సౌందర్యము వర్ణింపబడినది కావున రూపశబ్ద మిచట స్వభావమును తెలుపుచున్నది. భగవానుని సౌందర్యము, స్వభావము రెండును అసమానములు దివ్యములును కదా!, "రోపయితి - విమోహయతి, రూప్స-విమోహనే" మోహమును కలిగించునది అని, "రూప్యతే స్తూయతే, రు-శబ్దే" స్తుతింపబడునది అనియు కల రూపశబ్ద వ్యుత్పత్తులు రెండును భగవానుని స్వరూప స్వభావములు



రెండిటికిని చక్కగ అన్వయించుట గమనింపదగినది. యామునులు చతుః శ్లోకిలో భగవానుని రూపమును స్వరూపమును "శాంతానంత (ద) మహా విభూతి పరమం యద్బ్రహ్మరూపం హరేః మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్" అని కీర్తించుట ఇచట అనుసంధేయము.

**కందర్పకోటి సదృశ** - "సాక్షాత్ మన్మథమన్మథః" మన్మథులలో మన్మనుథుడని, మన్మథుని మనస్సును సైతము తన అందముతో మథించు వాడని కీర్తింపబడు స్వామికి ఒక మన్మథుని అందము సాటిరాదు. కోటి మన్మథుల అందముతో పోల్చవలసి వచ్చినది. నిజమునకు అదియు సరిరాదు. మన్మథుని అందమునకే మూలము కదా స్వామి సౌందర్యము!

**అనఘ** - అనఘుడనగా పాపరహితుడు, అనగా దోషరహితుడని అర్థము. ఈ సంబోధన అర్చామూర్తిని గూర్చి, ఆ అర్చామూర్తులలో ప్రధానమగు శ్రీరంగనాథుని గూర్చి మిక్కిలి అర్థవంతము. పర-వ్యూహ-విభవ-అంతర్యామి రూపములకు కల దేశ-కాల-అధికారి విప్రకర్షలేమియు అర్చామూర్తికి లేవు కదా! అఘ శబ్దమునకు దుఃఖమని వేరొక అర్థము. శ్రీరంగనాథుడు దుఃఖములేని వాడనగా ఆర్తసంరక్షణమునకు తగిన అర్చారూపమును పొందినవాడని తాత్పర్యము. అది సర్వజన సంసేవ్యము కదా! ఇక భక్తులందఱు రక్షింప బడుదురను భావము వలన శ్రీరంగనాథుని మనస్సులోని దుఃఖమంతయు తీరెనని తాత్పర్యము. అంతకు ముందు "స ఏకాకీ న రమేత" అని అసంతృప్తిలో నుండెను కదా!

**శ్లో॥ వాణీప్రియస్య కులదైవత! రాఘవేంద్ర**
**సంసేవితాశ్రిత సురద్రుమ! దివ్యశక్తే!**
**రక్షోఽధిపస్య హృదయోత్పల పూర్ణచంద్ర!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 15**

వాణీ ప్రియస్య=సరస్వతికి ప్రియడగు బ్రహ్మ యొక్క, కులదైవత= కులదైవమా!, రాఘవేంద్ర=రఘువంశమున పుట్టిన రాజులలో గొప్పవాడగు శ్రీరామునిచే, సంసేవిత=చక్కగా సేవింపబడిన వాడా!, ఆశ్రితసురద్రుమ=

భక్తులకు కల్పవృక్షమువంటివాడా!, దివ్యశక్తే=గొప్పశక్తిని కలవాడా!, రక్షో2ధిపస్య= రాక్షస రాజగు విభీషణుని, హృదయ+ఉత్పల=హృదయమనబడు పద్మమునకు, పూర్ణచంద్ర=నిండు చంద్రునివంటివాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయా ప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళమగుగాక!

సరస్వతీ ప్రియుడగు బ్రహ్మకు కులదైవమా! రాఘవేంద్రుడగు శ్రీరామునిచే ఆరాధింపబడినవాడా! భక్తుల కల్పవృక్షమా!, దివ్యశక్తిని కలవాడా! రాక్షసప్రభువగు విభీషణుని హృదయపద్మమును ఆనందింపజేయు పూర్ణచంద్రుని వంటివాడా!, శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగుగాక!

**వాణీప్రియస్య కులదైవత** - శ్రీరంగనాథుడు బ్రహ్మదేవునకు ప్రత్యక్షమైన వృత్తాంతము సుప్రసిద్ధము. చిరకాలము తన ఆరాధనలో నున్న ఈ మూర్తిని బ్రహ్మభక్తుడగు ఇక్ష్వాకువునకు ఇచ్చెనట. కులశేఖరసూరి తమ ప్రబంధమున బ్రహ్మ తన నాల్గు ముఖములతో నాల్గు వేదములను పఠించుచు శ్రీరంగనాథుని స్తుతించుటను కొనియాడిరి. పరాశర భట్టరు శ్రీరంగరాజస్తవమున పూర్వ శతకము చివరలో 'నిత్యాభ్యర్చానత విధి ముఖస్తోమ సంశయ్యమానైః' అని, ఉత్తర శతకమున "భ్యారత్యా సహధర్మచారరతయా స్వాధీన సంకీర్తనః, కల్పానేవ బహూన్ కమండలుగళత్ గంగాప్లుతో 2పూజయత్ బ్రహ్మా త్వాం" అనియు కొనియాడిరి. క్షీరసాగరమునుండి శ్రీరంగవిమానము, శ్రీరంగనాథుడు బ్రహ్మకు ప్రత్యక్షమైన వృత్తాంతము బ్రహ్మాండపురాణాంతర్గతమైన శ్రీరంగక్షేత్ర మాహాత్మ్యములో కలదు. "అష్టాక్షరేణ మంత్రేణ పునస్తేవే మహత్తపః, తస్య వర్ష సహస్రాంతే తస్య మానస్య వేధసః, ఆవిర్భూతం మహద్ధామ శ్రీరంగం క్షీరసాగరాత్ .... దివ్యం విమానం తం దృష్ట్వా స్వయం వ్యక్తం మహర్ధిమత్, తేజోమయం జగద్వ్యాపి శ్రీరంగం ప్రణవాకృతి, ఉత్థాయ సంభ్రమావిష్టో హృష్టః పుష్టః ప్రజాపతిః ......... తదంతరావిశ్వవిధి ర్దదర్శ విభిన్న నీలాచల సన్నికాశమ్, ....... భుజంగతల్పం పురుషం పురాణమ్" ఇత్యాదిగా అందున్న సూక్తులు స్మరణీయములు. పాంచరాత్రాగమమునకు చెందిన పారమేశ్వర సంహితలో కూడ ఈ కథ విస్తృతముగా వర్ణింపబడినది.

**(రాఘవేంద్ర సంసేవిత)** - శ్రీరామచంద్రుడు శ్రీరంగనాథుని నిత్యము



ఆరాధించెననుటకు వాల్మీకి మునులు "సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" అనుచు సూచించిరి. గోవిందరాజీయ వ్యాఖ్యాత ఇచట "సహపత్న్యేతి శ్రీరంగవిగ్రహానుభవ సాగరతరణస్య సహాయోక్తిః" అనుచు శ్రీరాముడు ఆరాధించునది శ్రీరంగనాథుని అర్చామూర్తినే అని విశదీకరించిరి. పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములో "హేమాంభోజైః నిబిడనికటే రామసీతోపనీతైః (127)" అని పూర్వశతకమున, "స్వయ మథవిభో స్వేన శ్రీరంగధామని మైథిలీ రమణవపుషా స్వార్హాణి ఆరాధనాన్యసి లంభితః" (77) అనియు ఈ అంశమును ప్రస్తుతించిరి. శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమునను ఈ అంశము కలదు. విస్తరభీతిచే ఆ శ్లోకములు ఉట్టంకించుటలేదు.

**ఆశ్రిత సురద్రుమ** - సురద్రుమ మనగా కల్పవృక్షము. శ్రీరంగనాథుని కల్పవృక్షమనగా భట్టరు పలుమార్లు స్తుతించిరి. "అర్థి కల్పకమ్" అని వృక్షముతో సామ్యమును "అమరతరోః పరం పరిహసత్ పృథురంగభుజః" అని ఆధిక్యమును భట్టరు తెలియజేసిరి.

**ఆశ్రిత సురద్రుమ దివ్యశక్తే** - ఇచటి "దివ్యశక్తే" అను సంబోధనలోని స్వారస్యము సహృదయైక వేద్యము. "ఆశ్రిత సురద్రుమ" అనుచు కల్పవృక్షముతో సామ్యమును తెల్పిన కవి, "దివ్య శక్తే" అనుచు ఆ కల్పవృక్షము కంటే స్వామికి కల ఆధిక్యమును సూచించిరనదగును. శఠకోపసూరియు "తనను నాకు అనుగ్రహించిన కల్పవృక్షము ఎన్ని వరములను అనుగ్రహించినను తనను తాను ఇచ్చుకొను శక్తి దానికి లేదు కదా! కాని స్వామి భక్తాపరాధీనుడు. ఇట్టి దివ్యశక్తి ఈ విశేషణము ద్వారా వివక్షిత మనదగును.

**రక్షో2ధిపస్య హృదయోత్పల పూర్ణచంద్ర** - శ్రీరామచంద్రుడు శ్రీరంగ విమానమును శ్రీరంగనాథుని అర్చామూర్తిని తనకు భక్తుడగు విభీషణునకు అనుగ్రహించిన వృత్తాంతము శ్రీరామాయణమున గల "లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాత్ విభీషణః" (యుద్ధ - 131) అను సూక్తి తెలుపుచున్నది. పద్మపురాణమునందును, "ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై స్వవిశ్లేషా సహిష్ణవే, శ్రీరంగశాయినం స్వార్చ్యమ్ ఇక్ష్వాకు కులదైవతమ్ రంగవిమానమాదాయ లంకాం ప్రాయాత్ విభీషణః" అని కలదు. ఈ శ్లోకములను మహేశ్వర తీర్థులు అను

సుప్రసిద్ధ శ్రీరామాయణ వ్యాఖ్యాతయు పేర్కొనుట గమనింపతగినది. కావుననే శ్రీరంగములోని ఆలయప్రాంగణమున విభీషణునకు ప్రత్యేకమైన ఆలయము కలదు. భట్టరును శ్రీరంగరాజస్తవమున "హనుభూష విభీషణయోః స్యామ్" అనుచు అచటి విభీషణుని ప్రస్తుతించిరి. శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమునను, "అయోధ్యాయాం చిరకాలం శ్రీమద్రంగం భవిష్యతి, అవతీర్య భవద్వంశే రామోనామ జనార్దనః, నిహనిష్యతి దుర్వృత్తం రావణం లోకరావణమ్, విభీషణాయ తద్భ్రాత్రే ప్రియాయ ప్రియకారిణే, ప్రియం విమానం శ్రీరంగం రామోదేవః ప్రదాస్యతి, స నయిష్యతి కావేర్యామ్ చంద్రపుష్కరిణీతటమ్" అనుచు ఈ అంశము వివరింపబడినది. శ్రీరంగవిమానము, శ్రీరంగనాథుని అర్చామూర్తియు కావేరీనదీ తీరమున నిలచిపోగా, విభీషణుడు చింతాక్రాంతుడగుట, అపుడు శ్రీరంగనాథుడు అతనిని ఓదార్చి, మనస్సును సంతోషపఱచి, లంకకు తిరిగి పంపుటయు ఇచట అనుసంధేయము.

**శ్లో॥ శ్రీమత్పరాంకుశముఖైః దశభిః ప్రగీత-**
**మాహాత్మ్య! చంద్రసరసీతటవాస లోల!**
**మాంధాతృముఖ్య ధరణీశ్వర సేవితాంఘ్రే!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 16**

శ్రీమత్పరాంకుశముఖైః=మహనీయులగు శఠకోపసూరి మొదలగు, దశభిః =పదిమందిచే, ప్రగీతమాహాత్మ్య= కీర్తింపబడిన మహిమను కలవాడా!, చంద్ర సరసీతటవాసలోల=చంద్రపుష్కరిణీతీరమున ఆసక్తిని కలవాడా! మాంధాతృ ముఖ్య=మాంధాత మొదలగు, ధరణీ+ఈశ్వర సేవితాంఘ్రే= ప్రభువులచే సేవింపబడిన పాదములను కలవాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయా ప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళము.

శఠకోపసూరి మొదలగు మహనీయులైన పదిమందిచే కీర్తింపబడిన మహిమను కలవాడా!, చంద్రపుష్కరిణీతటమున నివసించుటలో ఆసక్తిని కలవాడా! మాంధాత మొదలగు ప్రభువులచే ఆరాధింపబడినవాడా! శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళమగుగాక!



**శ్రీమత్పరాంకుశముఖైః దశభిః ప్రగీత మహాత్మ్య** - ఈ విశేషణము శ్రీరంగనాథుని అర్చామూర్తికి మాత్రమే చెల్లును. ఏల అన, దివ్యసూరులు తమ ప్రబంధములలో పలు క్షేత్రములలోని అర్చామూర్తులను కీర్తించిరి. కాని కొంతమంది కొన్ని అర్చామూర్తులను మాత్రమే పొగడిరి. అందఱు పొగడినది ఒక్క శ్రీరంగక్షేత్రమును, అందలి అర్చామూర్తిని మాత్రమే. కావుననే అచటి స్వామికి "పది మంది కీర్తించిన స్వామి" అని ప్రసిద్ధి కలిగెను. "కలౌ వేంకట నాయకః" కలియుగమున మిక్కిలి ప్రసిద్ధిని పొందిన శ్రీవెంకటేశ్వరునకును ఈ ఆధిక్యము లేదనుట అతిశయోక్తి కాదు.

ఇచట ముఖ శబ్దము ప్రాముఖ్యమును సూచించును. దివ్య సూరులలో శఠకోపసూరి మొదటివారు కాకున్నను వారి ప్రబంధములు ప్రధానములుగా పరిగణింపబడుటను బట్టి వారికి ప్రాధాన్య మేర్పడినది. శఠకోపసూరి నాల్గు ప్రబంధములు నాల్గు వేదములుగా ప్రసిద్ధి కదా! అంతియే కాక, దివ్యసూరులలో శఠకోపసూరి అంగియని మిగిలిన మహనీయులు వారికి అంగభూతులనియు ఆచార్యుల సూక్తి. ఇందులకు పరాంకుశ పంచవింశతి లోని "కాసార సంయమి ముఖాః కమలాసహాయభక్తాః............యస్యా భవన్ అవయవా నిజపారతంత్ర్యాత్ తస్మై నమో వకుళభూషణ దేశికాయ" వంటి సూక్తులు స్మరణీయములు.

పరాంకుశులనుటకు పరులకు అనగా శత్రువులకు అంకుశమువంటివారని, పరుడగు భగవానుని తన వశమున నుంచుకొనుటచే అంకుశము వంటి వారని అర్థమును చెప్పనగును. శఠకోపసూరి తమ ప్రబంధములలో నాస్తికసిద్ధాంత వాదములు సోపపత్తికముగ నిరాకరించి భగవానుడగు శ్రీమన్నారాయణుని స్వరూపగుణ విభూతులను సువిశదముగా ప్రతిపాదించుటచే మొదటి వివరణము, తన తీయని భక్తి భావ గర్భితములగు ప్రబంధములతో భగవానుని ఆకర్షించుటచే రెండవ వివరణమును సుసంగతములు. "శ్రీమత్" అను విశేషణమునకు సందర్భానుసారముగా పలు అర్థములను చెప్పవచ్చును. గౌరవ వాచకముగా అర్థమును తెలుపుటతో బాటు, జ్ఞానసంపదను లేక భక్తి సంపదను కలవారని చెప్పవచ్చును. అంతియే కాక, ఉభయ విభూతులను తన అధీనమున కల్గియున్నవారనియు చెప్పవచ్చును. తమ ప్రబంధములో శఠకోపసూరి పక్షులను

భగవానుని వద్దకు దూతలుగా పంపుచు, వారి దూత్యమునకు ఫలముగా, "బంగారు లోకమైన పరమపదమును ఏలుడు, లేక, ఈ భూలోకమునంతటిని ఏలుడు'' అని పల్కుటచే ఈ అర్థము సంగతమని చెప్పనగును. పదిమంది ఆళ్వార్లు శ్రీరంగనాథుని స్తుతించు సూక్తులు సుప్రసిద్ధములు, అనేకములు అగుటచే విస్తరభీతిచే వానిని ఇచట ప్రస్తావించుటలేదు.

**చంద్రసరసీతటవాసలోల** - చంద్రపుష్కరణికి అట్టి పేరు వచ్చుటకు కల కారణము శ్రీరంగనాథ సుప్రభాత వ్యాఖ్యలో వివరింపబడినది. పరాశర భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని చంద్రపుష్కరిణీ విహార ప్రియత్వము ఒక అద్భుత శ్లోకమున వర్ణించిరి. ఆ శ్లోకమేమనగా -"విహరతి హరౌ లక్ష్మ్యాలీలాతపత్ర పరిష్క్రియా - వినిమయ విధౌ నూనా - సూని క్రియా సఫలోత్పలామ్, అథ ముని మనః పద్మే ష్వబ్జాసహాయ విహారజ - శ్రమ హరతటీం యా మస్తా మైందవీ మరవిందినీమ్'' (39) అనునది.

**మాంధాతృముఖ్య ధరణీశ్వర సేవితాంఘ్రే** - మాంధాత సూర్యవంశపు రాజు. యవనాశ్వుని పుత్రుడు. శ్రీరంగనాథుడు ఇక్ష్వాకు కులధన మగుటచే ఆ వంశమున పుట్టిన రాజులందఱిచే పూజింపబడెను.

**శ్లో॥ స్వామిన్ ! ప్రపన్నజన రక్షణలబ్ధవర్ణ !**
**వేదాంతవేద్య ! మహనీయ గుణాంబురాశే !**
**ఔదార్య జన్మ నిలయాతుల శౌర్యధైర్య !**
**రంగేశ ! సింధుతనయాప్రియ ! మంగళం తే॥ 17**

స్వామిన్=స్వామి!, ప్రపన్నజన=ప్రపన్నుల, రక్షణ=రక్షించుటలో, లబ్ధవర్ణ= పండితుడా!, వేదాంతవేద్య=వేదాంతములచేత తెలియతగినవాడా!, మహనీయ గుణ+అంబురాశే=గొప్పగుణములకు సముద్రమువంటివాడా!, ఔదార్య=ఔదార్య గుణమునకు, జన్మనిలయ=ఉత్పత్తి స్థానమా!, అతుల= అసమానమైన, శౌర్య=శౌర్యము, ధైర్య=ధైర్యమును కలవాడా!, రంగేశ= శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళ మగుగాక!

స్వామీ! ప్రపన్నజనులను రక్షించుటలో సమర్థుడా!, వేదాంతవైద్యా!



గొప్పగుణములకు సముద్రమువంటివాడా! ఔదార్యగుణమునకు మూలమా! అసమానమైన శౌర్యధైర్యగుణములను కలవాడా! శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా!, నీకు మంగళమగుగాక!.

**స్వామిన్** - స్వామి అనగా సొత్తుదారుడు. ఆత్మలన్నియు భగవానుని సొత్తు. "స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్, ఆత్మదాస్యం హరేః సామ్యం స్వభావం చ సదా స్మర,'' ఇత్యాది సూక్తులు ఇందులకు ప్రమాణములు.

**ఆపన్న జన రక్షణ లబ్ధవర్ణ** - లబ్ధవర్ణుడనగా పండితుడు. "ధీమాన్ సూరిః కృతీ కృష్టిః లబ్ధవర్ణో విచక్షణః'' అని అమరము. ఇచట వర్ణశబ్దమునకు స్తుతి అని అర్థము. దేశికులును "ప్రపన్నజనతా సంరక్షణైకవ్రతీ'' అనుచు శ్రీరామ చంద్రుని ప్రపన్నత్రాణ పరాయణత్వమును ఉగ్గడించిరి. శ్రీరంగములోని శ్రీరంగనాథుని అర్చామూర్తి శ్రీరామచంద్రుని రూపముగా సంప్రదాయమున భావించుట ఇచట స్మరింపతగినది.

**వేదాంతవేద్య** - "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః'' అని గీతాచార్యుడు వేదములన్నిటిచే ప్రతిపాదింపబడు పరతత్త్వము తానే అనెను. బ్రహ్మసూత్ర కారుడును, "శాస్త్రయోనిత్వాత్'' అనుచు భగవానుని సృష్టి కారణత్వాదులు వేదరూప శాస్త్రముద్వారా తెలియనగుననెను. వేదాంత శబ్దములోని అంత శబ్దమునకు నిర్ణయమని అర్థము. కావున "వేదాంతైః వేద్యః'' అను అర్థముతో పాటు, "వేదాంతత్వేనవేద్యః'' అనియు ఇచట వివరింపవచ్చును.

**మహనీయ గుణాంబురాశే** - గొప్పకల్యాణ గుణములకు సముద్రుని వంటి వాడా! అని సామాన్యమైన అర్థము. ఇచట మహనీయ శబ్దము యొక్క అర్థస్వారస్యమును బట్టి, మహనీయ గుణమనుటకు వాత్సల్యమని చెప్పవచ్చును. ఆ గుణముతో సాటివచ్చు గుణము వేరొకటి లేదు కదా! కావుననే భగవద్రామానుజులు గద్యత్రయమున ఈ గుణమును మాత్రము రెండుమార్లు అనుసంధించిరి. అట్టి వాత్సల్యగుణమునకు సముద్రము వంటి వాడని భావము. అట్లే, మహనీయగుణమనగా సౌశీల్యమనియు చెప్పవచ్చును. గుణ శబ్దము సౌశీల్యమునకు పర్యాయము. ఇందులకు శ్రీరామాయణ ప్రారంభములోని "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్'' అనుచోట గుణశబ్దమును వ్యాఖ్యాతలు

సౌశీల్యమన వ్యాఖ్యానించిరి. అట్టి సౌశీల్యమునకు సముద్రమువంటివాడని భావము. ఇట్లు ఈ విశేషణములను ఇంకను పలురీతులలో వివరించవచ్చును. "గుణాంబురాశే" అను ప్రయోగమును బట్టి గుణముల యొక్క రత్నసామ్యము ధ్వనించుచున్నది.

**ఔదార్యజన్మనిలయ** - ఔదార్యగుణమునకు పుట్టినిల్లు అని అర్థము. "ఉదారో దాతృమహతోః" అను అమరకోశవచనమును బట్టి ఉదారుడనగా దాత గొప్పవాడును, ఔదార్యమనగా ఇతరులకిచ్చుచున్నాననను భావముతో కాక, తన పుత్రునివలె ప్రాప్తమైన దానిని అనుభవించుచున్నాడను భావముతో ఇచ్చు స్వభావము. లేక ఇతనికి ఇంత ఇచ్చితినని తలవకుండుట. లేక, అంతయు ఇచ్చినను ఏమియు ఇవ్వనివానివలె అతృప్తిని కలిగియుండుట. ఈ మూడును ఔదార్య గుణ ప్రకారములు. శ్రుతప్రకాశికా భట్టరు గద్యవాఖ్యలో ఔదార్య పదమును వివరించుచు, "అన్యస్మై దదామీత్యభిమాన విరహేణ, పుత్రవత్ ప్రాప్తం భుంక్తే ఇతి బుద్ధ్యా దాతృత్వమ్. ఇదమియద్దత్తం మయేత్యస్మరణ శీలత్వం వా, యద్వా సర్వం దత్వాపి ఋణం ప్రవృద్ధమివ మే ఇత్యతృప్తత్వం ఔదార్యమ్" అని పల్కుట ఇందులకు ప్రమాణము. దేశికులు ఈ గుణమును వివరించుచు, "పాత్రలాఘువం, దేయ గౌరవం చానాదృత్య దాయ విభాగన్యాయేన ప్రత్యుపకారాది నిరాపేక్ష వితరణ రసికత్వమ్" అనుటయు ఇచట స్మరణీయము. కావున తాను దాన మిచ్చువాని తక్కువతనము, తానిచ్చు వస్తువుయొక్క గొప్పతనమును లెక్కింపక, ఎట్టి ప్రత్యుపకారమును పొందగోరక దాన మిచ్చుటయు ఔదార్యమని ఏర్పడుచున్నది. "ఋణం ప్రవృద్ధమివ", "ఉదారాః సర్వ ఏవైతే" ఇత్యాది సూక్తులు భగవానుని ఔదార్యగుణ ప్రతిపాదకములు.

**అతుల శౌర్యధైర్య** - శౌర్య మనగా శత్రువులను నిర్జించు సామర్థ్యము. ధైర్యమనగా అతర్కితముగా బలవంతుడైన శత్రువు ఎదురైనను అతనిని నిర్భయముగా ఎదుర్కొను స్వభావము. దేశికులు ఈ గుణమును వ్యాఖ్యానించుచు, "జీవత్యపి మహాబలే రావణే సాగరస్యాప్యలంఘితే విభీషణ మభిషించతా దర్శితో2యం గుణః" అని పల్కిరి. మహాబలశాలి విభీషణుని లంకారాజ్యమునకు ప్రభువుగా అభిషేకించు శ్రీరామునిలో ఈ గుణము వ్యక్తమయ్యెనని భావము.



శ్రీరామచంద్రునకు ప్రతిరూప మగు శ్రీరంగనాథుని యందు ధైర్యమును ఈ గుణము అనుసంధించుట యుక్తమే కదా! అట్లే, శౌర్యమనుటకు, "అసహాయుడైనను, శత్రుబలము భయంకరమైనను, స్వబలములో వలె నిర్భయముగా ప్రవేశించు సామర్థ్యము అని విశదీకరించుచు దేశికులు అందులకు నిదర్శనముగా జనస్థానయుద్ధమును, యుద్ధకాండలో మూలబల యుద్ధమును పేర్కొనిరి. ఇట్టి స్వామి శౌర్యధైర్య గుణములు అసమానములని తాత్పర్యము.

శ్లో॥ **శ్రీవిష్ణుచిత్తతనయా నయనాబ్జమిత్ర!**
**తద్ధార్యమాల్యవహనోత్సుక చిత్తవృత్తే!**
**రామానుజాఖ్య యతివల్లభ భాగధేయ!**
**రంగేశ! సింధుతనయా ప్రియ! మంగళం తే॥** 18

శ్రీవిష్ణుచిత్తనయా=శ్రీవిష్ణుచిత్తుల తనయ అగు గోదాదేవి యొక్క, నయన+అబ్జ=నేత్రములను పద్మములకు, మిత్ర=సూర్యుడా!, తత్=ఆ గోదాదేవిచే, ధార్య=వహింపతగిన, మాల్య=పూమాలెను, వహన=ధరించుటలో, ఉత్సుక=ఆసక్తినికల, చిత్తవృత్తే=మనఃప్రవృత్తిని కలవాడా!, రామానుజాఖ్య=భగవద్రామానుజులను పేరుగల, యతివల్లభ=యతీశ్వరుల, భాగధేయ=అదృష్ట రూపమైన వాడా!, రంగేశ=శ్రీరంగనాథా!, సింధుతనయా ప్రియ=లక్ష్మీప్రియా, తే=నీకు, మంగళమ్=మంగళము.

భట్టనాథుల తనయ అగు గోదాదేవి నేత్రములను పద్మములకు సూర్యుని వంటి వాడా!, ఆ గోదాదేవి ధరింపతగిన పూమాలెను దాల్చుటలో ఆసక్తిని కలవాడా!, భగవద్రామానుజుల భాగ్యమా!, శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా!, నీకు మంగళమగుగాక!

**శ్రీవిష్ణుచిత్తతనయా నయనాబ్జమిత్ర** - గోదాదేవి శ్రీరంగనాథుని వివాహ మాడెనను వృత్తాంతమిచట స్మరణీయము.

**తద్ధార్యమాల్యవహనోత్సుక చిత్తవృత్తే** - ఆ గోదాదేవి దాల్చు పూమాలెను శ్రీరంగనాథుడు ధరించుటలో ఆసక్తి చూపిన ఉదంతము గోదాదేవి చరిత్రలో విదితము. తిరుప్పావై ప్రబంధమునకు తనియన్ (స్తుతిరూప) పాశురమున

రచించుచు ఉయ్యక్కొణ్డార్ అను ఆచార్యులు, "హంసలను కల్గిన శ్రీవిల్లిపుత్తూరు లో అవతరించిన గోదాదేవి శ్రీరంగనాథునకు రాగయుక్తములైన పాశురములను కల పాశురమాలను (తిరుప్పావైప్రబంధమును) తీయని రాగముతో ఆలపించి సమర్పించెను. అట్లే పూమాలెను తాను ధరించి సమర్పించెను" అని పల్కుట ఇచట అనుసంధేయము.

**రామానుజాఖ్యయతి వల్లభ భాగధేయ!** - భగవద్రామానుజులు గద్య త్రయముతో శ్రీరంగనాథుని స్తుతించిరి. అందు "త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవ దేవ" అనుచు పల్కుట గమనింప తగినది.

**శ్లో॥ హేమాపగా తరల తుంగ తరంగలోల**
**పాథోజ ధూలి వహనాలస మారుతేన।**
**సంపూజ్యమాన! సురచారణగీతకీర్తే!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 19**

హేమ+ఆపగా=కావేరీనదియొక్క, తరల=కదలాడు, తుంగ=ఉన్నతమైన, తరంగ=కెరటములచే, లోల=కదలు, పాథోజ=పద్మముల, ధూలి=పుప్పొడిని, వహన=మోయు, అలస=మందమైన, మారుతేన=వాయువుచే, సంపూజ్యమాన= పూజింపబడువాడా, సురచారణగీతకీర్తే=దేవతలచే చారణులచే కీర్తింపబడినవాడా, రంగ+ఈశ=శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళమగుగాక!,

హేమాపగ అనబడు కావేరీనది యొక్క చంచలములైన, ఎత్తైన కెరటముల కదలికల వలన అందున్న పద్మములు కదలాడుచున్నవి. ఆ కదలికల వలన రాలిన సూక్ష్మమైన పుప్పొడి ఆ పూల మీదుగా మెల్లగా ప్రసరించు మంద మారుతము నందు కలసియున్నది. ఇట్టి వాయువుచే సేవింపబడువాడా!, దేవతలచే, చారణులచే కీర్తింపబడువాడా!, శ్రీరంగనాథా!, లక్ష్మీప్రియా!, నీకు మంగళమగుగాక!

ఇందు కావేరీనదిపై వీచు మందమారుతముచే శ్రీరంగనాథుడు సేవింప బడుట పరమ రమణీయముగ వర్ణింపబడినది. బ్రహ్మాదులచే సేవ్యుడగు శ్రీరంగనాథుని వాయుదేవుడు సేవించుటలో ఆశ్చర్యమేమున్నది?



శ్లోకములోని పూర్వార్ధమంతయు ఒకే సమస్తపదము. మందమారుతమునకు విశేషణము. వాయువు సుఖప్రదముగా నుండవలెనన్న దానికి సౌగంధ్యము, శైత్యము, మాంద్యము అను మూడు గుణములుండవలయును. ప్రస్తుత విశేషణము వాయువు కావేరీనది మీదుగా వీచినట్లు తెలుపుటచే శైత్యము అను గుణము సూచింపబడినది. కావేరీనదిలోని పద్మముల పుప్పొడిని ఆ వాయువు మోయుచున్నదనుట సౌగంధ్యము చెప్పబడినది. అట్లే 'అలస' పదప్రయోగముచే మాంద్యము సూచింపబడినది. ఇట్లు ప్రస్తుతమున మందమారుతమునకు పూర్వోక్తములైన గుణత్రయము కల్గియున్నట్లు తెలుపబడుటచే ఆ మారుతము యొక్క శ్రేష్ఠత సిద్ధము. అట్టి వాయువు సుఖావహమగుటలో అచ్చెరువేమున్నది? ఈ సందర్భమున మహాకవి కాళిదాసు రఘువంశమున ద్వితీయసర్గలో దిలీపుడు గోసేవార్థము అరణ్యమున సంచరించునపుడు అతనిని వాయువుసేవించె ననుచు - "వృన్తై స్తుషారైః గిరినిర్ఝరాణా మనోకహా కంపితపుష్పగంధి, తమాతపక్లాంత మనాతపత్రమ్ ఆచారపూతం పవనః నిషేవే" అని పల్కుట స్మరణీయము. అట్లే, "లతాం పుష్పవతీం స్పృష్ట్వా స్నాత్వా విమల వారిషు, పునః స్పర్శనశంకీవ మందం చలతి మారుతః" అను అద్భుత శ్లోకముతో భోజుడు వాయువున కుండ వలసిన మూడు గుణములను సూచించుటయు ఇచట స్మరింపనగును.

శ్రీరంగనాథుని ఇట్లు వాయువు చల్లని వింజామరలు వీవగా, సురచారణులు ఆ స్వామిని కీర్తించుట ఇందు వర్ణింపబడినది. చారణులు దేవజాతికి చెందిన వారు.

**శ్లో॥ హే దేవదేవ! పురుషోత్తమ! లోకబంధో!**
**మాదృ ఙ్ముముక్షుజన రక్షణ జాగరూక!**
**శ్రీవాసుదేవ! నతబృందముదావహార్థ్య!**
**రంగేశ! సింధుతనయాప్రియ! మంగళం తే॥ 20**

హే దేవదేవ=ఓ దేవదేవా!, పురుష+ఉత్తమ పురుషోత్తమా!, లోకబంధో= లోకబంధూ!, మాదృక్=నావంటి, ముముక్షుజన=మోక్షేచ్ఛను కలవారిని, రక్షణ= రక్షించుటలో, జాగరూక=జాగరూకుడవైయున్నవాడా!, శ్రీవాసుదేవ=ఓ వాసుదేవ మూర్తీ, నతబృందముద+ఆవహ=(నిన్ను) నమస్కరించువారి సమూహమునకు

ఆనందమును కల్గించువారిలో, ఆఢ్య=గొప్పవాడా!, రంగేశ= శ్రీరంగనాథా!, సింధుతనయాప్రియ=లక్ష్మీప్రియా!, తే=నీకు, మంగళమ్=మంగళ మగుగాక!

ఓ దేవదేవా! పురుషోత్తమా! లోకబంధూ! మావంటి ముముక్షువులను రక్షించుటలో జాగ్రతతో నుండువాడా!, ఓ వాసుదేవా!, నిన్ను నమస్కరించు వారికి ఆనందమును కల్గించు స్వామీ!, శ్రీరంగనాథా! లక్ష్మీప్రియా! నీకు మంగళ మగుగాక!

ఇందు ఉత్తమోత్తమ కైంకర్యమగు భగవన్నామ సంకీర్తనమును చేయుట ద్వారా కవి స్తోత్రమును పరిసమాప్తి చేయుట విశేషము.

**హే దేవదేవ** - దేవతలకు దేవుడు స్వామి. దేవ శబ్దము "దివు" ధాతువు నుండి ఉత్పన్నమైనది. ఆ ధాతువునకు "దివు - క్రీడా విజిగీషా వ్యవహారద్యుతి స్తుతి మోదమదస్వప్న కాంతి గతిషు" అను పది అర్థములు కలవు. ఈ అర్థము లన్నియు స్వామి విషయమున సంగతములే. మఱియు "శ్రద్ధయా2దేవో దేవత్వ మశ్నుతే" అని సంస్కృతవేదము, "తిరుమామగళ్ కేళ్వాదేవా" అని ద్రావిడ వేదమును అట్టి స్వామికి లక్ష్మీదేవి వలన సిద్ధించెనని తెలిపినది. లక్ష్మీ సంబంధముచే సిద్ధించు స్వామి దేవత్వమును గూర్చి పైన పేర్కొనబడిన పది అర్థముల దృష్టిలో సుప్రసిద్ధ విద్వాంసులగు ఉ.వే.శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యుల వారు, తిరుపతి, చేసిన వివరణము సందర్భోచితమను దృష్టిలో ఇంచుక ఇచట ప్రస్తుతింపబడుచున్నది.

1. **దీవ్యతి-శ్రియాసహక్రీడతి-ఇతి దేవః** - కూరేశులు శ్రీస్తవములోని ప్రారంభ శ్లోకమున, "క్రీడేయం ఖలు నాన్యథా2స్య రసదాస్సాదైకరస్యాత్తయా" అని పల్కుట, భట్టరు శ్రీరంగరాజస్తవమున "క్రీడసి శ్రీ సమక్షం" అని పల్కుటయు ఇందులకు నిదర్శనములు. భగవానుడు లక్ష్మీదేవి కొఱకు తన కానందమును కల్గించు సృష్ట్యాది క్రీడను చేయుచున్నాడని. కావున దేవ శబ్దవాచ్యుడయ్యెనని భావము.

2. **దీవ్యతి-శ్రియా విజిగీషతి-ఇతి దేవః** - జయింపగోరువాడు కావున దేవుడు అని అర్థము. జయము అనగా అందరికంటె ఉన్నతుడైయుండుట శత్రువులను జయించుట అని రెండర్థములు. చేతనాచేతనములు రెండిటి కంటె భగవానుడు



స్వరూపముచే గుణములచే అధికుడై వెలుగొందువాడు. ఇట్టి ఉత్కర్ష "అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్" అని భట్టరు శ్రీగుణరత్నకోశమున పల్కినరీతిలో లక్ష్మీసంబంధనిబంధనము. అట్లే శ్రీ సంబంధము వలన స్వామి శత్రువులను జయించుననుట "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా" అను శ్రీరామాయణోక్తి వలన తెలియుచున్నది.

3. **దీవ్యతి-శ్రియా వ్యవహరతి-ఇతి దేవః** - వ్యవహరించువాడు కావున దేవుడు. వ్యవహరతి అనుటకు పలుకువాడని, వాదులాడు వాడనియు రెండర్థములు. ఇవి రెండును ఇచట సంగతములే. లక్ష్మీదేవికి భగవానుడు విష్ణులోకమున ద్వయమంత్రము నుపదేశించెననుట సుప్రసిద్ధము. కావున పల్కుట అనగా ఉపదేశించుట అను మొదటి అర్థము సంగతము. లక్ష్మీదేవితో స్వామి వాదులాడువాడనుటను భట్టనాథులు తమ ప్రబంధమున "తన్నడియార్ తిఱుత్తు" అను పాశురమున రస్యముగ వర్ణించిరి. భగవానుని భక్తప్రియత్వము ను పరీక్షింపగోరిన లక్ష్మీదేవి భక్తుల దోషములను గూర్చి పలుకగా స్వామి అపుడు ఆమెతో "నా భక్తులు ఏనాడును తప్పుచేయరు - చేసినచో మంచినే చేయుదురు" అని బదులు పల్కినను అచటి సూక్తి ప్రస్తుతమున అనుసంధేయము.

4. **దీవ్యతి-శ్రియాద్యోతతే-ఇతిదేవః** - ప్రకాశించువాడు కావున దేవుడు. ఈ అర్థమునకు అనుగుణముగా శ్రీరామాయణము బాలకాండ చివరలోని "తయా స రాజర్షినుతాభిరామయా సమేయివా నుత్తమ రాజకన్యయా, అతీవ రామః శుశుభే" అను సూక్తి యొక్క భావము అనుసంధింపతగినది.

5. **దీవ్యతి-శ్రియా స్తూయతే-ఇతిదేవః** - స్తుతింపబడువాడు కావున దేవుడు. కాకాసుర వృత్తాంతమున శ్రీరామచంద్రుడు కాకాసురుని వధించుటకై బ్రహ్మాస్త్రమును ప్రయోగింపబోయినపుడు ముల్లోకములను పరిభ్రమించి గతిలేక తిరిగి వచ్చి అచేతనమువలె క్రిందపడిన కాకాసురుని తలను సీతాదేవి శ్రీరాముడు చూడకుండ ఆ స్వామి పాదముల వద్ద యుండునట్లు సరిచేసెను. అపుడు శ్రీరాముడు తనను కాకాసురుడు శరణాగతి చేసినట్లు భావించి క్షమించెను - అను వృత్తాంతము ఇచట స్మరణీయము. ఇచట లక్ష్మీదేవి (సీతాదేవి) సాక్షాత్తు స్తుతించి శరణాగతి చేసినట్లు లేకున్నను తత్పర్యాయ రూపమగు పాదములందు

నమస్కరించునట్లు చేయుటచే ప్రకృతార్థము సమన్వితమని చెప్పవచ్చును.

6. **దీవ్యతి-శ్రియామోదతే-ఇతిదేవః** - లక్ష్మీదేవితో ఆనందించుచున్నాడు కావున దేవుడు. ఇందులకు, "మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠముత్తమం స్వామి పుష్కరిణీ తీరే రమయా సహ మోదతే" వంటి ప్రమాణములు గ్రాహ్యములు.

7. **దీవ్యతి-శ్రియా మాద్యతి-ఇతిదేవః** - లక్ష్మి కారణముగా మదమును (గర్వమును) పొందుచున్నాడు కావున దేవుడు. ఈ అర్థమునకు అనుగుణముగా శ్రీరంగరాజస్తవమున భట్టరు, "సింహాసనే కమలయా" (66) అను శ్లోకమున "సౌందర్యసంపదవలిప్తమివాలి హీయమ్" అని వర్ణించుటను గ్రహింపనగును.

8. **దీవ్యతి-శ్రియా సహ స్వపితి-ఇతదేవః** - లక్ష్మీదేవితో కలసి నిద్రించువాడు కావున దేవుడు. శ్రీరామాయణములోని సుందరకాండమున గల "పరిశ్రమాత్ ప్రసుప్తా చ రాఘవాంకే2వ్యహం చిరమ్, పర్యాయేణ ప్రసుప్తశ్చమమాంకే భరతాగ్రజః" (38-21) అను శ్లోకము యొక్క భావమును ఇచట అన్వయింప నగును.

9. **దీవ్యతి-శ్రియా కామ్యతే-ఇతి దేవః** - లక్ష్మి కారణముచే కోరువాడు, మరియు లక్ష్మి కారణముగా కోరుకొనబడువాడు కావున దేవుడు. ఇచట మొదటి అర్థమునకు అనుగుణముగా శఠకోపసూరి ప్రబంధములోని "కోలమలర్ప్పావైక్కు అన్బా కియ ఎన్నన్బేయా"(10-10-7) అను సూక్తి అనుసంధేయము. ఇచట భగవానుడు తన కిష్టమైన లక్ష్మీదేవికి పరికరమగుటచే నా యందు ప్రేమను చూపెనను భావము ఏర్పడుటచే మొదటి అర్థము సమన్వయింప బడినది. భగవానుడు మనచే కోరబడుటకు లక్ష్మి ఎట్లు కారణమనగా, పురుషకారరూపములో స్వామి మనలను రక్షించునను విశ్వాసము లక్ష్మి పురుషకారము వలన కల్గును కావున మనము స్వామిని కోరుటకు లక్ష్మి మూల కారణమగుచున్నది. ఇట్లు రెండవ అర్థము సుసంగతము.

10. **దీవ్యతి-శ్రియా గమ్యతే అవగమ్యతే-ఇతి దేవః**- లక్ష్మీదేవివలన తెలిసికొనబడు చున్నాడు కావున దేవుడు. ఇచట అవగమన శబ్దమునకు అధ్యవసాయమని అనుభవమని రెండర్థములు చెప్పవచ్చును. భగవానుడు మనచే ఉపాయముగా



మన పాపములను అన్నిటిని పోగొట్టి మోక్షమును అనుగ్రహించువాడుగా నమ్మబడుచున్నాడని, మోక్షదశలో అనుభవింపబడుచున్నాడనియు ఈ రెండర్థముల తాత్పర్యము. లక్ష్మీదేవి పురుషకారములేనిదే స్వామి మోక్షోపాయము కాజాలడు కావున అధ్యవసాయరూపమైన మొదటి అర్థము సిద్ధము. ప్రాప్యదశలో కూడ భగవానుడు లక్ష్మీసహితునిగనే సేవింపబడును. ద్వయములోని ఉత్తర ఖాండార్థము అదియే కదా! లక్ష్మణుడును సీతా సహితుడైన శ్రీరామచంద్రునకు సేవచేసి మురిసెను కదా!

ఈ విధముగా భగవానుని దేవత్వమునకు లక్ష్మీసంబంధము కారణమనుట క్లుప్తముగా నిరూపింపబడినది. ఇచట వివరింప తగిన అంశములు పలు ఉన్నను విస్తర భీతిచే ప్రస్తావింపబడలేదు.

**పురుషోత్తమ** - పురుషులలో ఉత్తముడని, పురుషుడును ఉత్తముడును అని తత్పురుష, కర్మధారయములతో రెండు విధములుగా చెప్పవచ్చును. "స్త్రీప్రాయ మితరత్ సర్వమ్" అనునట్లు లోకములోని జీవులందఱు స్త్రీ సమానులని, భగవానుడొక్కడే పురుషుడని శాస్త్రములు తెల్పుచున్నవి. "పురి శేతే ఇతి పురుషః " పురమున శయనించువాడు పురుషుడను వ్యుత్పత్తిలో పురి అనుటకు దేహమను అర్థమున్నను ప్రకృతమున శ్రీరంగనాథునిపరముగా "శ్రీరంగపురి శేతే ఇతి పురుషః" అను వ్యుత్పత్తిని గొని పురుష శబ్దమును వివరింపనగును. "ఉత్తమః పురుషస్త్వన్యత్ పరమాత్మేత్యుదాహృతః" అను గీతా శ్లోకమును పురుషులలో ఉత్తముడను అర్థమునకు ప్రమాణము. ఉత్తమ శబ్దమును భగవానుని విషయమున సార్థకము. తన స్వార్థము కొఱకు ఇతరమును క్లేశపెట్టు వాడు అధముడని, తన సంతోషము కొఱకు ఇతరుల సంతోషము కొఱకు ప్రయత్నించువాడు మధ్యముడని, తాను ఎట్టి వ్యయమును పొందినను ఇతరుల శ్రేయస్సు కొఱకే ప్రయత్నించువాడు ఉత్తముడని శాస్త్రవచనము. భక్తుల కొఱకై ఎన్నియో పడరాని పాట్లు పడునట్టి స్వామి ఉత్తముడే కదా! గోదాదేవియు "ఓఙ్గి ఉలకళన్ద ఉత్తమన్" అని కీర్తించెను కదా!

**మాదృఙ్ముముక్షు జన రక్షణ జాగరూక** - శ్రీరంగనాథుడు ఆదిశేషునిపై శయనించియున్నను జగద్రక్షణచింతను చేయుచునే ఉండను. "విశ్వత్రాణ

విమర్శనస్థలితయా నిద్రాపి జాగర్యయా'' అనుచు భట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కిరి కదా! ఈ విశేషణము భగవన్మూర్తులన్నిటికిని అన్వయింపతగినదైనను, ప్రత్యేకించి శ్రీరంగనాథుని విషయమున మిక్కిలి అర్థవంతము అగుట గమనింప తగినది.

**శ్రీవాసుదేవ -** పూర్వవిశేషణమున అనుసంధింపబడిన జగద్రక్షణ జాగరూకత్వ మునకు మూలమైన రూపము ఈ విశేషణము ద్వారా స్మరింపబడుచున్నది. వాసుదేవమూర్తి వ్యూహరూపములకు వసుదేవుని కుమారుడు కావున భగవానుడు వాసుదేవుడయ్యెనని ఒక అర్థము. "సర్వత్ర వసతీతి వాసుః, వాసుశ్చ అసౌ దేవశ్చ వాసుదేవః'' అను వేరొక వివరణమును బట్టి అంతట అంతర్యామిగా నివసించువాడు, (అట్టి వాత్సల్యగుణముచే) ప్రకాశించువాడను అర్థమును ఈ పదము తెలుపుచున్నది అని చెప్పవచ్చును. అట్లే, అన్నియు స్వామియందు వసించుచున్నవి కావున వాసుదేవుడనియు చెప్పబడుచున్నాడు. ఈ రెండు అన్వయములు "సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః, తత స్స వాసుదేవేతి విద్వద్భి పరిపఠ్యతే'' అను విష్ణుపురాణశ్లోకమున తెలుపబడినది. భట్టరు విష్ణుసహస్ర నామ భాష్యమున వాసుదేవ శబ్దమును వ్యాఖ్యానించుచు "వాసుశ్చాసౌ దేవశ్చేతి విశ్వం స్మస్మిన్ సవిత్రీవ వాసయన్, పక్షాభ్యామివ ఆచ్ఛాదయంశ్చ తస్మిన్ వసతీతి వాసుః, ఏవం క్రీడతి, విజిగీషతే, అథ చ ద్యోతతే, స్తూయతే, గచ్ఛతి చ ఇతిదేవఃఅతో వాసుదేవః'' అని పల్కిరి. మఱియు ఇందులకు ఉపోద్బలకముగా పూర్వోక్త విష్ణుపురాణశ్లోకముతో పాటు మహాభారతములోని "ఛాదయామి జగత్ సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః, సర్వభూతాధివాసశ్చ వాసుదేవః తతః స్మృతః'' అను శ్లోకమును ఉదాహరించిరి.

**నతబృంద ముదావహోఽ్య -** భక్తులకు ఆనందమును కల్గించు స్వభావమును స్మరించుచు స్తోత్రమును కవి ముగించుచున్నారు.

శ్రీః



## శ్రీ ఈ.ఏ.శింగరాచార్యుల వారి వ్యాఖ్యాన గ్రంథములు

1. శ్రీ రంగనాథ సుప్రభాతమ్-మంగళాశాసనమ్-ప్రపత్తి-శ్రీసేవావ్యాఖ్యా
2. శ్రీ రంగనాథస్తవమ్-పూర్వశతకమ్-అర్థ తాత్పర్య వివరణ
3. శ్రీ రంగనాథ అభిషేక చూర్ణికలు-శ్రీసేవావ్యాఖ్యా
4. శ్రీ గరుడదండకమ్-సంస్కృతాంధ్రవ్యాఖ్యలసమాహారం

వట్టిచెరుకూరు వాస్తవ్యులైన

**రావి వెంకట సుబ్బయ్య మరియు సీతారావమ్మ గార్ల**

ఆర్థిక సహాయముతో ముద్రింపబడిన ఈ

**'శ్రీసేవావ్యాఖ్యా'** వ్యాఖ్యాన గ్రంథము

**శ్రీరంగ శ్రీ గోదాదేవి సమేత శ్రీరంగనాథ స్వామి వారి**

పాదపద్మములకు సమర్పితము

శ్రీః

# శ్రీరంగనాథ అభిషేక చూర్ణికలు
# శ్రీ రంగనాథ స్తోత్రమ్ - శ్రీరంగరాజ వింశతి

**శ్రీ పరాశర భట్టర్ - శ్రీ వరవరమునులు**



**శ్రీసేవావ్యాఖ్యా**

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విపుల వివరణ)

ఈ.ఏ. శింగరాచార్యులు



**ప్రకాశకులు**

## సాధన గ్రంథ మండలి, తెనాలి.



వెల రూ. 40-00

# శ్రీరంగనాథ చూర్ణికలు

## ఉపోద్ఘాతము

శ్రీవైష్ణవాచార్య పరంపరలో నాయకమణిగా వెలుగొందు శ్రీరామానుజుల అంతరంగ శిష్యులలో కూరేశులు అనబడు శ్రీవత్సాంకులు ప్రథమగణ్యులు. వీరికి పరాశరభట్టరు, వ్యాసభట్టరు అను కుమారు లిరువురు అవతరించిరి. వీరిలో శ్రీ పరాశరభట్టరు సకల శాస్త్రములలో సమర్థులు. కావుననే వీరు 'భట్టర్!' అని గొప్పగా సంబోధింపబడుచున్నారు. భట్టరు అనగా వేద శాస్త్రాదుల నన్నింటిని తెలిసినవారని అర్థము. శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకియు స్వయముగా వీరిని ఊయలలో పరుండబెట్టి, లాలించి, పెంచిరని వీరి చరిత్ర తెలుపుచున్నది. దీనిని వీరే ('శ్రీరంగరాజ కమలా పద లాలితత్వమ్'-ఇత్యాదిగా) తెలిపిరి. దివ్య దంపతులు పరిపూర్ణ కటాక్షమునకు పాత్రమైన వీరు మహా మేధావిగా, గొప్ప కవిగా, రసికాగ్రేసరులుగా వెలుగొందుటలో ఆశ్చర్యమేమియు లేదు.

వీరు భగవద్రామానుజుల ఆజ్ఞానుసారము కూరేశులు పొందిన సేవలను- అనగా శ్రీరంగనాథుని పురోహితులుగా విజ్ఞాపనము చేయుట, పురాణ పఠన మొనర్చుట, అభిషేక కాలములలో అభిషేక చూర్ణికలను విన్నవించుట మొదలగు విశేషకైంకర్యములను పరంపరాప్రాప్తముగా పొంది, నిర్వహించు చుండిరి. దానికి తగినట్లు వీరి ప్రార్థనా శ్లోకము అద్భుతముగా అమరియుండుట గమనింప తగినది. ఆ శ్లోకమమేమనగా -

**శ్లో॥ శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః।**
**శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే॥**

(కూరేశుల పుత్రులు, శ్రీరంగనాథుల పురోహితులు, శ్రీవైష్ణవసిరిని నిండుగా కలవారును అగు శ్రీపరాశరభట్టరు నాకు మిగుల మంచిని కల్గింతురుగాక!)

కొన్ని మాసారంభ దినములలో, ప్రతి ఏకాదశి, అమావాస్యలలో, రేవతీ నక్షత్రము కూడిన దినములలో, సూర్యచంద్రగ్రహణ సమయములలో, ఇంచు మించు ఉత్సవములలో చివరినాళ్లలో శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి అభిషేకము ను స్వీకరించుట పరిపాటి. అపుడు వేదమును విన్నవించుటకును, అభిషేక చూర్ణికలను పఠించుటకును పురోహితులగు భట్టరు వచ్చుట సంప్రదాయము.

గొప్ప కవిగా, ఆశుకవిగా, వెల్లునట్టి, పరమరసికులగు భట్టరును అచటి పెద్దలు స్వామిని ఒక శ్లోకముతో వర్ణింపుడని ప్రార్థింతురు. అపుడు భట్టరును అందులకు అంగీకరించి ఒక చక్కని శ్లోకమును రచించి, భగవానుని నదిగా, పర్వతముగా, సముద్రముగా, కల్పవృక్షముగా, మేఘముగా, సూర్యునిగా, చంద్రునిగా, ఇట్లు పలు వానితో పోల్చి వర్ణించుచు, వానికి తామే శ్రుతిస్మృతి-ఇతిహాస-పురాణములు, కావ్యములు, దివ్యసూరుల సూక్తులు, పూర్వాచార్యుల స్తోత్రములు అను వీని నుండి ప్రమాణములను చూపి, వ్యాఖ్యాన మొనర్చుటయు అలవాటు. భట్టరు శ్లోకములు శబ్దమాధుర్యము, అర్థగాంభీర్యములతో నిండియుండి, శ్రోతల మనస్సులను కొల్లగొట్టునవియై యుండును. వీనికి భట్టరు స్వయముగా రచించిన వ్యాఖ్యలు అసమానములై వెలుగుచున్నవి.

ఇవి సంస్కృతము, తమిళము అను రెండును కలసిన మణిప్రవాళశైలిలో అమరియున్నవి. పఠితల మనస్సులను కదలించు స్వభావమును కల్గినవి ఇవి. ఈనాటికి భట్టరు వంశీయులు భట్టరు శ్లోకములను వారు అనుగ్రహించిన వ్యాఖ్యతో ఒక్కొక్క అభిషేక సమయములో ఒక్కొక్క శ్లోకమును సవ్యాఖ్యాగా శ్రీరంగనాథుని ముందు విజ్ఞాపించుచున్నారు.

శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తి అభిషేకమును స్వీకరించునపుడు ఈ శ్లోకములను విన్నవించుటకు ముందు ఆలయములోని అర్చకులు 'అరుళప్పాడు పరాశరభట్టర్' (పరాశరభట్టరు అనుగ్రహింపబడు చున్నారు)అని ఆహ్వానింతురు. వెంటనే భట్టరు 'నాయన్దే' (స్వామీ! నీ దాసుడను) అని ప్రత్యుత్తర మిచ్చుచు స్వామి ముందుకు వచ్చి నిలుతురు.

'నాయన్దే' అనుటను తెనుగున 'స్వామీ' అనుచు ఆంధ్రీకరింపబడినది. 'నాయన్, తే'' స్వామి! నేను నీ దానుడనని ఆ ప్రయోగము యొక్క అర్థము. అట్లే, అనువాదములో సర్వత్ర 'తి.వా' అను సంకేతము శఠకోపసూరి ప్రబంధమగు తిరువాయ్‌మొళిని తెలుపునని గుర్తింపనగును. భట్టరు రచించిన ఈ అభిషేక (సమయ) శ్లోకములను వారి వ్యాఖ్యానముతో పాటు శ్రీరంగము లోని శ్రీ.అ.కృష్ణమాచార్యులుగారు(శ్రీవైష్ణశ్రీ ముద్రాలయాధిపతి)30-5-1999న తేదీన తమిళ భాషలో ప్రచురించిరి. ఇవి ఇంతవరకు ఆంధ్రీకరింపబడలేదు. వ్యాఖ్యలలోని ప్రమాణములకు లభించినంత వరకు ఆవరములను చూపుచు, యథాశక్తి అనువాదమును చేసితిని. భట్టరు వంటి మహనీయుల సూక్తులను, అందున తమిళ భాషలో రచింపబడిన వ్యాఖ్యలను ఆంధ్రీకరించుట, మాదృశునకు మిక్కిలి కష్టతరము, సాహసమును అనుటలో సందేహము లేదు. వాని అపూర్వమైన ఈ సాహిత్యమును తెలుగువారికి అందివ్వవలెనను ఉత్కట మైన అభిలాష, ఆత్మీయుల మాటను కాదనలేకపోవుటయు నేనీ ప్రయత్నమును చేయుటకు ముఖ్యకారణములు.

ఈ శ్లోకములతో వ్యాఖ్యలతో పాటు అనుబంధముగా ఇందు చేర్చబడిన మరికొన్ని (ఎనిమిది) శ్లోకములు 'భట్టార్యముక్తకములు' అను పేరుతో శ్రీ పరవస్తు గోవిందాచార్యులుగారిచే శ్రీనివాసముద్రణాలయమున (గోరింట్ల) 1940వ సంవత్సరమున ప్రచురింపబడినవి. వీనికి భట్టరుకృతవ్యాఖ్య దొరుక లేదు. ఉన్నదేమో తెలియదు. వీనిని భట్టరు వంశీయులు శ్రీరంగమున విన్నవించు చున్నట్లును కానరాదు. ఇవి ఏవిధముగా ప్రచారములోనికి వచ్చినవో తెలియకున్నది. ఈ శ్లోకములన్నియు 'త్వం మేఽహం మే' అను 25వ శ్లోకముతో పోలినవై, రసికజన హృదయావర్జకములైయుండుటచే అనుబంధముగా చేర్చబడినవి. సాహిత్యరసికులైన, సహృదయులైన పాఠకులు ఈ ప్రయత్నమును వాత్సల్యముతో ఆదరింతురని నమ్ముదును. నన్ను ఈ కార్యమునకు పదేపదే ప్రోత్సహించిన మిత్రవర్యులు శ్రీ ఆర్. మోహనరావు గారికి హార్దికమైన కృతజ్ఞతావిష్కరణమొనర్చుచున్నాను. 'సరస్వత్యాన్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే'.

**శ్రీ పరాశర భట్టార్యకృతాభిషేక చూర్ణికాః।**
**ఆంధ్రీచకార విదుషాం శింగరార్య స్సతాం ముదే॥**

* * *

శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః
శ్రీపరాశరభట్టర్ ప్రణీత

# శ్రీరంగనాథుని అభిషేక చూర్ణికలు

(తిరుమఞ్జన కట్టియమ్)

శ్లో॥ అమృత ప్రభవం ప్రభాప్రభావ
ప్రహతధ్వాంత లసద్విలాస జాతమ్।
సకలం సకలానుమోదహేతుం
శశినం త్వాం కలయామి రంగరాజ॥ 1

**ప్రతిపదార్థము:-** అమృత ప్రభవం=అమృతశబ్దవాచ్యమగు మోక్షమునకు నిర్వాహకుడవు, (లేక) అమృతమనబడు (కారణ) జలమునకు ఉత్పాదకుడవు, ప్రభాప్రభావ=(నీ దివ్య దేహము యొక్క స్వరూపము యొక్క) కాంతి యొక్క ప్రభావముచే, ప్రహతధ్వాంత=నశింపచేయబడిన (బాహ్య - అబాహ్య) తిమిరమును కలవాడవు, లసత్+విలాస జాతమ్=ప్రకాశించు (నిత్యయౌవనకృత) వీలలను కలవాడవు, సకలం=కలా శబ్దముచే తెలుపబడు లక్ష్మీతో, దివ్యాయుధములతో, వేదములతో కూడినవాడు, సకల+అనుమోదహేతుమ్= కలాశబ్ద వాచ్యమగు వేదమును కల (వేదమందు నిష్ఠను కల) వారికి ఆనందహేతువైనవాడవు అగు, త్వాం=నిన్ను, రంగరాజ=రంగనాథా!

**చంద్రుని పక్షమున**

అమృతప్రభవం=(దేవభోగ్యమగు) అమృతమునకు జన్మస్థానము, (లేక) అమృతమనబడు జలమును జన్మస్థానముగా కలవాడు, ప్రభాప్రభావ=తన వెన్నెల యొక్క ప్రభావముచే, ప్రహత=నశింపచేయబడిన, ధ్వాంత=చీకటి యొక్క,లసత్=ప్రకాశించు, మీనజాతమ్=లీలలసమూహమును (విజృంభణము లను) కలవాడు, సకలం=కళాశబ్దవాచ్యములగు అంశలతో కూడినవాడు, సకల+ అనుమోదహేతుమ్=అందటి ఆనందమునకు హేతువైన వాడును అగు, శశినం =చంద్రునిగా, కలయామి=భావింతును.

**'శ్రీసేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'శ్రద్ధయా దేవోదేవత్వ మశ్నుతే' (శ్రద్ధాస్వరూపిణియగు లక్ష్మిచే దేవుడు దేవత్వమందుచున్నాడు - కాఠ - 3.3) అని, ' అస్యేశానా జగతో విష్ణుపత్నీ' (ఈ జగత్తుకు ఈశ్వరి, విష్ణుపత్ని - నీళాసూక్తమ్) అని, "ఆనీదకాతమ్ స్వధయాతదేకమ్' (సంహార కాలమున స్వధాస్వరూపిణియగు లక్ష్మితో భగవానుడు ఒకటిగా కలసియుండెను - యజు.బ్రాహ్మణే - 2.8.9) అని, 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' (హ్రీదేవి అగు భూదేవియు, లక్ష్మిదేవియు నీకు పత్నులు - తైత్తి - ఆర - 3-13-41) అని, 'శ్రీవత్సవక్షా: నిత్యశ్రీ:' (శ్రీవత్సమను పుట్టుమచ్చను వక్షఃస్థలమున కలవాడు, నిత్యయైన లక్ష్మిని కలవాడు, అనగా ఎల్లప్పుడు లక్ష్మితో కూడియుండువాడు-రామా-యుద్ధ- 114-15) అని, 'రసికుడు లక్ష్మీభర్త' (తి.వా. 1-9-1)అనియు చెప్పబడిన విధముగా శ్రియఃపతివై, 'విజ్ఞానమానందంబ్రహ్మ'(పరబ్రహ్మ విజ్ఞానస్వరూపుడు, ఆనందమయుడు)' అని, 'శాంతానంత చిదానందం' (శాంతుడు, అనంతుడు, చిద్రూపుడు, ఆనంద స్వరూపుడు అగు వానిని) అని, 'వెలుగునట్టి ఆనంద స్వరూపుడు' అనియు నుడువబడినట్లు జ్ఞానానందస్వరూపుడవై 'పరా2స్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికో జ్ఞానబల క్రియాచ" (ఈ పరమాత్మ యొక్క ఉత్కృష్టమైన శక్తి స్వాభావికమైనది, వివిధములైనది, జ్ఞానబలక్రియలను కల్గినదియును - శ్వేతా - 6-8), 'తేజోబలైశ్వర్యమహావిబోధ సువీర్యశక్త్యాది గుణైకరాశి:' (తేజస్సు, బలము, ఐశ్వర్యము, గొప్పజ్ఞానము, గొప్పవీర్యము, శక్తి మొదలగు గుణముల అద్వితీయమైన సమూహము - వి.పు. 6-5-85) అని, "అనవధిక కల్యాణ గుణములను కల నారాయణుడు' (తి.వా. 1-2-10) అనియును వర్ణింప బడినట్లు" సమస్త కల్యాణగుణాత్మకుడవై (వి.పు -6-5-84), 'భారూపః' (ప్రకాశ స్వరూపుడు - ఛాందో. 3-14-2) అని, 'ఇచ్ఛా గృహీతాభిమతోరుదేహః' (ఇచ్ఛచే గ్రహింపబడినది, అభిమతమైన గొప్పరూపమును కలవాడు - వి.పు. 6-5-84) అని, 'కాచివడబోసిన మంచి బంగారమును నీ మేనికాంతికి సరికాదు' (తి.వా. -3-1-2) అని చెప్పబడినట్లు అతి విలక్షణమైన దివ్యమంగళ విగ్రహ విశిష్టుడవై, 'యస్య ఛాయా2మృతమ్' (ఎవని ఛాయ అమృత స్వరూపిణియగు లక్ష్మియో

తై.త్తి. 4-1) అని, 'అస్యా మమ చ శేషాహి విభూతి రుభయాత్మికా' (ఉభయ విభూతులను ఈమెకు అనగా లక్ష్మికి, నాకును శేషములు కదా) అని, 'భూలోకవాసులకు, పరమపదవాసులకును ఎల్లప్పుడు నేత్ర భూతుడు' (తి.వా. -1-8-3) అనియు తెలుపునట్లు లీలాపరికరముగ, భోగపరికరముగనున్న లీలా విభూతిని, త్రిపాద్విభూతినికలవాడవై, ఇట్లు విలక్షణ స్వరూప-గుణ-విగ్రహ-విభూతులను కల్గినవాడవైయుండుటచే అవాప్త సమస్త కాముడవైయున్నవాడవై నను అంతులేని అనర్ఘ సముద్రమున మునిగి యుండి అల్లాడు సకల చేతనులపట్ల 'దయగలవాడు' (తి.వా. 2-10-11) అనునట్లు ఆజాన సిద్ధమైన, అందమైన కరుణతో వారికి ఆశ్రయంప తగినవాడవగుట కొఱకు, 'ఏవం పంచ ప్రకారో2హమాత్మనామ్ పతతా మథః'(ఇట్లు అయిదు విధములను కలవాడనగు నేను అథః వతనము చెందు ఆత్మలకు) అని, 'పరమపదముననుందువు, వేంకటాద్రిపై నిలుచుందువు, సముద్రమున పవళింతువు, భూమిపై సంచరింతువు, వీనియందు అంతట(దాగియుండి) అంతర్హితుడవై నివసింతువు' (తి.వా. 6-9-5) అనియును పల్కునట్లు పరత్వాది ప్రకారపంచకమును పరిగ్రహించునపుడు, 'తమసః పరస్తాత్' (తమస్సునకు ఆవలి వైపున - పురుష సూక్తమ్) అని, 'మిక్కిలి ఉన్నతమైన, పరమాకాశ శబ్దవాచ్యమైన పరమపదమున నుండు వాడు' (తి.వా. 5-3-9) అని, 'అంభస్యపారే' (సముద్రజలతీరమున - తైత్తి. నారా) అని, 'క్షీరాబ్ధియందు నీవు శయనించిన అందమును మేము వినునపుడే కాళ్ళు ఆడును, పెరియ తిరువన్దాది - 34) అనియు పల్కిన విధమున పర-వ్యూహములు దేశ విప్రకృష్టములగుటచే, విభవములు - 'గత స్స్వస్థాన ముత్తమమ్' (ఉత్తమమైన స్వస్థానమునకు చేరెను - భారతే - మౌసలపర్వణి) అని, "ఆశ్చర్యకరచేష్టితములను చేసి, స్వస్థానమునకు పోయిన అద్భుతకృత్యములును - తి.వా. 5-10-1) అని చెప్పునట్లు కాలవిప్రకృష్టములగుటచే, 'యమాత్మానవేద యస్య ఆత్మా శరీరమ్' (ఏ భగవానుని ఆత్మ తెలియదో, ఏ భగవానునకు ఆత్మ శరీరమో - బృహ. 3-7-3) అని, 'బాహ్యచక్షువుకు కానరాని వాడా' (తి.వా. - 7-2-2) అని చెప్పునట్లు అంతర్యామి రూపము కరణ విప్రకృష్టమగుటచే, ఇట్టి ఎట్టి దేషములు లేని అర్చావతారము అన్ని విధములుగా సన్నికృష్టమై 'అర్చావతార విషయే మయాప్యుద్దేశత స్తథా, ఉక్తాగుణా న శక్యంతే వర్షశతైరపి' (అర్చావతార విషయమున నాచే కూడ సంగ్రహముగ తెలుపబడినది. అందలి గుణములు నూరు సంవత్సరముల పాటు పల్కినను సాధ్యము కాదు -  ) అని, 'భక్తుడు తన మనస్సుతో దేనిని భగవద్రూపముగ భావింతురో, దానినే నీలాబ్దవర్ణాడగు స్వామి ఆదరించును' (తి.వా. 13-6-9) అనియు పలుకునట్లు అనవధిక సౌలభ్యాది కల్యాణగుణ గణసీమాభూమియగుటచే, 'అర్చారూపిగా నుండియే సమస్త జీవులను అంగీకరింతుము' అని మనస్సున తలచి, 'భక్తులు, దేవతలు, ప్రాచీన వాక్కును (సంస్కృతమును) పాడిన మునులు, అంతట వ్యాపించి, నర్తించు సిద్ధులును, అంజలి ఘటించి, నమస్కరించు, దిక్కులకు దీపమైయున్న శ్రీరంగము' అనునట్లు అజ్ఞ సర్వజ్ఞ భేదములేక, అశేషలోక శరణ్యుడవై శ్రీరంగ మహానగరమున శ్రీరంగనాథుడవై వేంచేసియుండు నీవు ఇపుడు దివ్యోత్సవమును మిషతో పాదుకలను దాల్చి, బయలుదేరి బహువిధకటాక్షామృత వర్షముతో చేతనుల బహువిధమైన, నిరంతరమైన దుఃఖ వర్షమును బాపుటచే కల్గిన శ్రమ తీరునట్లు అభ్యంజనమాడి, మంగళాంగరాగములచే పూయబడిన దివ్యాంగములను కలవాడవై, 'సూర్యాంశుజనితం తాపమ్ నిన్యే తారావతిః స్వయమ్'' (సూర్య కిరణముల వలన కల్గిన తాపమును చంద్రుడు స్వయముగా పోగొట్టెను) అనునట్లు తీక్ష్ణకిరణుడగు సూర్యుని కిరణములచే కల్గిన తాపమును 'అమృతమును స్రవించు, నూతన కిరణములచే చంద్రుడు' (పెరియతిరు 8-5-1)తీర్చునట్లు, సర్వజనతాప త్రయమును తీర్చువాడవైయున్న సన్నివేశము, పద్మోల్లాసకరత్వ - అదోషకరత్వ - రథాంగ ప్రియత్వాదులచే చంద్రుని కంటె వైలక్షణ్యము ఉన్నను, ఒక్కొక్క విధమున చంద్రునితో సామ్యమును విన్నవింప వీలగునట్లున్నది. అదెట్లనగా - (అమృత ప్రభవమ్) - స్వామీ! చంద్రుడు సుధా విధియగుటచే దేవతలకు భోగ్యమైన అమృతమునకు జన్మభూమియై యున్నాడు. అంతియేకాక, అమృత శబ్దవాచ్యమగు సముద్రజలమును జన్మస్థానముగా కల్గిన వాడైయున్నాడు. (అమృతస్య ప్రభవః అమృతం ప్రభవః యస్య సః). నీవు 'అమృతస్యైష సేతుః' (ఇతడు అమృతమునకు వారధి - ముండక 2-2-5)

అని, 'మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్'' (జనార్దనుని వలన మోక్షమును కోరతగును) అనియు పల్కు విధమున అమృత శబ్దవాచ్య మగు మోక్షమునకు నిర్వాహకుడవై, 'తదపో2సృజత' (అపుడు జలములను సృష్టించెను - ఛాందో. 6-2-3) అని, 'అప ఏవ ససర్జాతౌ' (మొదట జలములనే సృష్టిచేసెను - మను. 1-8) అని, 'సంకల్పముతో కూడిన తాను తనయందు సాటిలేని, గొప్పదైన జలమును సృష్టించి' (తి.వా. - 1-5-4) అనియును నుడువునట్లు అమృతశబ్దవాచ్యమగు కారణజలమునకు ఉత్పాదకుడవై యున్నావు.

**ప్రభా ప్రభావ ప్రహతధ్వాంతలస ద్విలాసజాతమ్** - స్వామి! చంద్రుడు 'రుంధే సర్వదిశాం నిరంతర తమస్తంద్రాయితాం చంద్రమాః' (చంద్రుడు అన్ని దిక్కుల యొక్క నిరంతర తమస్సు వలన కల్గిన సోమరితమును అడ్డగించెను) అనునట్లు తన వెన్నెల ప్రభావముతో 'కంపమును వృద్ధిపొందించు చీకటి లోకమంతయు తన వశము చేసికొని అతిశయించి యున్నది' (తిరువిరు - 13) అనునట్లున్న అంధకారము యొక్క విజృంభణము నిరసింపచేయును. నీవును 'శోభయన్ దండకారణ్యం దీప్తేనస్వేన తేజసా' (ప్రకాశించు తన తేజస్సుతో దండకారణ్యమును ప్రకాశింపచేయుచు - రామా ఆర 38-15) అని, 'ప్రకాశించుచున్న, స్వాభావిక కల్యాణ గుణపూర్ణమైన, విలక్షణతేజోరూపమైన దివ్యరూపమును కలవాడు - తి.వా. 6-10-1) అని, 'తేషామేవానుకంపార్థమహ యజ్ఞనజం తమః, నాశయామ్యాత్మభావస్థోజ్ఞానదీపేనభావ్వతా' (ఆ భక్తులను అనుగ్రహించుటకై నేను వారి మనోవృత్తి యందున్నవాడనై, ప్రకాశించు మద్విషయ జ్ఞాన దీపముతో అజ్ఞానము వలన కల్గిన తమస్సును పోగొట్టుదును. భగ. 10-11) అని, 'కరుణయందు స్థిరముగా మనస్సును దాసులమగు మాయందు నిలిపి, మమ్ములను ఒక వస్తువుగా తలచి, కటాక్షించు కాలమున అజ్ఞాన తమస్సు తొలగగా, స్వరూపజ్ఞానమును పొందితిని - ఇరణ్డామ్ తిరు. 59) అనియును నుడువబడినట్లు దివ్యవిగ్రహ కాన్తిచే స్వరూప ప్రభఅగు సంకల్పముచే దూరముగా తఱుముగొట్టబడిన ఆశ్రితబాహ్యాబాహ్యాంధకారమును కలవాడవై, 'తఇమే శ్రీరంగశృంగారతే భావా యౌవన గంధినః' (శ్రీరంగములోని శృంగారరసస్వరూపుడవైన స్వామి! ఆ ఈ నీ భావములు యౌవన గంధముతో కూడుకొన్నవి - శ్రీరంగరాజస్తవే - 72) అనునట్లు వెలుగుచున్న యౌవనకృత దివ్యవిలాసమును కలవాడవైయున్నావు.

**సకలమ్** - చంద్రుడు స్వాంశరూపమగు షోడశకళలతో కూడియుండును నీవును స్వరూపవిశేషనిరూపకత్వముచే 'కలా' శబ్దవాచ్యయగు లక్ష్మీదేవితో, దివ్యాయుధములతో, 'వేదైశ్చసర్వైరహమేవవేద్యః వేదాంతకృద్వేదవిదేన చాహమ్' (అన్ని వేదములచే నేనే తెలియదగినవాడను, వేదములందు తెలుపబడిన ఫలములనిచ్చువాడను నేనే, వేదవిదుడను నేనే - భగ. 15-15) అనునట్లు కలా శబ్దవాచ్యములగు వేదములతో కూడియుందువు.

**సకలానుమోదహేతుమ్** - చంద్రుడు 'త్రి జగతా మానందనాడింధమః' (ముల్లోకముల ఆనందమునకు కారకుడు) అనురీతిలో అందఱి ఆనందమునకు హేతువైయుండును. నీవును 'సర్వసత్త్వమనోహరః' (సమస్త జీవుల మనస్సులను హరించువాడు. రామ-సుందర. 35-8) అనునట్లు సర్వజనుల సమ్మోదమునకు కారణభూతమై, 'బ్రాహ్మణప్రియః' (బ్రహ్మవిదులను ప్రియులుగా కలవాడు - విష్ణు సహస్ర. - 675) అనురీతిలో విశేషించి లీలా శబ్దవాచ్యమైన అధ్యాత్మ శాస్త్రమున నిష్ఠను కలవారికి 'ఆనందం యాతి' (ఆనందింపచేయుచున్నాడు - తైత్తి - ఆనంద. ) అను విధమున ఆనందహేతు భూతుడవైయున్నావు.

**శశినం త్వాం కలయామి రంగరాజ** - 'ఇదమ్ రంగ చంద్ర' (రంగచంద్రా! ఈ జగత్తు - శ్రీరంగరాజస్తవే ఉత్తరశతకమ్ - 9) అనునట్లు జ్ఞానులచే (పరాశరభట్టర్ మొదలగు వారిచే) అనుభవింపబడిన నీ చంద్రసామ్యమును ఇపుడు దాసులమగు మా యొక్క ఆనంద సాగరము అభివృద్ధమగునట్లు, సేవించునట్టి భక్తుల లోచనచకోరములు చరితార్థములగునట్లును శ్రీరంగమను పేరుగల విష్ణుపదమున ప్రకాశింపచేయుచునున్న సన్నివేశమువలె ప్రస్తుత నీ సన్నివేశము తోచుచున్నది.

**అవతారిక:-** శ్రీపరాశరభట్టరు వేరొక అభిషేక సందర్భమునందు ఒక శ్లోకమును అనుగ్రహించి, అందు చంద్రునితో శ్రీరంగనాథునకు కల సామ్యము లను తెలుపుచు, ఆ చంద్రునిలో లేని వైలక్షణ్యములను శ్రీరంగనాథుని

యందుండుటను వ్యతిరేక సరళిలో ప్రతిపాదించుచున్నారు. ఆ శ్లోకమునకు ఉత్కృష్ట వేదాంతార్థ ప్రతిపాదకమగు వ్యాఖ్యను కూడ అనుగ్రహించిరి.

**శ్లో॥ అనిశం కుముదం వికాసయంతమ్**
**సతతం పూర్ణమహర్నిశం చ దృశ్యమ్।**
**అనుపప్లవమద్య రంగరాజమ్**
**మనుతే చంద్రమసం జనోను మాన్యమ్॥** 2

**ప్రతిపదార్థము:-** అనిశం=ఎల్లప్పుడు, కుముదం=భూదేవియొక్క ఆనందమును, వికాసయంతమ్=వృద్ధిచేయువాడు, (కుముదమనగా కలువ చంద్రుడు రాత్రి కాలమున మాత్రమే కలువలకు ఆనందమును కల్గించును), సతతం పూర్ణం= ఎల్లప్పుడు కల్యాణగుణపూర్ణుడు, (చంద్రుడు పున్నమినాడు మాత్రమే పూర్ణుడు), అహర్నిశం దృశ్యం=రాత్రింబగళ్లు దర్శింపతగినవాడు (చంద్రుడు రాత్రిలో మాత్రమే కనుపించును), అనుపప్లవంచ=దుఃఖము (గ్రహణము) లేనివాడు (చంద్రుడు రాహుగ్రహణరూపమైన ఉపప్లవమును కలవాడు) అగు, రంగరాజం= శ్రీరంగనాథుని, జనః=జనుడు (లోకములోని జనము), మాన్యం= మాన్యుడైన, చంద్రమసం=చంద్రునిగా, మనుతేను=తలచుచున్నారు కదా!

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'జ్ఞానజ్యోతి' అనునట్లు అఖిలహేయ ప్రత్యనీకుడవై, కల్యాణైక తానుడవై (కల్యాణగుణాశ్రయుడవై), నీ కంటె వేరయిన సమస్త వస్తువులకంటే వైలక్షణ్యమును కలవాడవై, 'అన్ని కాలములందు అన్ని వస్తువులందు ఒకటిని కూడ విడువక పరిపూర్ణముగా వ్యాపించి, నిలకడగా నుండు వాడు, విశదమైన జ్ఞాన ప్రభను కలవాడు' - (తి.వా. 3-2-7) అను స్వరూపమును కలవాడవై యుండు నీవు 'అచిదవిశేషితాన్ ప్రళయసీమని సంసరతః కరణకళేబరైః ఘటయితుం దయమానమనాః' (అచిత్తుతో సమానముగానున్న ప్రళయ సీమయందు సంచరించుచున్న జీవకోటిని కరణ కళేబరములతో కూడునట్లు చేయుటకొఱకు జాలిగొన్న మనస్సుకలవాడవై - శ్రీరంగరాజస్తవే - ఉత్తరశతకమ్ - 41) అనురీతిలో దయమానమనస్కుడవై, అనాదియైన కర్మ ప్రవాహముచే (దేవ-మనుష్య-మృగాది-స్థావరములను) చతుర్విధ శరీరములలో ప్రవేశించి, చతుర్దశభువలములందు తిరుగాడు చేతనుడు త్రివిధ శరీరములను త్యజించి, మనుష్య శరీరమును (మనోవాక్కాయములను) కరణత్రయముతో (భూతభవిష్యత్‌వర్తమానములను) (కాలత్రయమునందు, ప్రాప్తము, ఆగామి, సంచితములను) కర్మత్రయములో అన్వయింపచేసి, (శుద్ధసత్త్వము, మిశ్రసత్త్వము, సత్త్వశూన్యములను) అచిత్ త్రయమునకు విదూరుడైన తాను (సత్త్వ-రజ-స్తమస్సులను) గుణత్రయముచే బద్ధుడై, క్షోభను పొందినవాడై, (భూమి - కాంత - సంపదలలో ఆశ అను) ఆశాత్రయమునందు చిక్కుకొని, అజ్ఞుడై, (చిత్తు - అచిత్తు - ఈశ్వరుడుఅను) తత్త్వత్రయమును తెలియలేక, (ఆధ్యాత్మికము - ఆధిభౌతికము - ఆధిదైవికములను) తాపత్రయముచే తపింపబడినవాడై యుండగా, అతనిని "న బ్రహ్మా న శివః నేంద్రః సోఽక్షరః పరమస్స్వరాట్" (అతడు బ్రహ్మకు అంతర్యామి అతడు శివునకు అంతర్యామి అతడు ఇంద్రునకు అంతర్యామి, అతడు అక్షర శబ్దవాచ్యుడగు ముక్తాత్మకును అతడే అంతర్యామి బ్రహ్మాదుల కంటె ఉత్కృష్టుడు, కర్మకు వశము కానివాడు - తైత్తి - నారాయణ - 11) అనురీతిలో (బ్రహ్మశివుడు - ఇంద్రుడను) దేవతాంతర త్రయమునకు శేషియై (స్వామియై) (శ్రీదేవీ - భూదేవి - నీళాదేవులను) మహిషీత్రయమునకు వల్లభుడవై, (నిత్యముక్త బద్ధులను) ఆత్మ త్రయమునకు కారణభూతుడవై, సదా ఆనందభరితుడవై, దోషగంధరహితుడవై, (ఉపాదాన - సహకారి - నిమిత్తకారణములను) త్రివిధ కారణవస్తువై, లక్ష్మీయుక్తుడవైన నీవు 'నా యమాత్మా ప్రవచనే న లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమే వైష వృణుతే తేనలభ్యః తస్యై స ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్' (ఈ పరమాత్మ భక్తిరహితమైన) శ్రవణముచే కాని, మననముచే కాని, ధ్యానముచే కాని, పొందవీలయినవాడు కాడు. ఎవనిని ఈ పరమ పురుషుడు వరించునో అతని చేతనే పొందదగినవాడు, అతనికి ఈ పరమాత్మ తన దివ్యమంగళ రూపమును అనుగ్రహించును - కఠ. 1-2-23) అను విధమున విశేష కటాక్షముతో (స్వరూప విరోధి - ఉపాయ విరోధి - ప్రాప్య విరోధులను) విరోధి త్రయము నుండి విడిపింపగోరి (యాదృచ్ఛికము - ఆనుషంగికము - ప్రాసంగికములను) సుకృతత్రయమును కల్గిన వానినిగా చేసి, (అనన్యార్హ

శేషత్వము - అనన్యశరణత్వము - అనన్యభోగత్వములను) త్రివిధ ఆకారములను కల్గినది, ఆచార్యునిచే ఉపదేశరూపమున పొందతగినది అగు (మూల మంత్రము - వాసుదేవ మంత్రము - విష్ణుమంత్రములను) మంత్ర త్రయముచే దోషమును పోగొట్టి, (ప్రణవము - నమస్సు - నారాయణ పదములను) పద త్రయము యొక్క భావమును గ్రహించునట్లు చేసి, (అజ్ఞానము - అన్యథా జ్ఞానము - విపరీత జ్ఞానములను) అజ్ఞానత్రయమును నివర్తింపచేసి, ఆకారత్రయముతో అన్వయిముపొందునట్లు చేసి, (పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులను) పరత్రయముతో సంస్కరింపచేసి, లోకత్రయమును ఉపేక్షించి, (త్రిపాద్విభుతి అనబడు) పాదత్రయమునకు కొనిపోయి, (అష్టాక్షరి - ద్వయము - చరమశ్లోకములను) సన్మంత్రత్రయముచే మోక్షరూపభోగమును అనుభవింపచేయవలెనని తలచి, 'తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే' (అట్లయినను నీవు పురుషాకారమును కలవాడవై భక్తుల కొఱకు ప్రకాశించు చున్నావు. జితంతే. 4), 'అర్చాత్మనావతీర్ణో2సి భక్తానుగ్రహకామ్యయా' (భక్తులను అనుగ్రహింపవలెనను కోరికతో అర్చారూపమున అవతరించిన వాడవైతివి) అనురీతిలో దాసుల కొఱకు అర్చారూపివై, 'ఆధిరాజ్య మధికం భువనానా మీశతేపి శునయనే కిల మౌళిః'' (దేవాధిరాజా! లోకములకు నీవు ప్రభువువై యుండుటను మిక్కిలి సూచించునట్టిది కదా నీ కిరీటము - వరదరాజస్తవే - 25) అని నుడివినట్లు సకల భువనముల ఆధిరాజ్య సూచకమై, 'తుమ్మెదలు లోన ప్రవేశించి మధువును గ్రోలు తులసీమాలను కల కిరీటము తి.వా. 1-7-11), దానియందు అణగియుండి కనుపించునవి,' నల్లని రంగును కల్గినవై, సుగంధపూర్ణములై, కుటిలములైయున్న కుంతలములును,' (తిరునెడున్దాణ్డకమ్ - 21), 'రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' (గొప్ప రూపముచే, సద్గుణముచే, జీవుల దృష్టిని, చిత్తమును కొల్లగొట్టువాడు - రామా - అయో - 3-28) అనునట్లు 'పిచ్చెక్కించి, తెలివిని పోగొట్టు మాయమంత్రము' (గోదా సూక్తము. 2-4) అగు ముఖమండలము, 'ఒక గొప్ప భూ మండలమును, ఏడు విస్తరించిన పర్వతములను పూర్తిగా గ్రసించిన కంఠమును', 'కల్పక వనము వంటి గొప్ప పలు భుజములను' (తి.వా. 6-7-6), 'భవ్యయగు నీళాదేవి స్తనమును గాఢముగా ఆలింగనము చేసికొను, గొప్ప పర్వతము వంటి వక్షః స్థలమును (కలివైరి సూక్తము. 8-7-1), 'నితంబమును, సన్నని నడుమును' (తి.వా. 5-5-8), నడుమును ఎఱ్ఱగా చేసిన పీతాంబరమును, (కలివైరి సూక్తము. 2-10-9), 'తేనెను స్రవించు శ్రీపాదములను' (తి.వా. 1-5-5) కల్గినవాడవై, వేంచేసియున్న నీవు చందన కుంకుమ పంకముచే పూయబడిన సర్వాంగములను కలవాడవై, వేంచేసియున్న సన్నివేశము చంద్రునితో వ్యతిరేక ప్రక్రియలో పోల్చతగినట్లున్నది - అదెట్లనగా,

**అనిశమ్ కుముదమ్ వికాసయంతమ్**- స్వామి! చంద్రుడు రాత్రిలో మాత్రమే కుముద శబ్దవాచ్యమైన కలువను వికసింపచేయును. 'భూదేవికి వరతంత్రుడు' (తిరునెడున్దాణ్డకమ్ -18) గా నుండు నీవు 'గుణాత్ రూప గుణాశ్చాతి ప్రీతిర్భూయో2భ్యవర్ధత, వైదైహ్యాః ప్రియమాకాంక్షన్ స్వయం చిత్తంవిలోభయన్' ఆత్మగుణము వలన, రూప గుణము వలనను మిక్కిలి ప్రీతి అభివృద్ధి చెందెను. సీత యొక్క ప్రియమును కాంక్షించువాడై, స్వయముగా ఆమె మనస్సును ఆకర్షంచువాడై - రామా. బాల. 77-33) అని, 'మిక్కిలి పెద్దవైన బాహువులతో ఆశ తీర తడవునట్టివాడై, ఇట్లు భూదేవి పట్ల వ్యామోహమును చూపు సర్వేశ్వరుడు' (తి.వా. 2-8-7) అనియు పల్కిన విధమున 'కు' శబ్దవాచ్యమగు భూదేవికి 'ముత్' శబ్దవాచ్యమగు సంతోషమును ఎల్లప్పుడు నీవు వృద్ధిచేయువాడవై యుందువు.

**సతతమ్ పూర్ణమ్** - స్వామీ! చంద్రుడు మాసమున ఒకనాడు మాత్రమే పూర్ణుడై మిగిలిన దినములలో అపూర్ణుడైయుండును. నీవు 'ఇదమ్ పూర్ణ మదః పూర్ణమ్ పూర్ణాత్ పూర్ణముద్రిచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే' (బృహ. 7-1) అనురీతిలో సతతము పూర్ణుడవైయుందువు.

**అహర్నిశం చ దృశ్యమ్**- స్వామీ! చంద్రుడు రాత్రి సమయములలో మాత్రమే కనుపించును. నీవు 'వరదస్సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే' (ఈనాడును వరదుడు అందఱు ప్రాణులకు గోచరమగుచున్నాడు) అనునట్లు అభీష్ట వరదుడవై, అందఱికిని ఎల్లప్పుడు కనుపించుచున్నావు.

**అనుపప్లవమ్** - స్వామి! చంద్రుడు రాహు గ్రస్తుడగుటచే ప్రమాదముతో

కూడినవాడైయున్నాడు. కాని, నీవు 'రాహోశిరశ్చ చిచ్ఛేద దేవానాం ప్రభురవ్యయః ' (దేవతలకు ప్రభువు, నాశములేనివాడను అగు భగవానుడు రాహు శిరస్సును ఛేదించెను) అనునట్లు రాహువు శిరస్సును తెగగొట్టిన వాడవగుటచే ఉపప్లవము లేని వాడవు.

**అద్యరంగరాజమ్ మనుతే చంద్రమసం జనోను మాన్యమ్** - అన్ని కాలములందు కుముదోల్లాసకరుడవై, అన్ని సమయములందు పూర్ణుడవై, అన్ని సమయములందు కనుపించువాడవై, ఏ కాలమునందైనను గ్రహింపబడని వాడవగుటచే "చంద్రేదృష్టిసమాగమః" (చంద్రునియందు చూపుల కలయిక - రామా. యుద్ధ. 5-6) అని మేము పల్కునట్లు "మీరును నా దివ్య మంగళ రూపము నందు ప్రసరించిన మీ చూపును త్రిప్పుకొననీయని నన్ను దర్శింపుడు. నేను కూడ 'పుష్ణామి చౌషధీః సర్వాసోమో భూత్వారసాత్మకః" (రసాత్మకుడగు సోముడనై నేను అన్ని ఓషధులను వృద్ధి చేయుదును.భగ.15-13 అని పల్కినట్లు రసాత్మకుడైన చంద్రునిరూపమును గొన్నవాడనై ఓషధులకు ఆప్యాయనమును కల్గించునట్లు మీకును ఈ అర్చారూపమైన శరీరముతో ఆప్యాయనము కల్గింతును" - అని బయలుదేరి వచ్చి, నిలచిన సన్నివేశమువలె ఉన్నది.

**అవతారిక:**-భట్టరు ఒకానొక అభిషేక సమయమున శ్రీరంగనాథుని సూర్యునితో ఉపమించుచు ఒక శ్లోకమును రచించి, దానికి వేదాంతార్థ భరితమైన వ్యాఖ్యను వెలయించిరి.స్వామీ! నీవు అభిషేకము కొఱకు వేంచేసియున్న సన్నివేశమును దర్శింపగా సూర్యునితో పోల్చతగినట్లున్నది. అదెట్లనగా -

**శ్లో॥ కుంకుమారుణ ముదంచితశ్రియమ్**
**కోమలారుణ సరోజసంస్థితమ్।**
**రంగ మందిర! తమోనివారణం**
**శంకతే తపన దీధితిం జనః॥** 3

**ప్రతిపదార్థము:- (శ్రీరంగనాథుని పక్షమున)** రంగమందిర=శ్రీరంగమున మందిరమును కలవాడా!, కుంకుమారుణమ్= (అలదిన) కుంకుమచే ఎఱ్ఱనివాడవు, ఉదంచితశ్రియమ్=శ్లాఘ్యమైన లక్ష్మిని కలవాడవు, కోమల అరుణ సరోజ సంస్థితమ్=కోమలమైన, ఎఱ్ఱని (పాద) పద్మములోనున్నవాడవు, తమోనివారణమ్=తమస్సు అనబడు అజ్ఞానమును పోగొట్టువాడవు అగు నిన్ను, జనః=జనుడు,

**సూర్యుని పక్షమున:**- కుంకుమారుణమ్=కుంకుమ వర్ణుడగు అరుణుని కలవాడు, ఉదంచితశ్రియమ్=(ప్రభాకరుడగుటచే) గొప్పశోభను కలవాడు, కోమల+అరుణ సరోజ సంస్థితమ్=అందమైన అరుణారవిందమున నున్నవాడు, తమోనివారణమ్=చీకటిని తొలగించు వాడును అగు, తపనదీధీతిం=సూర్యునిగా శంకతే=ఉత్ప్రేక్షించుచున్నాడు.

**'శ్రీసేవా' వ్యాఖ్యా:-**

**కుంకుమారుణమ్** - స్వామీ! సూర్యుని చూడగా అతడు కుంకుమవర్ణుడగు అరుణుని కల్గినవాడైయున్నాడు. నిన్ను దర్శింపగా అందిన కుంకుమచే ఏర్పడిన ఎఱ్ఱనిరంగును కల్గియున్నావు.

**ఉదంచితశ్రియమ్** - స్వామీ! సూర్యుడు ప్రభాకరుడగుటచే మిక్కిలి శోభను కల్గియున్నాడు. నీవును సంశ్లేషశ్లాఘ్యులగు దేవేరులను కల్గిన వాడవైయునానవు.

**కోమలారుణ సరోజనసంస్థితమ్**- స్వామీ! సూర్యుని గమనింపగా-అందమైన అరుణార మిదముననున్నవాడైయుండును. నిన్ను సేవింపగా కోమలారుణ పద్మాసనమున నుందువు.

**తమోనివారణమ్** - స్వామీ! ఆదిత్యుడు లోకములోని అంధకారమును నిరసించువాడై యుండును. నీవును సకలాత్మల యొక్క తమశ్శబ్దవాచ్యమైన అజ్ఞానమును నివర్తింపచేయువాడవైయున్నావు.

**రంగమందిర! శంకతే తపనదీధితిం జనః** - ఇట్లు 'ఆదిత్యానామహం విష్ణుః' (ఆదిత్యులలో నేను విష్ణువును - భగీ. 10-21) అనునట్లు నీవు ఆదిత్యుడవు అగు ప్రకారమును ఆదిత్యసామ్యముచే దానులమగు మాకు ఈ అభిషేక సమయమున ప్రదర్శించుచున్న సన్నివేశమువలె తోచుచున్నది.

**అవతారిక:**- వసంతకాలములో అభిషేకమును స్వీకరించు శ్రీరంగనాథుని

వర్ణింప తలపెట్టిన భట్టరు స్వామిని వసంతర్తువుగానే వర్ణించుచు ఆ ఋతువు నకు స్వామికిని మధ్యకల సామ్యమును శ్లేషభంగిమలో ప్రతిపాదించుచున్నారు.

**శ్లో॥ భవంతం శ్రీమంతం హసిత కలికాలంకృతమిహా**
**ప్యశోకం కుర్వతం భ్రమరహిత మత్యుత్సవకరమ్।**
**సుఖస్పర్శశ్లిష్యత్ పవనజమహానందభరితం**
**వసంతం రంగేశం ప్రకటసుమనస్కం మనుమహే॥ 4**

**ప్రతిపదార్థము:- శ్రీరంగనాథుని పక్షమున:-**

రంగేశ=శ్రీరంగనాథా!, శ్రీమంతమ్=లక్ష్మినికలవాడవు, ఇహ=ఇచట (ఈలోకమున), హసితకలికాలం=పరిహసించిన కలిని కల కాలమును, అశోకం కృతమ్అపి కుర్వంతం=శోకరహితమగు, కృతయుగముగా, చేయువాడవు, భ్రమరహిత మత్యుత్సవకరమ్=భ్రమలేని బుద్ధిని కల దివ్యసూరులకు గొప్ప సంతోషమును కల్గించువాడవు, సుఖ స్పర్శశ్లిష్యత్=అనుకూల స్పర్శను కలవాడవై ఆలింగనము చేయబడిన, పవనజ మహానంద భరితమ్=హనుమంతుని వలన కల్గిన ఆనందముచే నిండిన వాడవు, ప్రకటసుమనస్కమ్=ప్రసిద్ధమైన, శోభనమైన మనస్సును కలవాడవు అగు, భవంతమ్=నిన్ను.

**వసంతఋతువు పక్షమున:-**

శ్రీమంతమ్=శోభను (అందమును) కల్గినది, హసిత కలికాలంకృతమ్= వికసించిన పూలగుత్తులతో అలంకరింపబడినదిగా(కావుననే), భ్రమరహితం= తుమ్మెదలకు హితమైనదిగా, అశోకంకుర్వంతమ్=అశోక వృక్షమును చేయునది, అతి+ఉత్సవకరమ్=గొప్ప ఉత్సవములను (యజ్ఞయాగాది రూపములైన ఉత్సవములను) కలుగచేయునది, సుఖస్పర్శ=చల్లని స్పర్శనుకల్గినదై, శ్లిష్యత్= తాకునట్టి, పవనజ=మందమారుతముచే పుట్టిన, మహానందభరితమ్=గొప్ప సంతోషముతో నిండినది, ప్రకటసుమనస్కమ్=(అన్ని కాలములలో) ప్రధాన మైనదై, మంటిపూలను కల్గినదైన (లేక, వికసించిన చక్కని పూలను కల్గినదైన), వసంతమ్=వసంత ఋతువునుగా, మనుమహే=తలంతుము.

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ఇది అంతయు బ్రహ్మయేకదా - ఛాందో. 3-14-1) అని, 'నేహ నానాస్తి కించన' (ఇచట నానావిధములైనది ఏమియు లేదు. బృహ.6-4-19) అని, 'ఐతదాత్మ్యమిదం సర్వమ్' (ఈ జగత్తు అంతయు ఆవర బ్రహ్మను ఆత్మగా కల్గినది - ఛాందో. 6-8-7) అని, 'యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరమ్' (ఏ పరబ్రహ్మకు ఆత్మ శరీరమో, పృథివి శరీరమో, బృహ. 5-7-22) అని, 'తాని సర్వాణి తద్వపుః' (అవి అన్నియు ఆ పరబ్రహ్మకు శరీరము-వి.పు. 1-22-66) అని, 'ఎవరైనను ఉన్నదంతయు సర్వేశ్వరుడే',( ), 'దేహమందు జీవుడు మఱుగుననున్నట్లు, అంతర్హితుడై అన్నిట వ్యాపించి యున్నాడు' (తి.వా. 1-1-7) అనియును పల్కువిధమున సర్వశరీరియై, సర్వాంతర్యామియై వేంచేసియుండునీకు, 'మాకు శరీరభూతులైన సర్వప్రాణులు ఆదిత్యుని అతి తీవ్రములైన కిరణములచే మిక్కిలి సంతప్తులైయున్నారు. 'మాతా పిబతి కషాయం, స్తనంధయో భవతినీరోగః' (తల్లి కషాయమును తాగుచున్నది. బిడ్డ రోగముతొలగినదగుచున్నది) అనురీతిలో వీరి తాపముపోవునట్లు శిశిరోపచారములను అంగీకరింతుము గాక!' అని తలచి ఇపుడు అభిషేకమును అంగీకరించి, చందన, కుంకుమ పంకాలంకృత సర్వాంగుడవై వేంచేసియున్న సన్నివేశము 'మధుశ్చ మాధవశ్చ వాసంతికాపుత్రౌ' (మధువును మాధవుడును వాసంతికా పుత్రులు అనగా మధు వనబడు చైత్ర మాసము, మాధవమనబడు వైశాఖ మాసమును కలసి వసంతర్తువు) అనురీతిలో నీవు వారిలో (మధు-మాధవులలో) చిన్నవాడవగుటచే వసంత కాలముతో శ్లేష ప్రక్రియలో సామ్యమును విన్నవింపతగినట్లున్నది. అది ఎట్లనగా -

**భవంతం శ్రీమంతమ్** - స్వామి! వసంతకాలము 'చైత్రః శ్రీమానయం మాసః' (ఈ చైత్రమాసము శోభను కల్గినది - రామా. అయో. 3-4) అనునట్లు మిగిలిన కాలములకంటె మిక్కిలి శోభను కల్గినదై యుండును. నీవును 'శ్రియః శ్రియమ్' (లక్ష్మికి లక్ష్మియైనవాడు - స్తోత్రరత్నే. 45) అని, 'శ్రీదేవికిని సంపదయైన సంపత్స్వరూపా' దేవతలకు అధిపతీ! (కలివైరిసూక్తము. 7-7-1) అనియును పలుకురీతిలో అందఱి కంటె అధికుడనుటకు సూచించు శ్రియః పతిత్వమును కల్గియున్నావు.

## శ్రీసేవావ్యాఖ్యా

**హసిత కలికాలం కృతమిహాపి అశోకం కుర్వంతమ్ భ్రమర హితమ్**-స్వామి! వసంతర్తువు అశోకమను వృక్షమును తుమ్మెజదల కొఱకు పూల గుత్తులచే అలంకృతమగునట్లుచేయును. నీవును 'కలౌ కృతయుగం తస్య' (అతనికి కలియుగము నందు కృత యుగము) అని, 'కలిదోషము లేమియు కలుగ కుండునట్లు తన దాసులకు దయచూపు' (తి.వా. 5-2-11) అనియును నుడువునట్లు (హసిత కలికాలం కృత యుగం కుర్వంతమ్) అధిక్షేపింపబడిన కలికాలమును కలవారై, 'నిత్యం ప్రముదితా స్సర్వే యథా కృతయుగే తథా' (కృతయుగములో వలె నిత్యము ఆనందించినవారై) అనునట్లు కృతయుగములో వలెనే దుఃఖరహితులైయుండునట్లు చేయుచున్నావు.

**అత్యుత్సవకరమ్** - స్వామి! వసంతకాలము 'వసంతే వసంతే జ్యోతిష్టా యజేత' (ప్రతి వసంతర్తువులో జ్యోతిష్టోమ యాగము చేయనగును ఆపస్తంబ శ్రేతసూత్రే) అనునట్లు జ్యోతిష్టోమాదులను గొప్ప ఉత్సవములను కల్గింతును. నీవును (భ్రమరహిత మత్యుత్సవకరమ్) (భ్రమనేనివారగు దివ్యసూరుల మనస్సులకు గొప్పసంతోషమును కల్గించువాడవు) - 'కళంకములేని, గొప్ప తపస్సును కల సనకాదిమునులు, ముక్తులు' (తి.వా. 8-3-10), 'గొప్ప మునుల ఆనందము ఉన్మస్తముకాగా' (తి.వా. 10-7-5) అనురీతిలో భ్రమరహితులైన పరాంకుశ పరకాలాది మునుల మనస్సులకు గొప్ప సంతోషమును కల్గింతువు.

**సుఖస్పర్శశ్లిష్యత్ పవనజ మహానంద భరితమ్** - స్వామి! వసంతకాలము 'అంగైరనంగతప్తైరవిరళమాలింగితుంపవనః శక్యమరవిందసురభిః' (మన్మథునిచే తపింపబడిన అంగములతో గాఢముగా కౌగలించుట కొఱకు తామరపూల సుగంధమును కల పవనము) అనునట్లు సుఖస్పర్శను కల్గినదై, అన్నిటిని స్పృశించి వచ్చునట్టి మందమారుతముచే జనించిన ఆనందమును కల్గినదై యుండును. నీవును శ్రీరామావతారమున సీతాదేవిని చూచితిని అని వచ్చిన హనుమానుని -'ఏషసర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః, మయాకాలమిమం ప్రాప్యదతస్తస్యమహాత్మనః' (సర్వస్వదానమువంటి ఈ ఆలింగనము మహాత్ముడగు హనుమంతునకు నాచే ఇపుడు తగిన కాలమున ఇవ్వబడినది. (రామా - యుద్ధ. 1-14) అని, 'వాయుదేవుని పెద్దకుమారుడగు హనుమానుడు వేరుజాతిలో పుట్టినవాడని, అందునను ఏమియు జ్ఞానములేని మృగమని, అందునను మర్కటమనియును తలచి విడువక, అతని పట్ల మిక్కిలి ప్రీతిని కల్గి, ప్రేమయు, ఆదరమును సముద్రముకంటె అధికముగా వృద్ధిచెందగా, నాకు ఇతడు చేసిన ఉపకారములకు ప్రతిక్రియ' (కలివారి సూక్తము. 5-8-2) అనియు పలికిన విధమున సముద్రమును దాటిన హనుమానునిచే కూడ దాటలేనట్లు అనుకూలస్పర్శను కలవాడై, ఆలింగనముచేసికొనబడిన వాడగు హనుమంతునిచే కల్గిన, అలంఘనీయమైన గొప్ప ఆనందముతో నిండినవాడవై యున్నావు.

**ప్రకట సుమనస్కమ్** - స్వామి! వసంతకాలము 'పుణ్యాః పుష్పితకాననః'' (పవిత్రమైనది, పుష్పించిన వనములను కల్గినది - రామా. అయో. 3-4) అనునట్లు మిగిలిన కాలమునకన్నిటికిని ప్రధానమై, ప్రకటమై (ప్రకాశకమై), పూలను ముడుచుకొన్నదైయుండును.

నీవును 'సనోదేవఃశుభయాస్మృత్యాసంయునక్తు' (ఆ దేవుడు మనలను మంగళకరమైన స్మృతితో (జ్ఞానముతో) కూడి యుండునట్లు చేయునుగాక - తై.త్తి.నా. 10-19) అని, 'శ్రేయోధ్యాయీత కశ్చన' (ఒకానొకడు(పరమాత్మ) శ్రేయస్సును ధ్యానింపనగును) అనియు చెప్పబడినట్లు అతి ప్రసిద్ధమై, అతి శోభకరమైయున్న మనస్సును కల్గినవాడవై యున్నావు.

**రంగేశ భవంతం వసంతం మనుమహే** - కావున శ్రీరంగనాథా! నీ ఈ సన్నివేశము అర్జునునకు సారథివై, రథము ముంగిట వేంచేసి యుండి 'ఋతూనాం కుసుమాకరః') ఋతువులలో వసంతర్తువును భ.గీ. 10-35) అని అర్జునునకు ఉపదేశించిన రహస్యార్థమును ఇపుడు దాసులమగు మాకు వెలువరించుచు వేంచేసియున్న స్థితివలె నున్నది.

**అవతారిక** :- జ్ఞానము, భక్తి రెండును నిండియున్న ఆచార్యులను రెండు రెక్కలను కల పక్షులుగా వర్ణించుట కవి సమయము కావున వైష్ణవసంప్రదాయమున పక్షులకు ఉన్నతమైన స్థానమీయబడినది. అందు కూడ పవిత్రతకు చిహ్నమైన హంస పక్షి యొక్క గొప్పతనము వర్ణింపవీలుకానిది. ఒకానొక అభిషేకసమయమున భట్టరు శ్రీరంగనాథుని హంసగా వర్ణించిరి.

## శ్రీసేవావ్యాఖ్యా

శ్లో॥ సత్పక్షపాతాత్ భువమాశ్రయత్వాత్
సన్మానసావాస నిబంధనత్వాత్।
పద్మాశ్రయత్వాచ్చ భవానిదానీం
హంసో యథా రాజతి రంగరాజ॥ 5

**ప్రతిపదార్థము:- శ్రీరంగనాథుని పక్షమున:-**

రంగరాజ=శ్రీరంగనాథా!, సత్పక్షపాతాత్=సత్పురుషుల పట్ల పక్షపాతము వలన, భువన+ఆశ్రయత్వాత్=సమస్త జగత్తును ఆశ్రయమగుట వలన, సన్మానస+ఆశ్రయత్వాత్=సత్పురుషుల మనస్సులలో స్థిర నివాసమును కల్గియుండుట వలన, పద్మా+ఆశ్రయత్వాత్=పద్మా అనబడు లక్ష్మికి ఆశ్రయమగుట వలన, భవాన్=నీవు, ఇదానీం=ఇపుడు

**హంస పక్షమున:-**

సత్పక్షపాతాత్=చక్కని ఱెక్కల చలనములను కల్గియుండుట వలన, భువన +ఆశ్రయాత్వాత్=స్వచ్ఛమైన నీటిని ఆశ్రయముగా కల్గియుండుటవలన, సన్మానస+ఆవాస నిబంధనత్వాత్=మనోహరమైన మానస సరస్సులో నివాసమును కల్గియుండుట వలన, పద్మ+ఆశ్రయత్వాత్=పద్మములను ఆశ్రయముగా కల్గియుండుట వలన (పద్మముల పరిసరములో వర్తించుటవలన) యథాహంసః=రాజహంస వలె, రాజతి=ప్రకాశించుచున్నావు.

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'హంసశ్శుచిషత్' అని, 'ఆనాడు, అచట హంసరూపియై అరుదైన వేదములను అనుగ్రహించినవాడు శ్రీరంగమున నిత్యనివాసముచేయు స్వామి' (కలివైరిసూక్తము. 5-7-3) అనియు పలుకు రీతిలో సకలసాత్త్వికుల లోచనానంద పారావార హేతువైన రూప సౌందర్యమును కల నీవు ఒక హంసగా విన్నపము చేయతగినవాడవై యున్నావు. అదెట్లనగా,

**సత్పక్షపాతాత్** - స్వామి! హంస 'రెక్కలను కల హంసలు' (కలివైరి సూరి సూక్తము. 1-1-2) అనునట్లు చక్కని పక్షపాతమును కల్గినదైయుండును. నీవును 'మమ ప్రాణాహి పాండవాః' (పాండవులు నా ప్రాణములు కదా. భార. ఉద్యో. 90-33) అనురీతిలో సత్పురుషుల పట్ల పక్షపాతమును కల్గినవాడవై యున్నావు.

**భువనాశ్రయత్వాత్** - స్వామి! హంస అతిహృద్యమై, నిర్మలమైన జీవన(నీటి) సమీపమున వర్తించు నదియై యుండును. నీవును 'వసంతి సర్వభూతాని' (అన్ని ప్రాణులు ఇతనియందు నివసింతును) అనురీతిలో అఖిలచేతనా చేతనములకును ఆశ్రయమైయున్నవాడవు.

**సన్మానసాహస నిబంధనత్వాత్** - స్వామి! హంస మనోహరమైన మానస సరస్సులో వర్తించుచుండును. నీవును 'మా మనస్సులలో ప్రవేశించి, నిలచి యున్నాడు' (        )అనురీతిలో సత్పురుషుల మనస్సులలో నిలచియుందువు.

**పద్మాశ్రయత్వాత్** - స్వామి! హంస పంకేరుహ పరిసరవర్తియై యుండును. నీవును 'లక్ష్మీదేవి నివసించు వక్షఃస్థలమును కల నా స్వామి!' (తి.వా. 7-2-9) అని, 'నిశితమైన, పెద్దకన్నులను కల్గిన లక్ష్మీదేవి పర్వతము వంటి వక్షఃస్థలమున నివసించుచున్నాది' (కలివైరి సూక్తము. 8-1-5) అనియు పల్కునట్లు పూలలో పరిమళమైన లక్ష్మీదేవి వక్షఃస్థలమునందు నిత్యవాసముచేయునట్లున్నావు.

**భవానిదానీం హంసో యథా రాజతి రంగరాజ** - కావున ఇట్లు నీవున్న సన్నివేశము అత్యాశ్చర్యావహమై, అతిమనోహరమై, సద్గతియై, సల్లాపచతురమై, నార మధ్యవర్తియై యుండుట ఒక హంస 'భయపడకుడు'అని అభయప్రదానము చేయుచు నిలచియున్న స్థితివలె నున్నది.

**అవతారిక :-** వేరొక అభిషేక సందర్భమున భట్టరు శ్రీరంగనాథుని పక్షిజాతికి చెందిన తుమ్మెదతో పోల్చుచు వర్ణించిన ఒక శ్లోకమును అనుగ్రహించిరి.

శ్లో॥ అంతః స్థితస్సుమనసా మమరేశరత్న
చ్ఛాయావికల్పితరుచిః నయనాభిరామమ్।
ఆపాదితస్మరగుణః ప్రథితప్రచారః
శాఖాను రంగనృపతిః మధుపోవిభాతి॥ 6

**ప్రతిపదార్థము:- శ్రీరంగనాథుని పక్షమున:-**

సుమనసామ్ అంతఃస్థితః=మంచి మనస్సును కలవారి మనస్సులలో నున్నవాడు, అమర+ఈశరత్నచ్ఛాయా వికల్పితరుచిః=ఇంద్రనీల రత్నము యొక్క కాంతితో పోల్చతగిన (రుచిని) కాంతిని కలవాడు, నయానాభిరామః =కన్నులకు అకర్షణీయమైన రూపమును కలవాడు, ఆపాదితస్మరగుణః =మన్మథుని గుణములను ఆపాదించినవాడు, శాఖాను=వేదశాఖలలో, ప్రథితప్రచారః=ప్రసిద్ధములైన సంచారములను కలవాడును అగు, రంగనృపతిః =రంగనాథుడు,

**తుమ్మెద పక్షమున:-**

సుమనసామ్ అంతఃస్థితః=పూలలోపల ఉన్నది, అమరేశరత్నచ్ఛాయావికల్పిత రుచిః=ఇంద్రనీలమణి వర్ణముతో పోల్చతగిన కాంతిని కల్గినది, నయనాభిరామః =చూడముచ్చటైనది, ఆపాదితస్మరగుణః=కల్గింపబడిన మన్మథుని అల్లెత్రాడును కల్గినది (మన్మథుని అల్లె త్రాడుగా అయినది), శాఖాను=కొమ్మలలో, ప్రథిత ప్రచారః=ప్రసిద్ధమైన సంచారములను కల్గినది అగు, మధువః(ఇవ)=తుమ్మెద వలె, విభాతి=ప్రకాశించుచున్నాడు.

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామీ! 'చక్షుర్దేవానాముత మర్త్యానామ్' (నిత్యసూరులకు, మానవులకును నేత్రభూతుడు, అనగా, జ్ఞానప్రదుడు - యజు. 4-6-8) అని, 'కణ్ణావానెన్టామ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు' భూలోకవాసులకు, పరమపదవాసులకును ఎల్లప్పుడు నిర్వాహకుడు - తి.వా. 1-8-3) అనియును పలుకురీతిలో దర్శనహేతువగు దృష్టిభూతుడవై, 'నిస్సమాభ్యధికమైన ఆనందమును కలవాడు' (తి.వా. 1-1-1) అని ఆనంద గుణవిశిష్టుడై, ఆ ఆనందగుణాతిశయమునకు మించి 'అజ్ఞాన అన్యథాజ్ఞాన - విపరీత జ్ఞానరహితమైన, భక్తి రూపాపన్నమైన జ్ఞానమును అనుగ్రహించినవాడు '(తి.వా. 1-1-1) అని భక్త రూపజ్ఞాన ప్రదానముచే నిర్హేతుకమైన ఉపకారమొనర్చినవాడవై, దానితోపాటు 'మఱపులేని నిత్య సూరులకు అధిపతి' (తి.వా. 1-1-1) అని సకల నిత్యసూరులచే సంసేవ్య మానుడవగు నీవు సర్వప్రకారములచే విముఖులైన సంసారిచేతనులను అనుగ్రహించుట కొఱకు పాదులకనుదాల్చి, బయలుదేరి 'రూపౌదార్యగుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్' (గొప్పరూపముతో, గుణములతో జీవుల దృష్టిని, చిత్తమును అపహరించు వానిని - రామా. అయో. 3-28) అనునట్లు దృష్టిచిత్తాపహారియగు దివ్యమంగళ విగ్రహ వైలక్షణ్యమును ప్రదర్శించి, సమస్త చేతనుల మనస్సులను బాహ్య విషయములందు ప్రసరింపక, నీ పట్లనే ప్రసరించునట్లు చేయగోరినవాడవై, 'మద్భక్తపాదతోయేన మత్స్నాపితజలేనవా, నరాః పాపాత్ ప్రముచ్యంతే స్నానపానాదికర్మభిః' (నా భక్తుని పాదము వలన గాని, నా అభిషేక జలముచే గాని, నరులు స్నానము, పానము మొదలగు కర్మలను చేయుట ద్వారా పాపమునుండి విముక్తులగుదురు) అని నీవు అభిషేకమాడిన జలమును, 'ఓ శ్రీరంగనాథా! అనిపించు భక్తుల పాదరజమును (కులశేఖరసూక్తము. 2- ) శిరస్సున దాల్చుటచేత దాసులమగు మేము నిరస్త సమస్త పాపులమై ఉజ్జీవించునట్లు నీవు అభిషేకమును అంగీకరించి, చందన కుంకుమ పంకాలంకృతుడవైయున్న ఈ స్థితి ఒక తుమ్మెదగా విజ్ఞాపింపవీలగు నట్లున్నది. అది ఎట్లనగా -

**అన్తః స్థితస్సుమనసామ్** - స్వామీ! తుమ్మెద పూలగుత్తుల లోపల ప్రవేశించి, అందు నిలచి యుండును. నీవును - 'వైదికుల మనస్సులను నివాస స్థానముగా కల వానిని' (తిరునెదున్దాణ్డకమ్ - 14) అనురీతిలో అనన్య ప్రయోజనుల అంతః కరణములందు నిత్యము నిలిచియుందువు.

**అమరేశరత్నచ్ఛాయా వికల్పితరుచాః** - తుమ్మెద ఇంద్రనీల మణి యొక్క నీల వర్ణమును కల్గినది అన్నట్లు నీలవర్ణమును కల్గినదైయుండును. నీవు 'శ్యామస వర్ణమును కల సర్వాధికుడు' ( )అను విధమున శ్యామవర్ణమును కల్గినవాడవై యుందువు.

**నయనాభిరామమ్** - తుమ్మెద చూచువారి కన్నులకు ఆనందమును కల్గించును. నీవును 'నా కన్నులు నిన్ను చూడగోరును' (తి.వా. 3-8-4) అనుక్రమ వలన దర్శించువారి నేత్రములకు ఆశను వృద్ధిపొందించునట్టి రూప సౌందర్యమును కలవాడవైయుందువు.

**ఆపాదితస్మరగుణః** - తుమ్మెదలు మన్మథుని వంటికి దారమై యుండును.

నీవును 'మన్మథుని సృష్టించిన వృషభ సమానుడు' అనురీతిలో అసంగియగు (రూపరహితుడగు)మన్మథుడు అంగి యగునట్లు గుణాదానమును చేసి, అనుగ్రహించిన వాడవు.

**ప్రథిత ప్రచార శ్శాఖాసు -** తుమ్మెద మధులోలువమగుటచే పూచిన కొమ్మల యందు అంతలు సంచరించును. నీవును వేద శాఖలలో వివిధ సంచారములను చేతువు.

**రంగస్యపతిర్మధుపో విభాతి -** ఇట్లు ఈ విధముగా శ్రీరంగనాథుడవగు నీవు 'అందమైన, ఱెక్కలను కల గరుత్మంతుని వాహనముగా గల వరదేవత అనెడి భ్రమరము' (తి.వా. 9-9-4) అనుచు శఠకోపసూరి పల్కిన విధమున తుమ్మెద స్థితిని దాసులమగు మాకు దర్శింపచేయుచు నిలచిన స్థితివలె ఈ సన్నివేశమున్నది.

**అవతారిక:-** ఒకానొక శ్రావణమాసములోని శ్రవణానక్షత్ర సందర్భమున శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి అభిషేకమును అంగీకరించు సమయమునందు భట్టరు ఆ స్వామిని వర్ణించిన సొబగును ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

**శ్లో॥ సార్థం ద్విజైః శ్రావణకర్మ రంగిన్**
**కల్పోచితస్నానవిధిం కరోషి।**
**శ్రుతిస్మృతిభ్యాం వ్యపదిశ్యమానం**
**స్వయం మమాజ్ఞా మనువర్తయామి॥** 7

**ప్రతిపదార్థము:-** రంగిన్=శ్రీరంగనాథా, శ్రుతిస్మృతిభ్యాం=శ్రుతులచే, స్మృతులచే, వ్యపదిశ్యమానాం=తెలుపబడుచున్న, మమ=నా యొక్క, ఆజ్ఞామ్= ఆజ్ఞను, స్వయం=నేను స్వయముగా, అనువర్తయామి (ఇతి)=పాలించుచున్నాను (అని), ద్విజైఃసార్థం=ద్విజులతో పాటు, శ్రావణకర్మ=శ్రావణ పూర్ణిమనాటి వైదిక కర్మను, కల్ప+ఉచిత స్నానవిధిం=కల్పములలో తెలుపబడిన పద్ధతికి అనుగుణ మైన స్నానమును, కరోషి=చేయుచున్నావు.

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామీ! శ్రవణానక్షత్రము మిగిలిన అన్ని నక్షత్రములకంటె ప్రశస్తమై యుండును. దీనికి ప్రాశస్త్యము ఎట్లనగా 'శ్రోణో నక్షత్రం విష్ణుర్దేవతా' (శ్రవణా నక్షత్రము, అధి దేవత విష్ణువు) అనుటచే సమస్తాత్మలకు అధిపతియైన నీవే ఈ నక్షత్రమునకు అధిదేవత కావున ఇది అన్ని నక్షత్రముల కంటె ప్రశస్తమై యున్నది. 'సర్వేషు చావతారేషు శ్రవణర్షేరిపూన్ ప్రతి, జయార్థ ముద్యమం చక్రే భగవాన్ మధుసూదనః' (అవతారములన్నిటిలో మధుసూదనుడగు భగవానుడు శత్రువులను జయించుట కొఱకు శ్రవణా నక్షత్రమునం దుద్యమించెను) అని యుండుటచే అన్ని అవతారములలో అసుర నిరసనార్థముగా ఈ నక్షత్రమును చూచి బయలుదేరుటవలన, 'తస్మాత్ స్వాధ్యాయో2ధ్యేతవ్యః' (కావున వేదము అధ్యయనము చేయతగినది యజు. 2-15) అని తెలుపునట్టి నిత్య విభూతి యందు (భూలోకమునందు) అంతట 'శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధియుక్తః ఛందాంస్య ధీయీత' (శ్రావణ పూర్ణిమ యందు కాని, లేక భాద్రపద పూర్ణిమ యందు కాని ఉపాకర్మనుచేసి, యథావిధిగా వేదమును అధ్యయనము చేయనగును. మను. 4-95) అనుచు విధింపబడిన అధ్యయానారంభ కాలముగా శ్రావణయగు పౌర్ణమిని తెలుపుటచే, 'ఉపనీయతు యశ్శిష్యం వేద మధ్యాపయేద్ద్విజః, సంకల్పం సరహస్యంచ తమాచార్యం ప్రచక్షతే' ఏద్విజుడు శిష్యునకు ఉపనయనము చేసి, వేదమును కల్పముతో పాటు, రహస్యములతో పాటు నేర్పించునో అతనిని ఆచార్యుడని అందురు) అనునట్లు ఆచార్యుడు తన ఆచార్య కృత్యమును ప్రకటీకరించుటకై ప్రథమాచార్యుడవగు నీవు 'ఈ శ్రావణ కర్మను ప్రత్యక్షముగా మేమును అనుష్ఠింతుము గాక!' అని పల్కి వేంచేసి అనుగ్రహించితివి.

దీనికి కారణమేమనగా- 'శ్రుతి స్మృతిర్మమైవాజ్ఞా' (శ్రుతియు స్మృతియును నా ఆజ్ఞయే - విష్ణుధర్మే. 76-31) అనుచు నీవు ప్రతిజ్ఞ చేసితివి. శ్రుతిస్మృతుల అధ్యయన ఆరంభము ఈనాడే జరుగును. నీవును త్రైవర్ణికులతో కూడి కల్పోచితమైన అభిషేకమును అంగీకరించి, 'మా ఆజ్ఞఅగు శ్రుతిస్మృతు లందు చెప్పబడిన కర్మలను మేము కూడ అనుష్ఠింతుము' అని వేంచేసి యున్నట్లు ప్రస్తుత సన్నివేశము తోచుచున్నది.

## శ్రీసేవావ్యాఖ్యా

**అవతారిక :-** ఒకానొక శ్రీజయంతి(కృష్ణాష్టమి) ఉత్సవ దివమున అభిషేకింప బడు శ్రీరంగనాథుని భట్టరు వర్ణింప సమకట్టిన ఒక క్షణము స్వామిని మఱచి, అతడు కృష్ణునిగా అవతరించుటచే అంతులేని మహిమను పొందిన శ్రీజయంత్యుత్సవమునందు మిక్కిలి అభినివేశమును కలవారై, ఆ ఉత్సవమును వేదముతో సమానముగా పల్కుచు ఒక అందమైన ఈ క్రింది శ్లోకమును అనుగ్రహించిరి.

**శ్లో॥ సమున్నిషత్ పద్మజతార సంశ్రితా**
**తవావతార క్రమ పాఠతత్పరా।**
**త్రయీవ రంగేశ సమర్థ్యతే జనైః**
**అసౌ జయంతీత్యుదితేయ మష్టమీ॥** 8

**ప్రతిపదార్థము:- శ్రీరంగనాథుని పక్షమున:-**

రంగేశ=శ్రీరంగనాథా!, సమున్నిషత్ పద్మజతార సంశ్రితా=ఉదయించు ప్రజాపతి దేవతాకమగు రోహిణీ నక్షత్రములో కూడినది, తవ=నీ యొక్క, అవతార క్రమ పాఠతత్పరా=అవతారము యొక్క క్రమ పాఠములో (కాలమును తెలుపుటలో) తాత్పర్యమును కల్గినది అగు, అసౌ=ఈ, జయంతీ+ఇతిఉదితా= జయంతి అని ఉదయించిన, ఇయం=ఈ, అష్టమీ=అష్టమీతిథి,

**వేదము పక్షమున:-**

సమున్నిషత్ పద్మజతార సంశ్రితా=ప్రకాశించునట్టి, బ్రహ్మచే ఉచ్చరింప బడునట్టి ప్రణవముతో కూడినది, తవ=నీ యొక్క, అవతార క్రమ పాఠ తత్పరా =త్రివిక్రమాది అవతారముల క్రమమును అనుసంధించుటలో శ్రద్ధను కల్గినది అగు, త్రయీ ఇవ=వేదము వలె, జనైః=జనులచే, సమర్థ్యతే=సమర్థింపబడు చున్నది.

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామీ! జయంతి అను పేరును కల ఈ అష్టమిని 'త్రయీ' అని చెప్పునట్లున్నది. అదెట్లనగా

**సమున్మిషత్ పద్మజ తార సంశ్రితా -** రోహిణీ నక్షత్రము 'ప్రజపతిర్దేవతా' (అధిదేవత ప్రజాపతి) అనుటచే ప్రజాపతి బ్రహ్మను అధిదేవతగా కల్గినది. (ఇచట పద్మజ శబ్దము 'స్రష్టా ప్రజాపతిర్వేధాః' అని పర్యాయమైన ప్రజాపతికీ వాచకము) నీవు వసుదేవుని (నృసింహావతారాదులలో) స్తంభాదులనువలె నిమిత్తముగా గొని అవతరించితివి. ఇట్లు నీవు నియమించిన నిమిత్తం మాత్రుడైన వసుదేవుడును కశ్యపప్రజాపతి అంశభూతుడగుటచే ప్రజాపతిగా (ప్రభువుగా) నుండెను. ఇతనిని నిమిత్తముగా గొని జయంతి అనబడు ఈ అష్టమీ తిథిలో నీవు అవతరించుటచే ఇతనిని (వసుదేవుని) దీనికి అధిదేవత అని చెప్ప తగినట్లున్నది. కావున ఈ జయంతి అను అష్టమి పద్మజ తారతో అనగా ప్రజాపతిదేవతాకమగు రోహిణీ నక్షత్రముతో కూడియుండతగినదై యుండును. త్రయీ అనబడు వేదమును పద్మజునిచే - అనగా ఆదిబ్రహ్మచే ఉచ్చార్యమగు తారముతో అనగా ప్రణవముతో కూడినదై యుండును. ఈ అష్టమియును పద్మజ తారతో - అనగా రోహిణీ నక్షత్రముతో కూడి యుండ తగినదై యుండును.

**తవావతారక్రమపాఠ తత్పరా -** స్వామీ! వేదము నీ అవతార క్రమమును గూర్చి పల్కుటచే అందు తత్పరమై యుండును. ఎట్లనగా వేదము 'త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపాదాభ్యః"(విష్ణువు భూమిని మూడు పాదములతో విక్రమించెను (కొలిచెను)-విష్ణుసూక్తమ్) -'క్రము'-పదవిక్షేపే. కావున నీ త్రివిక్రమావతారమును అది తెలిపెను.

ఈ జయంతి - అష్టమియు 'యస్యాంజాతో జగన్నాథః కిరీటీ కౌస్తుభహరిః (ఏ అష్టమి యందు జగన్నాథుడు, కిరీటి, కౌస్తుభమును కలవాడును అగుహరి అవతరించెనో) అని తెలుపబడుటచే నీ అవతార కాలమును తెలుపుచున్నది.

త్రయీవ రంగేశ! సమర్థయే జనైరసౌ జయంతీత్యుదితేయ మష్టమీ) కావున నీకు అవతరించిన జయంత్యష్టమిని నీ అవతార ప్రభావముచే సర్వప్రాణులును 'త్రయీ' అని తలచి గుర్తించుచున్నారు.

## శ్రీసేవావ్యాఖ్యా

**అవతారిక:-** శ్రీరంగనాథుడు ఒక మహోత్సవ సమయమునందు అభిషేకమును స్వీకరించునపుడు, ఆ దేవుని సౌందర్యమునందు, అదే సమయమున అచట పారాయణము చేయబడుచున్న వేదము యొక్క మాధుర్యము (శ్రావ్యత) లోను మనస్సును పారవేసికొనిన భట్టరు ప్రమేయమగు శ్రీరంగనాథుని, ప్రమాణమగు వేదముతో పోల్చుచు, రెండింటి గొప్పతనమును వర్ణించి, ఆ రెండిటిపై తమకు గల అభినివేశమును ప్రకటించు ఒక అద్భుత శ్లోకమును రచించిరి.

**శ్లో॥ అమృతమయమనంతం సిద్ధసర్వార్థ జాతం**
**నియమిత సకలార్థం నిశ్చితాత్మావబోధమ్।**
**కిమిహ బహు నిరుక్తైః కీర్తనాభీష్టదం త్వామ్**
**నిగమమివ మనోజ్ఞం రంగరాజాద్యమన్యే॥** 9

**ప్రతిపదార్థము:- శ్రీరంగనాథుని పక్షమున:-**

రంగరాజ=శ్రీరంగనాథా!, అమృతమయం=అమృతస్వరూపుడవు(అమృతమువలె నిరతిశయ భోగ్యుడవు), అనంతం=త్రివిధపరిచ్ఛేదరహితుడవు, సిద్ధసర్వార్థ జాతమ్=(శేషివి అగుటచే)

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామీ! 'సర్వేవేదా యత్పద మామవంతి' (అన్ని వేదములు ఎవని పదమును గుర్చి పలుకుచున్నవో (తైత్తి-నారా. ) అని, 'సర్వేవేదా యత్రైకం భవంతి' (వేదములన్నియు ఎవనియందు ఏకమగు చున్నవో - తైత్తి-నారా. ) 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' (వేదములన్నిటిచేతను నేనే తెలియదగినవాడను - భగ. 15-15), 'రహస్యార్థములను కల్గిన నాల్గువేదములకు అర్థమైనవాడా! వికస్వర జ్యోతిస్స్వరూపా' (తి.వా. 3-1-10) అనియు పల్కురీతిలో సకల వేద వేద్యుడవై, 'న చక్షుషాపశ్యతి కశ్చ నైనమ్' (బాహ్యచక్షువుతో ఎవడును ఇతనిని చూడలేకున్నాడు - ముండక. ) అని, 'మనుష్య నేత్రములకు గోచరులుకాని బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు అను వీరికిని వారి నేత్రములతో వీక్షింప వీలుకాని కృష్ణుడు' (తి.వా. 7-7-11) అనియు పల్కురీతిలో నేత్రములకు గోచరుడవు కాని నీవు' వరద యదినభువ్యవాతరిష్యః'' (వరదరాజస్తవే - 67) అనునట్లు 'నేను అతీంద్రియుడనైయున్నటో నా ఆరాధనాపరములగు వైదిక ధర్మములు సంకుచితములగును, కావున 'నేనే నన్ను వ్యక్తపఱచు కొందును' అని తలచి దక్షిణదేశము, ఉత్తరదేశమును నమస్కరించునట్లు నిలచియున్న శ్రీరంగక్షేత్రము నందు అఖిల జన నయన విషయ తాంగతుడవై (గీతోభాష్యావతారిక), ఇపుడు నీ ఆరాధనారూపముగా అనన్య ప్రయోజనమైన యజ్ఞము యొక్క సౌగంధ్యము అంతట పరిమళించునట్లు వైదికాగ్నిని వృద్ధిచేయుచున్న 'ఆనృశంస్యప్రధానులైన' (కులశేఖర సూక్తము. 1-7) వారి పట్ల కారుణ్యము పొంగిపొర్లగా, వారిని అనుగ్రహింపవలయునని తలచి, ఉత్సవమును వ్యాచమును వేంచేసి, ఆపాంగ వీక్షణములతో అనన్య ప్రయోజనులైన ధర్మచారులను ధన్యులను చేసి, 'కర్తాకారయితా చ సః' (చేయువాడు, చేయించువాడును అతడు - జితంతా స్తోత్రమ్) అని, 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః' (శ్రేష్ఠుడైనవాడు వేనిని దేనిని ఆచరించునో దానినే ఇతరులైన జనులును ఆచరింతురు - భగ. 3-21) అనురీతిలో నీ అనుష్ఠాన ప్రకారముతో వైదిక ధర్మస్థాపనము చేయుట కొఱకు సక్రమముగా స్నానమాడి ' ' (కణ్ణనుణ్శిఱుత్తాంబు- ) పట్ల అంతఃస్థములైన అనుకంపానురాగములు బయటకు ప్రవహించిన రీతిలో అందమైన వక్షఃస్థలమున చందన కుంకుమ పంకములతో అలంకరించుకొని నిలచిన సన్నివేశము వేదముతో పోలికను విన్నవింపతగినట్లున్నది. అదెట్లనగా

**అమృతమయమ్** - స్వామీ! వేదము 'వాచా విరూప నిత్యయా' (విశేషమైన రూపము కల్గినది, నిత్యమైనది అగు వాక్కుచే) అని, 'నిలచియుండు నాల్గు వేదములు' (తి.వా. 10-1-2) అనియు చెప్పబడునట్లు నిత్యస్వరూపమై యుండును. నీవును 'సత ఆత్మా అంతర్యామ్యమృతః' (అతడునీకు ఆత్మ, అంతర్యామి, నాశనములేనివాడు - బృహ. 5-7-22) అని, 'కేడిల్' (నాశనము లేనివాడు (తి.వా. 3-10-11) అనియు పలుకురీతిలో నిరపాయ స్వరూపుడవై 'ఏతదేవామృతమ్ దృష్ట్వాతృప్యంతి' (ఈ అమృతమును చూచియే తృప్తి చెందుదురు), 'శ్రీరంగములోని నా భోగ్యమైన అమృతము' అనియు పలుకు విధమున అమృతమువలె నిరతిశయ భోగ్యభూతుడవైయుందువు.

**అనంతమ్** - వేదములు 'అనంతములైనవి వేదములు'(యజు - కాఠ- 1-1) అని, 'అధ్యయనముచేయు వేదములన్నియు' (తి.వా. 3-1-6) అనియును నుడువునట్లు అపరిచ్ఛేద్యములై యుండును. నీవును 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' (పరబ్రహ్మ సత్యస్వరూపుడు, జ్ఞాన స్వరూపుడు, అనంతుడు - తైత్తి - ఆనంద -1) అని, 'అచ్యుతుని అనంతుని' (తి.వా. 3-4-9) అనియు వచించునట్లు త్రివిధపరిచ్ఛేద రహితుడవై యుందువు.

**సిద్ధసర్వార్థజాతమ్** - వేదము 'చాతుర్వర్ణ్యం త్రయో లోకాః'' అనునట్లు తనచే ప్రతిపాదింపబడిన వర్ణాశ్రమాది సమస్తార్థమును కల్గినదైయుండును. నీవును 'పతిం విశ్వస్య' (విశ్వమునకు పతి - తైత్రి. నారా. 11) ఇత్యాదిగా శేషివగుటచే సిద్ధించిన సర్వార్థములను కలవారై యోగ సిద్ధులై నిత్యసిద్ధులైయున్న వారికి సర్వపురుషార్థరూపుడవై, సకల ఫలప్రదుడవై 'పొందిన అన్ని కోరికలను కలవానికి ఏమి పని యున్నది' అని, 'సత్యకామః' (సత్యములైన అనగా సిద్ధించిన కోరికలను కలవాడు. ఛాందో. 8-1-5) అని, 'వాసుదేవో2సి పూర్ణః' (వాసుదేవుడ వగు నీవు పూర్ణుడవైయున్నావు) అనియు చెప్పునట్లు ఆవాప్త సమస్త కాముడవై యుందువు.

**నియమిత సకలార్థమ్** - వేదము 'దీనిని చేయుము, దీనిని చేయకుము' అని నియమింపబడియున్న విధి నిషేధాత్మకములగు సకల కార్యవాక్యార్థము లను కల్గినదైయుండును. నీవును 'అంతఃప్రతిష్ఠః శాస్తా జనానాం సర్వాత్మా' (జనుల యొక్క లోపల ప్రవేశించిన వాడు, శాసించువాడు, అందఱికి ఆత్మ -యజు. 3-24) అనునట్లు సంకల్పముతో నియమింపబడియున్న చిదచిదాత్మక సకలపదార్థములను కల్గినవాడవైయున్నావు.

**నిశ్చితాత్మావబోధమ్** - వేదము 'పంచవింశో2యం పురుషః పంచ వింశ ఆత్మా భవతి' (ఈ జీవుడు ఇరువదియైదవతత్త్వము, ఆత్మ ఇరువదియైదవ తత్త్వము) అని చతుర్వింశతి తత్త్వాత్మకమైన దేహముకంటె భిన్నమై, 'యస్యాస్మి పత్యాః నతమంతరేమి' (ఏ స్వామికి నేను దాసుడనో ఆ స్వామిని తప్ప వేరొకరిని భజింపను - శ్రీరంగరాజస్తవే - ఉత్తర శతమ్ - 81) అని పరతంత్రముగా 'యస్యాత్మా శరీరమ్' (ఎవనికి జీవాత్మ శరీరమో - బృహ. 3-7-3) అని, నీకు శరీరముగా నిశ్చయింపబడిన జీవాత్మజ్ఞానమును, 'పతిం విశ్వస్య' (విశ్వమునకు పతి - తైత్తి. నారా. 11) ఇత్యాదిగా శేషిత్వాది రూపమున నిశ్చయింపబడిన స్వరూప జ్ఞానమును కల్గినదైయుండును. నీవు శ్రీగీతాముఖ గ్రంథ నిశ్చితాత్మన బోధరూపమై, 'త్వమేవత్వాం వేత్థ యో2సి సో2సి' అనునట్లు నీచే నిశ్చయింప బడిన నీ యొక్క స్వరూపజ్ఞానమును కల్గినవాడవై యున్నావు.

**కిమిహ బహు నిరుక్తైః** - పలుపల్కులు ఏల?

**కీర్తనాభీష్టదమ్** - వేదము బయట చూడవలసిన అక్కఱలేనట్లు తనను కీర్తించిన మాత్రముననే అపేక్షిత పురుషార్థప్రదమైయుండును. నీవును - 'సర్వాధికుడైన వాని నామమును కీర్తింపుడు, అట్లు కీర్తించిన తాము కోరిన కోరికలను వెంటనే సిద్ధింపచేయును' (ఇరణ్డామ్ తిరువన్దాది. 92) అని, 'కులము నిచ్చును' (కలివైరిసూరి సూక్తము. 1-1-9) ఇత్యాదిగా సాధనాంతరనిరపేక్షముగా నామ సంకీర్తన మాత్రమున త్రివర్ణాపవర్గరూప సర్వాపేక్షితములను ఇత్తువు.

**మనోజ్ఞమ్** - వేదము పూర్వోత్తర భాగములతో నీ ఆరాధన రూపధర్మమును, ఆరాధ్యుడవగు నీ యొక్క స్వరూప రూపగుణ విభూతులను తెలుపుచుండుటచే 'ప్రకాశించు వేదము' అనునట్లు భవ్యమైనదై యుండును. నీవును 'అనుసంధాతల మనస్సులలో అంతట నిలచియుండి అనుసంధించువాని నెల్లను కూడనే యుండి తెలిసికొనుచున్నావు'' (భక్తాంఘ్రిరేణుసూక్తము. 34) అనురీతిలో తలపునకు ముఖ్యకేంద్రమగు మనస్సులో నివాసముండి, సర్వాభిప్రాయములను సాక్షాత్కరించుకుందువు.

**త్వాం నిగమమివ రంగరాజ అధ్యమన్యే** - కావున ఈ ప్రకారములతో 'శ్రీరంగములోని అమలుడు' అని, 'దాచియుంచిన మహానిధి' (తి.వా. 6-7-11) అని, 'చతుర్మూర్తి' (నాల్గురూపములను కలవాడు - విష్ణుసహస్రనామే - 771) అని, 'జన్మలేని వాడు' (తి.వా. 2-9-5) అనియు చెప్పబడు నా వలె, 'దోషము లేని నాల్గు వేదములు( )అని హేయప్రత్యనీకయై, ''బ్రాహ్మణానాం ధనం

వేదః'' (బ్రాహ్మణులకు వేదముధనము) అని, 'ఋచస్సామాని యజూంషి సాహి శ్రీరమృతాం నతామ్' - (ఋక్కులు, యజుస్సులు, సామములును అనునవి సత్పురుషుల యొక్క నాశములేని సంపద - యజు. బ్రహ్మ. 3-7), 'బ్రహ్మణుల సంపద' (తిరునెడున్దాణ్డకమ్ - 4) అనియును పలుకురీతిలో జ్ఞానులకు నిధియై, 'నాల్గువేదములను అనుగ్రహించినవాడు (తిరునెడున్దాణ్డకమ్ - 1) అని నాల్గువిధములై, 'ప్రాచీనమైన వేదము ( )అని జన్మరహితమైన (అపౌరుషేయమైన) వేదమును 'అనాదియైన నాల్గువేదములును, యాగములను' అని ప్రారంభించి 'బ్రహ్మాండమును తానై నిలచిన స్వామి శ్రీరంగమున అమరియున్నావాడు' (కలివైరి సూక్తము. 5-7-1) అని పలుకతగినట్లున్న నన్ను దర్శించినట్లే దర్శింపుడు' అని నీకును, వేదమునకును గల సామ్యమును ప్రకటించుచు నిలచిన సన్నివేశమువలె యున్నది.

**అవతారిక:-** ఈ క్రింది శ్లోకమున భట్టరు శ్రీరంగనాథుని ఒక పర్వతముతో పోల్చి వర్ణించుచున్నారు.

**శ్లో॥ శ్యామాభం మకుటోపేతం కటకాంచిత మున్నతమ్।**
**సత్త్వాశ్రయం రంగరాజమ్ మహీధరమవైమ్యహమ్॥ 10**

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'విష్ణుః పర్వతానామధిపతిః' విష్ణువు పర్వతములకు అధిపతి అని, 'మేరుః శిఖరిణామహమ్' (పర్వతములలో నేను మేరువును - భగ. 10-23) అనియు పల్కునట్లు నీవు వేంచేసియున్న తీరు ఒక పర్వతమని విన్నవించు నట్లున్నది. అది ఎట్లనగా -

**శ్యామాభమ్** - స్వామి! పర్వతము శ్యామ వర్ణమును కల్గినదై నీవును 'పచ్చని గొప్ప కొండవంటి మేని' (భక్తాంఘ్రిరేణు సూరి సూక్తము. 1) అనునట్లు మరకత పర్వతము మూర్తీభవించినట్లుందవు.

**మకుటోపేతమ్** - పర్వతము ఉన్నతమైన శిఖరముతో కూడియుండును. నీవును శేషిత్వసూచకమైన, ప్రకాశించు మణికిరీటముతో కూడియుందువు.

**కటకాంచితమ్** - పర్వతము చఱియలతో(సానువులతో) కూడి యుండును. నీవును ఆశ్రిత విరోధులను విహస్తులనుగా (హస్తములులేని వారినిగా) చేయగల్గు కటకమను హస్తాభరణముతో కూడియుందువు.

**ఉన్నతమ్**-పర్వతము ఏసమయమునందైనను కొలువ వీలుకానట్లుండుటచే విష్ణుపదాశ్రయమై, ఉన్నతమైయుండును. నీవును 'ఉన్నతుడు పరిమితి నిమించిన వాడు' ( ) అని పదాక్రమణముతో కొలువ వీలుకానట్లుందువు.

**సత్త్వాశ్రయమ్** - పర్వతము సింహాది సత్త్వములకు ఆశ్రయమైయుండును. నీవును 'సత్త్వం విష్ణుప్రకాశకమ్' (సత్త్వము విష్ణు ప్రకాశకము) అని, 'సత్త్వ సమాశ్రయః కః' (సత్త్వగుణమునకు ఆధారము ఎవడు? - స్తోత్రరత్నే. 12) అనియు పల్కునట్లు సత్త్వగుణ ప్రకాశకుడవైయుందువు.

**రంగరాజమ్ మహీధరమవైమ్యహమ్** - కావున ఇట్లు అత్యాశ్చర్యకరమై, అతిమనోహరమై, అఖిల జననయన కుతూహలప్రదమై, అంభోరుహవాసినియగు లక్ష్మీదేవి విలాసార్థము నిలచియున్న పర్వతమువలె నీ సన్నివేశమున్నది.

**అవతారిక:-**

**శ్లో॥ సత్త్వోన్నతస్సకల సత్త్వనివాసభూమిః**
**సౌవర్ణరమ్య విభవస్సుమనోమనోజ్ఞః।**
**సద్వృత్తసంఘ సమధిష్ఠత పార్శ్వదేశః**
**శైలాత్మనా స్ఫురసి రంగమహీశ్వర! త్వమ్॥ 11**

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! నీవు అభిషేక మాడుటకు వేంచేసి నిలచిన సన్నివేశము ఇట్లు ఒక పర్వతస్థితితో పోల్చతగినట్లున్నది. ఎట్లనగా -

**సత్త్వోన్నతః** - పర్వతమును చూడగా బలము యొక్క ఔన్నత్యమును కల్గినదై యుండును. నీవును 'శుద్ధసత్త్వాధికో విష్ణుః' (విష్ణువు శుద్ధసత్త్వగుణముచే అధికుడు) అనునట్లు సత్త్వోత్తరుడవైయుందువు.

## శ్రీసేవావ్యాఖ్యా

**సకలసత్త్వనివాస భూమిః**:- స్వామి! పర్వతము నర-మృగ-పశు-పక్షి స్థావరాది సత్త్వములకు నివాసభూమియై యుండును. నీవును 'భూతావాసో వాసుదేవః' (వాసుదేవుడు అన్ని ప్రాణులకు ఆవాసము - విష్ణుసహస్రనామస్తోత్రే - 713) అనునట్లు సకల చేతనాచేతనములకు ఆశ్రయస్థలమై యుందువు.

**సౌవర్ణరమ్యవిభవః** - స్వామి! పర్వతము అందమైన బంగారము లభించు ఆకరములను (గనులను) కల్గినదై యుండును. నీవును 'బ్రాహ్మణో2స్య ముఖ మాసీత్ బాహూరాజన్యకృతః, ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత' (ఇతని యొక్క ముఖము బ్రాహ్మణుడయ్యెను, బాహువులు రెండును క్షత్రియులుగా చేయబడెను. ఇతని తొడలు రెండును వైశ్యులు, పాదములతో శూద్రుడు జనించెను - పురుషసూక్తే) అనురీతిలో క్షత్రియాదులైన గొప్పవర్ణములకు జన్మభూమియై యుండును.

**సుమనో మనోజ్ఞః** - స్వామి! పర్వతము నానా విధములైన పుష్పములతో అందముగా నుండును. నీవును శద్ధాంతఃకరణులకు మనోహరుడవు. అంతియే కాక, పుష్పములతో అలంకరింపబడి మనోహరుడవైయుందువు.

**సద్వృత్తసంఘనమధిష్ఠిత పార్శ్వదేశః** - స్వామి! పర్వతము సద్వృత్తులగు (చక్కని ప్రవర్తనను కల) తపస్వి జనులచే అధిష్ఠింపబడిన పార్శ్వప్రదేశములను కల్గినదైయుండును. నీవును సద్వృత్తులగు సాత్త్విక జనులచే సేవింపబడు అందమైన పార్శ్వదేశమును అనగా సభను కల్గియున్నావు.

**శైలాత్మనా స్ఫురసి రంగమహీశ్వర త్వామ్** - కావున ఇట్లు అందమైన శ్రీరంగనాథుడను అభినవశైలము ఆశ్రితులను ఉజ్జీవింపచేయుట కొఱకు సంకల్పించుకొని నిలచిన సన్నివేశమువలె ఈ స్థితి తోచుచున్నది.

**అవతారిక**:- భట్టరు వేరొక అభిషేక సందర్భములో శ్రీరంగనాథుని మేరు పర్వతముతో సమానముగా ఉల్లేకించుచు ఒక శ్లోకమున అనుగ్రహించిరి.

**శ్లో॥ అశేషాశాపూర్తిం విదధతమనేకైః స్వవిభవైః**
**ప్రసిద్ధ్యత్ కల్యాణం ప్రకటతర పీతాంబరరుచిమ్।**
**కృత స్వార్థోత్సేకాన్ నిఖిల సుమనః ప్రీతిజనకమ్**
**భవంతం మన్యే2హం సురశిఖరిణం రంగనృపతే॥ 12**

**'శ్రీ సేవా' వ్యాఖ్యా**:-

స్వామి! నీవు - 'ఏకోహవై నారాయణ ఆసేత్ న బ్రహ్మా నేశానః నే మే ద్యావా పృథివీ' (నారాయణు డొక్కడే యుండెను కదా, బ్రహ్మలేడు, ఈశానుడు లేడు, దివియు, భువియు ఈ రెండును లేవు - మహోపనిషత్. 1-1) అనియు, 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్' (చంద్రుని వలె మనోహరుడా! ఈ సత్త్వమే ప్రారంభమున నుండెను. ఒక్కటియే, రెండవదిలేదు. ఛాందో. 6-2-1)అనియు, 'అసద్వా ఇదమగ్ర ఆసీత్'(ఈ అసత్తు మాత్రమే ప్రారంభమున నుండెను - తైత్తి. ఆనంద. 7) 'తత్తేదమ్ తర్హ్యవ్యాకృత మాసీత్' అనియు, 'హంతాహమిమా స్తిస్రోదేవతా అనేన జీవేనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' (ఆహా) నేను ఈ ముగ్గురు దేవతలను ఈ జీవునితో అనుప్రవేశించి, నామ రూపములను వ్యాకరింతును ఛాందో. 6-3-2)అని, 'బ్రహ్మాదిషు ప్రలీనేషు నష్టే స్థావరజంగమే, ఏకస్తిష్ఠతి విశ్వాత్మా సతు నారాయణః ప్రభుః' బ్రహ్మాదులు పూర్తిగా లీనముకాగా, స్థావర జంగమములు నశింపగా, విశ్వాత్ముడైన ఒక్కడే నిలచియున్నాడు. అతడు ప్రభువగు నారాయణుడే - భార. శాంతి. 210-24) అనియు, 'ఏతౌ ద్వౌవిబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌ స్మృతౌ, తదా దర్శిత పంథానౌ సృష్టిసంహారకారకౌ' (ఈ ఇద్దఱు దేవతలు అనగా బ్రహ్మరుద్రులు (భగవానుని) ప్రసాదగుణము వలన, క్రోధము వలన జనించిన వారుగా చెప్పబడుచున్నారు. వారు భగవానునిచే చూపింపబడిన మార్గమును (కర్తవ్యమును) కలవారై సృష్టిని, సంహారమును చేయువారు - భారతే. మోక్ష. 169-19) అని, 'దేవతలును, వారికి నివాస స్థానములగు లోకములు, మనుష్యాదిప్రాణులు మరియు మిగినవి అన్నియు ఏమియులేని ఆ ప్రళయకాలములో బ్రహ్మను, దేవతలను, లోకములను, ప్రాణులను సృష్టించినవాడు - తి.వా. 4-10-1), 'ఎఱ్ఱని తామరల వంటి కన్నులను కలవాడై ఏడులోకములను గ్రహింసినవాడును మండే భూమిని, స్వర్గములను అందు నివసించు మనుష్యులను, దేవతలను, మిగిలిన జంతువులను, స్థావరములను, పంచభూతములను, మిగిలిన అన్నిటిని సృష్టించినవాడు

తి.వా. 3-6-1) అను విధమున నిమిత్త - ఉపాదాన - సహకారులను మూడు కారణములను తానేయై, అధిష్ఠానాంతరమును ఆపేక్షింపకుండుటచే నిమిత్తము, సూక్ష్మచిద చిద్విశిష్టమగుటచే ఉపాదానము, కాలాదులైన సమస్త వస్తువులకును అంతర్యామియైయుండి ప్రేరకుడగుటచే సహకారి కారణమును అయి, 'ఐతదాత్మ్యమిదం సర్వమ్' (ఈ జగత్తు అంతయు ఈ భగవానుని ఆత్మగా కల్గినది - ఛాందో. 6-8-7) అని, 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానీతి శాంత ఉపాసీత (ఇది అంతయు బ్రహ్మాత్మకమే కదా - ఆ బ్రహ్మనుండి పుట్టి, అందే లయమగుచున్నదని శాంతుడవై, ఉపాసింపనగును. - ఛాందో. 3-14-1) అని, 'సర్వగత్వాదనం తస్య సవివాహమవస్థితః మత్తస్సర్వమహం సర్వం మయి సర్వం సనాతనే' (అనంతుడు సర్వగతుడగుటచే అతడే నేనైయున్నాను, నా వలననే సర్వము జనించినది, నేనే సర్వమైయున్నాను. సనాతనుడనగు నాయందు సర్వము ఉన్నది. - విష్ణు. పు. 1-19-85) అని, 'నిలచి యున్నదంతయు సర్వేశ్వరుడు' (  ) అని, "అనాదియగు నాల్గువేదములు, యాగములు, విని తెలియతగిన వ్యాకరణము, ఆయా పదములచే తెలియబడు జీవసమష్టియు, పిండరూపమైయుండి పిమ్మట విస్తృతిని పొందినవగు, మిక్కిలి కాంతిని కల అగ్ని, ద్రవరూపమగుజలము, పృథివి, మేఘము, వాయువు, శబ్దించు సప్త సాగరములు, ఏడు కులపర్వతములు, ఆకాశము అను వీనితో కూడి బ్రహ్మాండము తానేయై నిలచిన స్వామి శ్రీరంగ మహానగరములో అమరియున్న వాడు. కలివైరి సూరి సూక్తము. 5-7-1) అనియు పల్కునట్లు స్థూలచిదచిద్విశిష్ట మైన కార్యము తానేయై, 'అచిదవిశేషితాన్ ప్రళయసీమని సంసరతః కరణకలేబరై ర్ఘటయితుం దయమానమనాః' (అచిత్తుకంటె వేరుగా లేకనున్నవారు, ప్రళయ సీమలోని సంసారి జీవులను కరణకలేబరములతో కలుపుటకు దయగొన్న మనస్సు కలవాడై - శ్రీరంగరాజస్తవే - ఉత్తర శతకమ్. 41) అనురీతిలో అ చిత్కల్పములగు ఆత్మలను దయతో కరణ కళేబరములతో కూడ సృష్టింతువు.

ఇట్లు సృష్టింపబడిన జగత్తులో 'పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' (సాధు పరిత్రాణము కొఱకు, దుర్మార్గుల వినాశనము కొఱకును, ధర్మసంస్థాపనము కొఱకు ప్రతియుగము నందు అవతరింతును - భగ. 4-8), 'దేవతలు కోరి ప్రార్థింపగా వచ్చి జన్మించినదియు' (తి.వా. 6-5-4) అని, 'విస్తృతమైన సముద్రముచే చుట్టబడియున్న లంకకు అధిపతియగు రావణుని బాహువులను, తలలను ఖండించినవాడు' (తి.వా. 1-6-7) అనియు పల్కువిధమున ఆశ్రితులకు ఇష్టప్రాప్తిని, అనిష్టనివృత్తిని కల్గించుటకు అవతీర్ణుడవగు నీకు పర్వతాదులును శరీరమని శ్రుతి, స్మృతులలో ప్రతిపాదింపబడినది.

'విష్ణుః పర్వతానామధిపతిః' (విష్ణువు పర్వతములకు అధిపతి) అని, 'మేరు రూపాచ్చ విష్ణోః' (విష్ణువు యొక్క మేరురూపము వలనను) అని, 'ఎఱ్ఱని గొప్ప మేఘము (వంటి పీతాంబరమును) దాల్చి, మిక్కిలి ఎఱ్ఱని తేజస్సుకల సూర్యుని ముడుచుకొని, అందమైన కాంతినికల చంద్రుని ధరించి, అనేకములైన (నక్షత్రాది) తేజస్సులను దాల్చి, పగడము వంటి ఎఱ్ఱని (అధర) ప్రదేశములను కల్గి విలసిల్లుచున్న, పచ్చని వర్ణము కలదైన మరకతమణిమయ పర్వతము' (తిరువాశిరియమ్. 1)అని, 'శ్రియఃపతిరూపముతో మేరుపర్వతము సమానముగా నున్నది' (తిరువిరుత్తము. 88) అనియు నుడువునట్లు త్రైలోక్యాధారమైన మహామేరువు నీవే అగుటచే అభిషేకము కొఱకు వేంచేసియున్న నిన్ను మహామేరువు అని విన్నవింప వీలగునట్లున్నది. అది ఎట్లనగా -

**అశేషాశా పూర్తిం విదధతమనేకైః స్వవిభవైః** - స్వామి! నీవు మత్స్యాది ప్రాదుర్భావరూపవిభవములతో, 'ఆయురారోగ్యమర్థంచ భోగాంశ్చైవానుషంగికాన్, దదాతిధ్యాయినాం నిత్యమపవర్గప్రదోహరిః' (అపవర్గప్రదుడగు హరి తనను ధ్యానించువారికి, ఆయుస్సును, ఆరోగ్యమును, సంపదను, భోగములను కూడ అనుషంగికములుగా ఇచ్చును.) 'సకలఫల ప్రదో హి విష్ణుః' (సకల ఫలములను ఇచ్చువాడు కదా విష్ణువు - విష్ణు. ధర్మే. 43-47), 'కోఱిన వానినన్నిటిని ఇచ్చు దోషరహితుడు(తి.వా. 9-5-5) అనియు వచించురీతిలో సకలాశ్రితుల అభీష్టము లను ఇచ్చుటచే అశేషాశాపూర్తిని చేయుచున్న వాడవు. ఇక, మహామేరువన్నచో శృంగములను స్వవిభవములతో అన్ని దిక్కులయందు వ్యాపించి యుండును.

**ప్రసిద్ధ్యత్కల్యాణమ్** - స్వామి! నీవు 'పరా2స్య శక్తి ర్వివిధైవ శ్రూయతే'

(ఉత్కృష్టమైన ఇతని శక్తి వివిధములుగా వినబడుచున్నది. శ్వేత. 6-8) అని, 'సత్యకామః సత్యసంకల్పః' (సత్యములైన కోరికలను కలవాడు, సత్యములైన సంకల్పములను కలవాడు - ఛాందో. 8-7-1) అని, 'సమస్త కల్యాణ గుణాత్మకో 2సౌ' (సమస్తములైన కల్యాణగుణములను స్వభావసిద్ధముగా కలవాడితడు - విష్ణు. పు. 6-5-84), 'నిస్సమాభ్యధికమైన ఆనందగుణమును కలవాడు' (తి.వా. 1-1-1) అని, అట్టి శుభగుణములను కల అద్వితీయుడు' (తి.వా. 1-1-3) అనియును పల్కునట్లు ప్రసిద్ధములైన కల్యాణగుణములను కలవాడవై యున్నావు. మహామేరువన్నచో గొప్పగానున్న సౌవర్ణరూపమును కల్గినదైయున్నది.

**ప్రకటతర పీతాంబరరుచిమ్** - నీవు 'మాహారజతమ్‌వాసః' (అతని వస్త్రము బంగారు రంగు - బృహ. 4-3-6), 'పచ్చని రంగును కల వస్త్రము వెలుగగా' (గోదాసూక్తము. 14-5) అని, 'సంధ్యవలె ఎఱ్ఱని రంగునుకల వస్త్రమును' (మునివాహన సూక్తము. 3) అనియు పల్కురీతిలో ధరించిన పీతాంబరమును కల్గియుందువు. మహామేరువును తన వర్ణముతో ఆకాశమునంతటిని బంగారపు రంగును కల్గినయుండునట్లు చేయును.

**కృతస్వోర్ధ్వోత్సేకాన్ నిఖిల సుమనః ప్రీతిజనకమ్** - నీవు 'నచ పునరావర్తతే నచ పునరావర్తతే నచ పునరావర్తతే' (తిరిగిరాడు, తిరిగిరాడు, తిరిగిరాడు - ఛాందో. 5-15-10), 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' (బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మవలె అగును - ముణ్డక. 3-2-9), 'అద్యాపి ననివర్తంతే ద్వాదశాక్షరచింతకాః (ద్వాదశాక్షరమంత్రమును చింతించువారు ఈ నాటికిని తిరిగి వచ్చుట లేదు - వి.పు. 1-6-39), 'పడుక నిచ్చినను పోనివ్వరు కదా' (భట్టనాథ సూక్తము- ) అని, 'తమతో సమానముగా అనుగ్రహించును - (కలివైరిసూరి సూక్తము. 11-3-5) అనియును పల్కువిధమున క్రమముచే ఇతర పురుషార్థములకంటె వ్యావృత్తమైన, అనంతస్థిర ఫలమోక్షపురుషార్థమును కర్మ, జ్ఞాన భక్తుల కంటె విలక్షణమైన ప్రవత్తి యందు నిష్ఠనుకలవారగు సాత్త్వికులకు అనుగ్రహించి, వారికి ప్రీతిజనకుడవై యుందువు. మహామేరువును స్వర్గమును తాకునట్టి ఔన్నత్యము ను కల్గినదగు అందఱు దేవతలకు ప్రీతిని కల్గించునదియై యుండును.

**భవంతం మన్యే2హం సురశిఖరిణం రంగనృపతే** - రంగాధీశా! కావున ఈ ప్రకారములతో నిన్ను మహామేరువు అని విన్నవింప వీలగునట్లున్నది.

**అవతారిక:-** శ్రీరంగనాథుని గొప్ప గుణ సముద్రముగా, అందునను గొప్పగా క్షమ, దయ, సౌలభ్యము, మాధుర్యము మొదలగు ప్రత్యేక గుణములను కల్గిన గుణ సముద్రమునుగను వర్ణించుట పూర్వాచార్యులు అనుసరించిన క్రమము. గద్య త్రయమున 'అసంఖ్యేయ కల్యాణ గుణగణౌఘమహార్ణవ' అని, 'అపార గుణాంబుధే' అని, 'ఆశ్రితవాత్సల్యైకజలధే' అనియు భగవద్రామానుజులు భగవానుని సంబోధించుట గమనింపతగినది.

వేర్వేరు రెండు అభిషేక సందర్భములలో భట్టరు శ్రీరంగనాథుని ఒక సముద్రముగా వర్ణించుచు శ్లేషభంగిమలో రెండు శ్లోకములను అనుగ్రహించిరి. వానిలో మొదటి శ్లోకమునకు సాధారణ వ్యాఖ్యానము, రెండవ శ్లోకమునకు వేదార్థపూర్ణమైన విస్తృత వ్యాఖ్యానమును అనుగ్రహించిరి. వానిని రెండిటిని కనుగొందము.

**శ్లో॥ మరకతమణిరమ్యం రమ్య మాణిక్యముక్తా**
**ఫలవిలసిత గాత్రం ప్రస్ఫురద్గంధవాహమ్।**
**విహితవివిధజంతుం ప్రోల్లసన్మీనలీలం**
**సుగమజలనిధిం త్వాం మన్మహే రంగరాజ॥** 13

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామీ! నీవు అభిషేకమాడ వేంచేసి నిలచియున్న సన్నివేశము ఇట్లు ఒక సముద్రలో సామ్యమును కల్గినదై యున్నది. అది ఏవిధముగాననిన-

**మరకతమణి రమ్యమ్** - సముద్రమును చూడగా మరకతమణివలె పచ్చనిదై, రమ్యమైయుండును. నీవును 'వామనుడను మరతక వర్ణుడు' (తి.వా. 2-7-8), 'రామం మరకత శ్యామమ్' (రాముడు మరకత శ్యాముడు) అనియు చెప్పునట్లు మరకతమణివలె యుందువు.

## శ్రీసేవావ్యాఖ్యా

**రమ్యమాణిక్యముక్తా ఫలవిలసిత గాత్రమ్** - సముద్రమును చూడగా అందమైన మాణిక్యములతో, ముత్యములతో ప్రకాశించు దేహమును కల్గియుండును. నీవును రత్నాభరణములతో, ముక్తా భరణములతో వెలుగునట్టి దివ్య మంగళ విగ్రహమును కల్గియుందువు.

**ప్రస్ఫురద్గంధవాహమ్** - సముద్రమును గమనింపగా 'వారిధి ర్మారుతోత్క్షిప్త తరంగచతురాకృతిః' (సముద్రము గాలిచే పైకి లేవగొట్టబడిన కెఱటములతో ఆకర్షణీయమైన ఆకారమును కల్గియున్నది) అనునట్లు ఎల్లప్పుడు దర్శింప తగినట్లు గాలి కెరటములచే పైకి లేవగొట్టబడిన కెఱటములను కల్గినదై యుండును. నీవును చందన-కుంకుమ-కర్పూరాదుల గంధములను కల్గిన వాడవై యున్నావు.

**విహిత వివిధ జంతుమ్** - సముద్రమును చూడగా సకల సమూహముతో మఱుగునబడిన వివిధ జంతువులను కల్గినదైయుండును. నీవును స్వరూప-రూప-గుణ-ఐశ్వర్యములతో విహితులగు సకల జీవవర్గములను కల్గినవాడవై యుందువు.

**ప్రోల్లసన్మీనలీలమ్** - సముద్రమును చూడగా అది వెలుగుచున్న మత్స్యముల లీలలను కల్గియుండును. నిన్ను దర్శింపగా - 'కెఱటములు ఎగసిపడు సముద్రములోని జలము బురద అగునట్లు, తన ఉదర క్రింది భాగమునందు అలలుగా ఆ నీరు ఎగసిపడునట్లు, విశాలమైన ఆకాశము నందున్న బ్రహ్మాదుల నిలయములలో ప్రవేశించి, ప్రవహించి, వ్యాపించునట్లు తన పృష్ఠముపై పర్వతమును ధరించి వచ్చు మత్స్యరూపుడైన స్వామి' (కలివైరిసూరి సూక్తము. 11-4-1) అనునట్లు మత్స్యావతారములోనున్న లీలను కల్గినవాడవు.

కావున ఇట్లు 'గొప్ప (కౌస్తుభ) మణియు, లక్ష్మియు, (పాంచజన్యమును) శంఖమును ఎల్లప్పుడు కలిగియున్నట్టి కెరటములతో కూడిన సముద్రమువలె నున్న వీరెవ్వరు' (కలివైరిసూరి సూక్తము. 2-8-5) అనునట్లు ఈ సన్నివేశము సముద్రముతో నీకుగల సామ్యమును ప్రకటించు స్థితివలె ఉన్నది.

**అవతారిక:-**

**శ్లో॥ మణివరరుచివాహీ మత్స్యరూపం దధానో**
**లలితధవళశంఖో లంఘయన్ నైవ వేలామ్।**
**విధృతభువన భారో వీక్ష్యసే శ్రీరంగధామన్**
**అపరఇవ వపుష్మా నావగానా మధీశః॥** 14

**'శ్రీసేవ' వ్యాఖ్యా:-**

స్వామి! 'ఆపోవా ఇదమానన్ సలిలమేవాసీత్', (సృష్టికిముందు జలమే ఉండెను - తైత్తి. ఆర. 1-23) అని 'ఆవ ఏవనసర్జాదౌ తాసు వీర్యమపాసృజత్, తదండమభవద్దైమం సహస్రాంశుసమప్రభమ్' (పరమాత్మ మొదట జలమునే సృష్టించెను. అందు తన వీర్యమును నాటెను. అది బంగారు రంగును కల్గిన, సూర్యునితో సమనమైన కాంతిని కల అండమయ్యెను. మను. 1-4) అని, 'గొప్ప జలమును కల ఏకార్ణవమును సృష్టించి' (తి.వా. 1-4-10) అని, 'తాను తనయందే అసమానమైన గొప్ప ఏ కార్ణవమును సృష్టించి, అందు నిద్రించు' (తి.వా. 1-5-4), 'గొప్పదైన కారణజలమును సృష్టించి, పిదప చతుర్ముఖుని సృష్టించి' (తి.వా. 7-5-4) అనియు పల్కురీతిలో మొదట జలమును సృష్టించి - అందు,

**నానావీర్యాః పృథగ్భూతాః తతస్తే సంహతింవినా।**
**నాశక్నువన్ ప్రజాస్స్రష్టు మసమాగమ్య కృత్స్నశః**
**సమేత్యాన్యోన్య సంయోగం పరస్పర సమాశ్రయాః।**
**మహదాద్యాః విశేషాంతా హ్యండముత్పాదయంతి తే॥**

(శాంతత్వ ఘోరత్వ మూఢత్వాదులచే నానాశక్తి యుక్తములై, పృథగ్భూతము లైన ఈ మహదాది పదార్థములు పరస్పరము కలసినగాని అండరూపమైన కార్యమును సృష్టింపలేక పోయెను. ఆ మహదాది విశేషాంతములు పరస్పర సమాశ్రయమును పొందినవై, అన్యోన్య సంయోగమును పొంది అండమును

ఉత్పత్తి చేయుచున్నవి - విష్ణు. పు. 1-2-52, 53) అనునట్టి పంచీకరణ ప్రకారముచే మూల ప్రకృతి, మహదాదులగు ప్రకృతి వికృతులు ఆకాశాదులగు శుద్ధ వికృతులు అని వీనిని అన్నింటిని అండమగునట్లు సృష్టించి, 'అండాత్ బ్రహ్మ సమభవత్ తేన సృష్ట మిదంజగత్'(అండమునుండి బ్రహ్మ ఉద్భవించెను. అతనిచే ఈ జగత్తు అంతయు సృష్టింపబడెను అని, 'పద్మే దివ్యే2ర్కసంకాశే నాభ్యాముత్పాద్యమామవి, ప్రాజాపత్యం త్వయాకర్మ పూర్వం మయి నివేశితమ్' (దివ్యమైన, సూర్యునివంటి నాభీపద్మమునందు నన్ను సృష్టించి, పూర్వము నీచే ప్రాజాపత్యకర్మ నాయందు విధింపబడినది) అనియు, వికసించిన, చల్లని నాభీకమలమునందు 'ఊర్ధ్వలోకములోని చతుర్ముఖుని సృష్టించిన ఆశ్చర్యచేష్టితుని' (తి.వా. 8-4-11) అని వర్ణించు రీతిలో ఆ అండమునందు బ్రహ్మను సృష్టించి, తదంతర్యామివై దేవ - తిర్యక్ - మనుష్య స్థావరరూపమైన చతుర్విధ సృష్టిని చేసి, తద్రక్షణార్థము వ్యూహవిభవఅంతర్యామి - అర్చావతారములను సంకల్పించి, సకలప్రాణుల యొక్క, జ్ఞానవిరోధియైయున్న-'అనాత్మన్యాత్మ బుద్ధిర్యా అస్వేస్వమితియామతిః, అవిద్యా తరు సంభూతిః బీజమేతత్ ద్విధాస్థితమ్' (అవిద్య అను వృక్షమూలమైన ఈ విత్తనము ఆత్మ కాని దేహమందు ఆత్మబుద్ధి, తనది కాని ఆత్మ వస్తువు తనదని తలచుట అను రెండు విధములైనది - వి.పు. 6-7-11) అని, 'మీరు మీది' (తి.వా. 1-2-3)అని, 'అయథార్థమైన జ్ఞానము' (తిరువిరుత్తము. 1) అనియు నుడువునట్టి అజ్ఞానమును 'మానం ప్రదీపమివకారుణికో దదాతి' (కరుణాస్వభావుడైన భగవానుడు శాస్త్రమును ప్రదీపమునువలె ప్రదానము చేయును - శ్రీరంగరాజస్తవే పూర్వశతకే. 2)అని, 'నాల్గువేదములను అనుగ్రహించినవాడై' (తిరునెడున్దాణ్డకమ్. 1) అని చెప్పబడు ప్రమాణ ప్రధానముతో సవాసనగా పోగొట్టి రక్షించి, ఆ వేదమును మధుకైటభులు అపహరింపగా వారిని నిరసించి, హంసమత్స్యాదులైన విభవావతారములతో బ్రహ్మకు వేదోపదేశమును చేసి రక్షించిన నీవు - 'క్షీరాబ్దేః మండలాద్భానోః యోగినాం హృదయాదపి, రతింగతో హరి ర్యత్ర తద్రంగం మునయోవిదుః' (క్షీరాబ్ధిలోకంటె, సూర్యమండలములోకంటె, యోగుల హృదయములోకంటె మిక్కిలి ఆసక్తి హరి ఎచట పొందెనో దానిని మునులు శ్రీరంగముగా తెలియుదురు-శ్రీరంగమహాత్మ్యే. )అనునట్లు శ్రీరంగక్షేత్రములో అర్చారూపముగా అవతరించి సులభుడవై నిలచియుండుట, ఇపుడు సకలాత్మల యొక్క తాపములు శాంతించుటకై అభిషేకార్థము వేంచేసి అనుగ్రహించిన నిన్ను ఆది సృష్టియై, జలతత్త్వరూపమైన సముద్రముతో ఉపమించి వర్ణింపతగి నట్లున్నది. ఎట్లనగా -

**మణివరరుచివాహీ** - స్వామీ! నీవు 'మణిశ్యామః పరః పుమాన్' (మణివలె నల్లనివాడు పరమ పురుషుడు) అని, 'మణివంటి రూపమును కలవాడు' (తిరునెడున్దాణ్డకమ్. 1) అనియు పల్కు క్రమమున ఇంద్రనీలమణి యొక్క ప్రకాశమును కల్గినవాడవు. సముద్రము - 'కుముదళశ్యామలరుచిః' (నల్ల కలువల రేకుల వలె నల్లని కాంతిని కల్గినది)' అనునట్లు నీల వర్ణమును కల్గినదై యున్నది.

**మత్స్యరూపం దధానః** - 'మత్స్యఃకమలలోచనః' (మత్స్యరూపుడైన భగవానుడు కమలముల వంటి కన్నులను కలవాడు - సహస్రనామభాష్యే)అని, 'మత్స్యరూప! నమో2స్తు తే' (మత్స్యరూపా! నీకు నమస్కారము అగుగాక) అని, 'ఆపద్భంజన మంజలిం విజయినే మత్స్యాయ దిత్స్యామహే' (ఆపదలను పోగొట్టు అంజలిని విజయమును సహజముగా కల మత్స్యరూపునకు ఇవ్వగోరుచున్నాము) అని, 'తన పృష్ఠము పై పర్వతములను అధిరోహింపచేసికొని వచ్చు మత్స్యరూపుడు' (కలివైరిసూరి సూక్తము. 11-4-1) అని, 'మత్స్యరూపుడై, కూర్మరూపుడై' (తి.వా. 5-1-10) అనియు కీర్తించునట్లు మత్స్యరూపమును కల్గినవాడవై యుందువు. సముద్రమును - 'తిమిమకరతిమింగిలాదిమత్స్యైః అతిగహనో' (తిమి, తిమింగిల, మకర, మత్స్యములతో మిక్కిలి గహనమైనది) అని, 'నిధిరంభసాం గభీరః' (జలనిధి గంభీరమైనది - లోతైనది) అనియు చెప్పునట్లు నానావిధ మత్స్యశరీరములను ధరించి యుండును.

**లలితధవళ శంఖః** - నీవు 'శంఖచక్రగదాపాశే' (శంఖమును, చక్రమును, గదను దాల్చిన వాడా-భారత. సభా. 90-43) అనియు, 'పశ్చాన్నారాయణశ్శంఖీ' (వెనుక శంఖధారియైన నారాయణుడు ద్వాదశనామపంజర స్తోత్రమ్. 1)

అనియు, 'శంఖమును, చక్రమును అందమైన చేతులలో గొనెను' (తి.వా. 1-8-9) అనియు పల్కునట్లు శ్రీపాంచజన్యమును కల్గినవాడవైయున్నావు. సముద్రము 'పుష్పనివాసినియైన లక్ష్మియు, శంఖమునుండునట్టి, కెఱటములను కల్గిన సముద్రము వంటి వీరెవ్వరో?' (కలివైరిసూరి సూక్తము. 2-8-5) అని పల్కునట్లు పలు శంఖములను కల్గినదై యుండును.

**లంఘయన్ నైవ వేలామ్** - స్వామి! నీవు 'మర్యాదానాంచ లోకస్యకర్తా కారయితాచ సః' (లోకము యొక్క క్రమములను చేయువాడు, చేయించు వాడును అతడు - రామా. సుందర. 35-11) అని, 'మర్యాదాస్థాపనాయచ' (మర్యాదను నిలుపుట కొఱకును) అనియు పల్కురీతిలో నీవు కల్పించిన మర్యాదను నీవును దాటని వాడవైయుందువు. సముద్రమును 'యథావేలాంహి సాగరః' (చెలియలికట్టను సముద్రము ఎట్లు అతిక్రమింపదో) అనునట్లు తీరమును దాటకయుండును.

**విధృతః భువనభారః** - నీవు 'విష్ణునా విధృతే భూమి' (విష్ణువుచే ధరింపబడిన భూమి!) అని, 'వ్యాదేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వాసమస్తంజగత్, మాతాయస్య జగామ విస్మయవశమ్ పాయాత్ సవః కేశవః'(తెరువు మనుచు శిశువగు శ్రీకృష్ణుని నోరు తోరువగా, అందు సమస్త జగత్తును చూచి, ఎవనితల్లి విస్మయమును పొందెన్, అట్టి కేశవుడు మనలను రక్షించును గాక) అని, 'ఏడు లోకములను కుమారుని నోటిలో చూచెను' అనియు పల్కునట్లు సకల లోకము లను ధరించి యున్నావు.

సముద్రము 'జీవనం భువనంవనమ్' అని పల్కునట్లు భువనశబ్దము జలపర్యాయ వాచకమగుటచే ధరింపబడిన జలభారమును కల్గియుండును. కావున 'భగవదనుభవానందము వ్యక్తమగు శరీరములనుకల నిత్యసూరులకు నాయకుడా' తి.వా. 7-2-10) అని కీర్తింపబడు నిన్ను మూర్తీభవించిన వేరొక సముద్రము అని విన్నవింప వీలగునట్లున్నది.

**అవతారిక:-**

శ్రీరంగనాథుని పర్వతముగా, సముద్రముగా పలువిధములుగా వర్ణించిన భట్టరు ఒక అభిషేక శ్లోకమున ఆ స్వామిని ఒక నదిగా, వేరొక శ్లోకమునందు అన్ని పుణ్యానదులు కలియునట్టి ఒక పరిశుద్ధమైన తీర్థముగా వర్ణించిరి. వానిని క్రమమున కాననగును.

**శ్లో॥ నానానువృత్తి విషయం నతరాజహంసం**
**నానాండ జాతసమధిష్ఠిత మబ్జరమ్యమ్।**
**సేవావతీర్ణసుమరుద్గణ మద్య రంగిన్**
**భావానురూప నదమిత్యను మన్మహే త్వామ్॥** 15

**'శ్రీసేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'నారాయణః పరం బ్రహ్మ' (నారాయణుడు పరబ్రహ్మ - తైత్తి. నారా. 11) అని, 'నారాయణుడను అన్ని లోకములకు నాథుడును' (తి.వా. 2-7-2) అనియు పల్కురీతిలో నిరంకుశ స్వతంత్రుడవైయున్నవాడవైనను, 'ఇమౌ స్మముని శార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం తే శాసనం కరవావ కిమ్?' (ముని శార్దూలా! ఈ మేమిద్దఱము సేవకులుగా వచ్చితిమి. మమ్ములను నీ ఇష్ట ప్రకారము ఆజ్ఞాపింపుము. నీ ఏ ఆజ్ఞను చేయుదుము? - రామా. బాల. 31-4) అని, 'నీ యందు ప్రీతికల వారు సంతోషించి, అనన్య ప్రయోజనులై నీదటిచేరునట్టి నీ ఆశ్చర్యచేష్టితములు - తి.వా. 8-1-4) అని, చెప్పునట్లు ప్రణత పరతంత్రములైన సర్వప్రవృత్తులను కలవాడవగుటచే - 'క్షీరాబ్ధిలో నీవు, నీవు పరుండి యుండు సన్నివేశమును మేము విన్నను కాళ్ళు వణకును, మనస్సు ద్రవించును, కన్నులు తిరుగును -పెరియతిరువన్దాది. 34) అనునట్లు శయన సన్నివేశ సౌందర్యమును దర్శింప ఆశపడిన ఆశ్రితుల అపేక్షానుగుణముగా శ్రీరంగనాథుని మూలమూర్తివై 'శ్రీరంగనగరమునందు తేటనీటిని కల కావేరీనది తన కెరటములను కరములతో సేవింపగా పరుండి యుండి' - (కులశేఖర సూక్తము. 1-1), అంతియేకాక, 'సానబెట్టబడిన ఎఱ్ఱని, బంగారము వంటి దేహమును కల నా తండ్రీ! నిలచియుండి అనుగ్రహింపుము' అనునట్టి ఆశకు తగినట్లు శ్రీరంగనాథ - ఉత్సవమూర్తివై, 'శ్రీదేవి, భూదేవియు ఇరువైపుల ప్రకాశింప' (కలివైరిసూరి సూక్తము. 3-10-1) 'నిలుచున్న సన్నివేశము తీర నిలచి అనుగ్రహించి'( ),'పిమ్మట తెలిసి తెలిసి ఈ వీధిలో పోయినచో'

(  ), అని ఆశపడుచున్న ప్రణయినీపరిజనముల కొఱకు దివ్యోత్సవము నెపమున మేనక మొదలగు వారు సిగ్గుపడి నాట్యము మాఱునట్లు వీథియందు వేంచేసి, 'కందూతి వలన పడుకలో నొరసికొనుచు నీవు శయనింప నేను సమ్మతింపను'(భట్టనాథసూక్తము. 2-4-1), 'పసుపును, శిరస్సున అలంకరించుట కొఱకు నీలోత్పలమాలను, చల్లని, సువాససనుకల, కస్తూరి, పచ్చకర్పూరాదులను చేర్చిన చందనము, కాటుకను కొని వచ్చి ఉంచినాను' (భట్టనాథసూక్తము. 2-4-3), 'స్నానమాడి భుజింపవలెను' (భట్టనాథసూక్తము. 3-3-3) అని అపేక్షించునట్టి అంతరంగుల కొఱకు ఇపుడు అభిషేకమాడి, సౌందర్య ప్రభావముచే 'చుట్టియుండి మంగళాశాసనము చేయు వారిని' (తిరుప్పల్లాణ్డు - 12) పూర్తిగా సుడిగుండములో చిక్కుకొనునట్లు చేయుచు నిలచిన సన్నివేశము ఒక నదితో సమానముగా శ్లేషప్రక్రియలో విన్నవింప తగినట్లున్నది. అది ఎట్లనగా-

**నానానువృత్తి విషయమ్** - నది స్నానపానాది కోరికలనుకల నానావిధ ప్రాణులకు అనువర్తించుట కొఱకు విషయమై, వేగవైభవ వివశ వివిధ పదార్థ సార్థాను గమ్యమానమునైయుండును. నీవును 'మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' (నన్ను ధ్యానించువాడవగుము, నా భక్తుడవుకమ్ము, నన్ను యజ్ఞము చేయువాడవు, అగుము. నన్ను నమస్కరింపుము భగ. 9-34) అనునట్లు ధ్యానార్చన ప్రణామాది రూపమున, భజన - ప్రవదన రూపమునను, నానావిధమైన ఆశ్రయమునకు విషయభూతడవైయున్నావు.

**నతరాజహంసమ్** - 'అన్నమాడులవు వునల్' అనురీతిలో సంశ్లేషముచే నమ్రమైన శరీరమును కల్గినవి, పరిసరవర్తులైన రాజహంసలను కల్గినదై యుండును. నీవు 'మనుకులమహీపాలివ్యానమ్రమౌళి పరంపరామణిమకరికారోచి ర్నీరాజితాంఘ్రిః (మను వంశములోని ప్రభువులచే పంచబడిన కిరీటముల వరుసలలోని మకరికారోవ రత్నముల కాంతులచే హారతి ఇవ్వబడిన పాదము లను కలవాడు - శ్రీరంగరాజస్సవే - ఉత్తరశతకమ్ - 77) అనునట్లు పాదము లందు ప్రణతులైన రాజశ్రేష్ఠులను కల్గియుందువు.

**నానాండజాత సమధిష్ఠితమ్** - నది నానా విధములైన కారండవాది అండజములచే అధిష్ఠితమైయుండును. నీవును 'రోమకూపే హ్యనంతాని బ్రహ్మాండాని భ్రమంతి తే' (నీ రోమకూప మందు అనంతములైన బ్రహ్మాండములు పరిభ్రమించుచున్నవి) అని, 'అండానాం త్వదుదర మామనంతి సంతః స్థానమ్' (నీ ఉదరమును అండములకు స్థానముగా సత్పురుషులు పల్కుదురు - వరదరాజస్తవే. 49) అనియును పల్కునట్లు అనంతములైన అండముచే ఆశ్రయింపబడిన వాడవైయుందువు.

అబ్జరమ్యమ్ - నది ఎఱ్ఱని తామర పూలచే నిండియుండి, అందముగా చల్లగా నుండును. నీవు 'తెల్లని, అందమైన శఖము' (తి.వా. 6-5-1) అనురీతిలో వర్ణమునకు పరభాగమైన ధావల్యమునుకల శ్రీపాంచజన్యముతో సుందరుడవై యుందువు.

**సేవావతీర్ణసుమరుద్గణమ్** - నది ఆగంతకములైన పద్మ - సౌగంధికముల అపరిమితమైన పరిమళములను గ్రహించి, వహించుట కొఱకు అవతీర్ణమైన, అందమైన మందమారుత బృందమును కల్గినదైయుండును. నీవు ఉత్సవమును సేవించుట కొఱకు స్వర్గమునుండి దిగి వచ్చిన 'భగవదనుభవానందము ప్రకాశించు దేహములను కల నిత్యసూరులగు' (తి.వా. 7-2-10) సుందర బృందాకర సందోహమును కల్గియుందువు.

**అద్య రంగిన్ భావానురూప నదమ్ ఇతి అను మన్మహే త్వామ్** - కావున ఈ ప్రకారములతో లోకమున కానవచ్చు నదులతో తులతూగునదియై, వాని వలె తాను తలచిన రీతిలో పోవునది గాక, 'పశ్యన్మనః ప్రవణమోఘ మివామృతస్య' (చూచువారి మనస్సులలో ప్రవణమైన అమృత ప్రవాహమువలె - శ్రీరంగరాజస్తవే - పూర్వశతకమ్ - 83) అని ఆశ్రితుల అభిప్రాయమును అనువర్తించునదియైన శ్రీరంగనాథుడను అమృతనది సమస్త తాపములను తీర్చునట్లు అభిముఖమై నిలచియున్న స్థితివలె ఉన్నది.

**అవతారిక:-**

**శ్లో॥వృత్తిర్వేగవతీ సమాశ్రిత జనత్రాణే భవచ్చేతనః**
**తామ్రా కుంకుమ పత్రికా భుజతటీతే తుంగభద్రోజ్జ్వలా।**
**రంగాధీశ్వర! నర్మదాచ భణితిః శోణస్సుజాతో2 ధరః**
**తస్మాత్ స్నానవిధౌ జనో హి మనుతే త్వాం సర్వతీర్థాత్మకమ్॥16**

'శ్రీసేవా' వ్యాఖ్యా:-

స్వామీ! 'ఏక ఇద్రాజా జగతోబభూవ' (జగత్తున కంతటికిని ఒక్కడే రాజు ఉండెను - తైత్తి. యజు. 4-1-8) అని, 'సర్వలోకమహేశ్వరః' (అన్నిలోకము లకు గొప్ప ప్రభువు) అని, 'సర్వస్యేశానః' (సర్వమునకు ఈశ్వరుడు - బృహ. 6-4-22) అని, 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దైవతానాం పరమంచ దైవతమ్' (ఈశ్వరులకు గొప్ప ఈశ్వరుడైన అతనిని, దైవములందరిలో ఉత్కృష్టుడైన ఆ దైవమును - శ్వేతా. 6-7) అని, 'త్రయాణామపి రాఘవో రాజ్యమర్హతి' (ముగ్గురి కంటెను రాముడు రాజ్యమునకు తగియున్నాడు) అని, 'వేంచేసి యుండి ఏడులోకములందు అద్వితీయమైన అధికారము చెల్లునట్లు' (తి.వా. 4-51) అని, 'కెఱటములు ఉవ్వెత్తుగా ఎగసిపడు సముద్రముచే చుట్టబడియున్న ఈ భూమండలము, పరమపదమును, అందు ఏమియు కొఱత చెందకుండునట్లు పాలించుచున్న స్వామి అధికారమును కల శ్రీరంగము లోని శ్రీమంతుడు' (గోదాసూక్తముమ. 11-3) అనియును కీర్తించునట్లు సకలలోక నాయకుడవైన నీవు 'అజాయమానో బహుధా విజాయతే' (కర్మ వశమున పుట్టని వాడైనను కృపావశమున పలువిధముల జన్మించుచున్నాడు - పురుషసూక్తము. 21) అని, 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' (సజ్జనుల రక్షణకొఱకు, దుష్టుల వినాశనము కొఱకు, ధర్మసంస్థాపనము కొఱకును ప్రతియుగమున అవతరింతును - భగ. 4-8) అని, 'స ఉ శ్రేయాన్ భవతి జాయమానః' (అతడు జన్మించుచున్న వాడైన పిమ్మటనే శ్రేయస్సును కలవాడు అగుచున్నాడు యజు. అష్ట. 3-6-3-9) అని, 'నితమై, అప్రాకృత తేజోరూపమైన రూపమును పరమ పదములోనున్నట్లే గ్రహించి ఈ లోకమున జన్మించినవాడు వేదములచే మూలకారణమని కీర్తింప బడువాడు (తి.వా. 3-5-5) అనియు పల్కునట్లు సాధువులను రక్షించుట కొఱకు, విరోధులను నిరసించుట కొఱకు, ధర్మ సంస్థాపనము కొఱకును ఇచట అవతరించితివి.

అపుడు అర్జునునకు దూత్యసారథ్యములను చేసి విరోధులను నిరసించినట్లు, ఇపుడును యవనాదులగు ఆశ్రిత విరోధులను నిరసించి, సకలలోకమును కృతార్థమగునట్లు చేసితివి.

ఇపుడు 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' (భూదేవి, లక్ష్మీదేవియునీ పత్నులు - తైత్తి. నారా.     ) అనియు, 'పట్టమహిషులైన శ్రీదేవి, భూదేవి' (తి.వా. 8-1-1) అనియును కీర్తించురీతిలో పత్నులతో పాటు కూడియుండి సకల ప్రాణుల యొక్క తాపత్రయములను పోవునట్లు అభిషేకము కొఱకు వేంచేసిన నీ దివ్యదేహములో సకల తీర్థములను సేవింపనగునట్లున్నది. అది ఏ విధముగా అనినచో -

**వృత్తిఃవేగవతీ సమాశ్రితజనత్రాణే భవచ్చేతనః** - స్వామీ! 'పరమా పదమాపన్నో మనసా చింతయ ద్ధరిమ్, నతునాగవరః శ్రీమాన్ నారాయణ పరాయణః' (నారాయణునే గొప్ప శరణముగా కల్గిన, కైంకర్య సంపదనుకల ఆ గజరాజు గొప్ప ఆపదను పొందినవాడై మనస్సుతో హరిని చింతించెను - విష్ణుధర్మే 69-47) అని, 'నారాయణా! ఓ మణివర్ణా! నాగశయనా! రామయ్యా! నా ఈ దుఃఖమును బాపుమా' (శిఱియ తిరుమడల్) అనియు పల్కువిధమున పరమాపన్నుడైన గజేంద్రుని రక్షించుటకు వేంచేసినపుడు కరిప్రవరబృంహితే భగవతస్త్వరాయై నమః' (గజేంద్రుడు మొఱపెట్టగా, భగవానుని యొక్క త్వరకు నమస్కారము - శ్రీరంగరాజస్తవే - ఉత్తర శతకమ్ - 57) అనునట్లు నీ మనస్సు లోని ప్రవృత్తి వేగవతియై యున్నది. కావున వేగవతీ అను తీర్థముగా చెప్ప తగినట్లున్నది.

**తామ్రా కుంకుమ పత్రికా-** నీవు దేహమున చేసికొనిన కుంకుమ చర్చ తామ్ర

వర్ణమును కల్గినదై యున్నది. కావున తామ్రపర్ణి అను తీర్థముగా చెప్పతగి నట్లున్నది.

**భుజతటీతే తుంగభద్రోజ్జ్వలా** - 'ఉత్తుంగబాహుశిఖరః' (ఉన్నతములైన, శిఖరముల వంటి బాహువులను కలవాడు) అని, 'భద్రబాహుః' (మంగళకరము లైన బాహువులను కలవాడు) అని, 'మణిపర్వతముల వంటి బాహువులు' (పెరియతిరుమడల్) అనియు నుడువురీతిలో నీ బాహువులు ఉత్తుంగములై, భద్రములై, ఉజ్జ్వలములైయున్నవి. కావున తుంగభద్ర అను తీర్థముగా చెప్పతగి నట్లున్నది.

**రంగాధీశ్వర! నర్మదాచ ఫణితిః** - 'మధురభాషీ' (మధురముగా మాట్లాడు వాడు - రామా. - అయో. 1-13) అని, 'ప్రియంవదః' (ప్రియముగా మాట్లాడు వాడు - రామా. - అయో. 1-13) అని, 'నర్మాలాపం బహురనువదన్' (నర్మ వచనములను అనేకముగ పల్కుచు) అనియు పల్కునట్లు నీవు పల్కు మాటలు నర్మమును కల్గించునవియైయున్నవి. అందుచే నర్మదా అను తీర్థముగా చెప్పతగినట్లున్నవి.

**శోణస్సుజాతోఽధరః** - 'విద్రుమసన్నిభాధరః' (పగడము వంటి అధరమును కలవాడు) అని, 'పగడమువంటి ఎఱ్ఱని అధరమును కలవాడు' (తి.వా. 10-1-9) అని, 'అధరమును ఎఱ్ఱనై, పండువలె' (తి.వా. 8-8-1) అని, 'అందమైన పగడపు చిగుళ్ల వంటి అధరము' అని పల్కువిధమున నీ అధరము శోణవర్ణమైయున్నది. అందువలన శోణా అను నదము చెప్పతగినట్లున్నది.

**తస్మాత్ త్వాం సర్వతీర్థాత్మకం జనో మనుతే** - కావున ఇట్లు ఆసీనుడవై యున్న నిన్ను సేవించి నిలచియున్న సకల సాత్త్వికులును నిన్ను దేహమునందు సకల తీర్థములను వ్యక్తముచేయుచు నున్నవాడవుగా ఉత్ప్రేక్షించుచున్నారు.

**అవతారిక:-** కోరిన వారి కోరికలనొసగువాడే సర్వేశ్వరుడనుచు ఈ శ్లోకమున భట్టరు పల్కుచున్నారు. భగవానుని ఈ స్వభావమున మనసున నుంచికొని శఠకోపసూరి 'నాకే తనను అనుగ్రహించిన కల్పకము' (తి.వా. 2-7-11) అని వచించిరి. కావున భగవానుని కల్పక వృక్షముగా మాటిమాటికి దివ్యసూరులు, ఆచార్యులును అనుభవించిరి. ఈ పద్ధతిలోనే శ్రీరంగనాథ ఉత్సవమూర్తిని కల్ప వృక్షముగా వర్ణించి భట్టరు అభిషేక సందర్భమున రెండు శ్లోకములను రచించి, వానికి ప్రమాణములతో కూడిన రెండు వ్యాఖ్యలను అనుగ్రహించిన సొబగును ఇపుడు గమనించెదము.

**శ్లో॥ అనేక శాఖాశ్రిత మాశ్రితేభ్యో**
**దత్తాభికాంక్షం త్రిదశైక భోగ్యమ్।**
**సువర్ణరమ్యం సుమనస్సమేతం**
**సురద్రుమం త్వాం సుధియో వదంతి॥** 17

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:-**

స్వామి! సకల జగత్స్రష్టవై, సర్వరక్షకుడవై, సకల జగన్నియంతవై, సర్వశేషివై, సమాభ్యధికరహితుడవై, 'అజ్ఞాన-అన్యథాజ్ఞాన-విపరీతజ్ఞానములు లేని నిత్య సూరులకధిపతివై' (తి.వా. 1-1-1), 'అలలు ఎగసిపడు సముద్రముచే పరివేష్టిత మైన భూమి, పరమపదమును,అందు ఏదియు కొఱతపడకుండునట్లు పాలించు, అధికారమును కల శ్రీరంగములోని శ్రీమంతుడవైన' (గోదాసూక్తము - 11-3) నిన్ను ఒక కల్పకతరువుగా విన్నవింపతగినట్లున్నది.

**అనేక శాఖాశ్రితమ్** - కల్పకము సర్వానందమైన నందనవనమున ప్రభవించుటచే అనుకల కందళితములైన శాఖలతో పూర్ణమైయుండును. నీవును 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' (వేదములన్నిటిచే నేనే తెలియతగినవాడను-భగ -15-15) అనురీతిలో సకల శాఖా శిరస్సులలో విదిత చరణ యుగళ సరోరుహుడవైయున్నావు.

**ఆశ్రితేభ్యో దత్తాభికాంక్షమ్** - కల్పకము తన వద్దకు వచ్చి, అపేక్షించిన వారికి అపేక్షానుగుణముగా ఫల ప్రదాన విచక్షణమై యుండును. నీవును 'కోరిన వానిని అన్నింటిని ఇచ్చువాడు, దోషరహితుడు, నాకు మహోదారుడు' (తి.వా. 3-9-5) అనునట్లున్నావు.

**త్రిదశైకభోగ్యమ్** - కల్పకము అమృతాశనులై, కావుననే అమర్త్యులైన దేవ వర్గములకు అనుకూలతయా భావ్యమై యుండును. నీవును - 'యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః' (ఎచట ప్రాచీనులైన, నిత్యులగు దేవతలు కలరో - పురుషసూక్తే. ) అనియు, 'ప్రాచీనులైన నిత్యసూరులు' (తిరువిరుత్తము - 2) అనియు పల్కురీతిలో నిరంతరానుభవకాముకులైన నిత్యసూరులను నిరతిశయ భోగ్యుడవైయుందువు.

**సువర్ణ రమ్యమ్** - కల్పకము చూచువారి కన్నులు సంతోషపడునట్లు కౌతుక జనకములైన పత్రవిశేషములతో రమ్యముగా నుండును. నీవును సుపర్ణో2సి గరుత్మాన్' (ఓ గరుత్మంతుడా! నీవును పర్ణుడవు - యజు. 4-1-42) అనునట్లు గరుడుడు తనపై అధిరోహింపచేసికొనుటచే అందమైన రెక్కలను కల గరుడుని పై ఎక్కవచ్చిన వారు, మేఘ మండలపర్యంతము పెరిగిన ఒక బంగారు పర్వతముపై అధిరోహించిన కాలమేఘముండునట్లున్నారు. వచ్చి సేవింపుడు! (కలివైరిసూరి సూక్తము. 9-2-8) అనునట్లున్నావు.

**సుమనస్సమేతమ్** - కల్పకము మధుకరకుల గర్వనిర్వాహక మదముదిత మనోభవ మాన్య శస్త్ర మాలాయమాన మంజరులతో మాననీయమైయుండును. నీవును సత్త్వనిష్ఠులై, సదాచార సేవానిపుణులై, విదిత సకల తత్త్వార్థులైయున్న విద్వద్వతంసులచే సేవ్యమానుడవైయుందువు.

**సురద్రుమం త్వాం సుధియో వదంతి** - కావున ఇట్లు సకల శ్రుతి శిరో మాన్యమై, సకల ప్రదాన దీక్షాదక్షమై, సర్వ సులభమై, సుజాతమై, 'నాకే తనను ఒసగిన కల్పకము' (తి.వా. 2-7-11) అనునట్లు సర్వోపాయ దరిద్రులమైన దాసులమగు మాకు సర్వస్వమును ఇచ్చుటకై నిశ్చయించుకొనియున్న ఒక కల్పక వృక్షము యొక్క స్థితివలెయున్నది.

**అవతారిక:-**

**శ్లో॥ శ్రీమత్సురంగధరణీశ! విశాల శాఖం**
**శ్రీకౌస్తుభ స్ఫురిత మీప్సిత దానదక్షమ్।**
**హంసాది సద్ద్విజవరై రుపసేవ్యమానం**
**త్వాం మన్మహే సురతరుల సురనాథనాథ॥** 18

**'శ్రీసేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'ఏకోహవై నారాయణ ఆసీత్ నబ్రహ్మా నేశానః నేమేద్యావా పృథివీ' (నారాయణుడొక్కడే సృష్ట్యాదికి పూర్వముండెను. బ్రహ్మలేడు, ఈశ్వరుడు లేడు, ఈ స్వర్గము, పృథివి లేవు - మహోపనిషత్. ) అని, 'సదేవసోమ్య ఇదమగ్ర ఆసీత్' (చంద్రునివలె ప్రియమైనవాడా! సృష్టికి ముందు ఈ సత్తుమాత్రమే ఉండెను - ఛాందో. 6-2-1) అని, 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' (సృష్టికి ముందు ఈ అసత్తుయే ఉండెను - తైత్తి. ఆనంద. 7), 'నాసదసీన్నోసదాసీత్' (అపుడు అసత్తులేదు, సత్తులేదు - యజురారణ్య. 2-8-9) అనియు చెప్పునట్లు భూధర సరిత్సాగర ప్రముఖమైన సప్తద్వీపములు, అతలవితలాదులగు అధోలోకములు, 'భూర్భువస్సువర్ మహర్జన స్తపస్సత్యమ్' అని చెప్పబడు ఊర్ధ్వలోకములు ఆయా లోకాంతర్వర్తులైన దేవమనుష్య తిర్యక్ స్థావరాది సకలవస్తువులు ఉప సంహృతములై, నీవు ఒక్కడవైయుండి, 'దేవతలు, వారికి స్థావరములగు లోకములు, మనుష్యాది ప్రాణులు, మిగిలిన జీవులెవ్వరును కొంచెమైనను లేని ఆ ప్రళయకాలమునందు' (తి.వా. 4-10-1) అనునట్లు సర్వశూన్యమను రీతిలో నున్న ఆకాలములో, పరమకారుణికుడవైయున్న నీవు 'సదా పశ్యంతి సూరయః (దివ్యసూరులు ఎల్లప్పుడు దర్శింతురు - పురుష. సూ. 14) అనునట్లు నిత్య విభూతిలోని నిత్యసూరులు నిన్ను ఎల్లప్పుడు సేవించుచుండగా, లీలా విభూతిలో నున్న ఈ ఆత్మవర్గములు నన్ను సేవింపలేక, నష్టపోవుటయా! అని మనస్సున నొచ్చుకొని, 'యథాపూర్వమకల్పయత్' (పూర్వములో వలె ధాత సృష్టిని కల్పించెను - పురుషసూక్తే ) అని, 'విధాయలోకాన్ విధాయభూతాని విధాయసర్వాః ప్రదిశోదిశశ్చ' (లోకములను సృష్టించి, జీవులను సృష్టించి, అన్ని దిశలను, విదిశలను సృష్టించి) అనియు పల్కునట్లు యథాపూర్వము సమస్త ప్రపంచమును సృష్టించి, 'తత్ సృష్ట్వా, తదేవాను ప్రావిశత్, తదనుప్రవిశ్య' తన

విభూతియగు దానిని సృష్టించి, దానిని అను ప్రవేశించెను. దానిని అను ప్రవేశించి తైత్తి-ఆనంద. 6)అనునట్లు సంపాదించిన ఇంటిలో ప్రవేశించువారివలె తత్తదండాంతర్వర్తులైన సకల వస్తువులను అనుప్రవేశించి, 'పరిత్రాణాయ సాధూనామ్' (సాధువుల పరిత్రాణము కొఱకు - భగ. 4-8) అనునట్లు ఆశ్రిత సంరక్షణాది ప్రయోజనమును మనస్సున గాని, అవతరించి, నిత్య విభూతి లీలా విభూతి వ్యావృత్తమైన శ్రీరంగమను ధరణికి అధీశుడవై, ఇపుడు వేంచేసి, నిలచియున్న సన్నివేశము కల్పక వృక్షముతో సదృశముగా విన్నపము చేయ తగినట్లున్నది. అది ఏవిధముగా ననినచో -

**విశాలశాఖమ్** - స్వామి! ఆ కల్పకవృక్షము విశాలములైన శాఖలను కల్గినదై యుండును. నీవును విస్తృతములైన వేదశాఖలను కల్గినవాడవైయున్నావు.

**శ్రీకౌస్తుభస్ఫురితమ్** - స్వామి! ఆ కల్పక వృక్షము శ్రీకౌస్తుభమువలె ప్రకాశించునదియై యుండెను. నీవును శ్రీదేవి, కౌస్తుభము అను వీనిచే ప్రకాశించుచుందువు.

**ఈప్సితదానదక్షమ్** - ఆ కల్పకము కోరిన వానిని ఇవ్వగల్గినదై యుండును. నీవును 'సకల ఫలప్రదో హి విష్ణుః' (విష్ణువు సకల ఫల ప్రదుడు కదా - విష్ణుధర్మే మాంగల్యస్తవే.  ) అనునట్లు ఆశ్రితులకు సకల ఫలములను ఇచ్చుచుందువు.

**హంసాది సద్ద్విజవరై రుపసేవ్యమానమ్** - ఆ కల్పకము హంసలు మొదలగు పక్షి సమూహములచే సేవింపబడుచుండును. నీవును హంసలు - పరమ హంసలు మొదలగు సత్పురుషులైయున్న బ్రాహ్మణోత్తములచే సేవింపబడు చుందువు.

**త్వాం మన్మహే సురతరుం సురనాథనాథ** - కావున ఇట్లు శ్రీరంగనాథుని అర్చామూర్తి అనునది ఒక కల్పక వృక్షము, ఆశ్రితులకు అభీష్ట ప్రదానమును చేయుటను నిశ్చయించునని నిలచిన సన్నివేశమువలె ఉన్నది.

**అవతారిక:-** శ్రీరంగనాథుని అర్చామూర్తిని పలువిధములుగా స్తుతించు భట్టరు ఒక శ్లోకమున ఒకానొక అభిషేక సమయములో వక్షస్థలమున సమర్పింపబడిన ఎట్టికలువల మాలను, వేరొక అభిషేక సమయమున స్వామి వక్షః స్థలములో ధరించిన (పసుపుపొడి) హరిద్రాచూర్ణ చర్యను - క్రమముగా లక్ష్మీదేవి మణినూపురముతో, ఆమె దివ్యదేహకాంతితో పోల్చి ఉల్లేఖించిరి. వానిని వర్ణించు రూపమున స్వామి యొక్క, లక్ష్మీదేవి యొక్క మహిమలను వివరించి, అంగముల గొప్పతనము అంగికే చెందును అను సత్యమును ధృఢీకరించిరి. వీనిని క్రమముగా అనుభవించెదము.

**శ్లో॥ అత్యాయతే లసతి హల్లక పుష్పమాలా**
**వక్షఃస్థలే వినిహితా తవ రంగరాజ!**
**స్వచ్ఛందచారి కమలా చరణారవింద**
**మాణిక్యనూపురమయూఖ పరంపరేవ॥** 19

**'శ్రీసేవా' వ్యాఖ్యా:-**

స్వామి! 'యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ' (ఏ బ్రహ్మానందము ను కొలుచు ప్రయత్నము నుండి వాక్కు మనస్సుతో పాటు వెనుతిరుగుచున్నదో - తైత్తి. ఆనంద.  ) అని, 'యస్యామతం తస్యమతం మతంయస్య నవేద సః (ఎవనికి భగవద్వైభవము పరిచ్ఛిన్నమనుట అమతమో అతనికి భగవద్వైభవము మతము - అనగా తెలియబడినది. ఎవనికి అట్లు సమతమో అనగా ఇష్టమో అతడు భగవద్వైభవమును తెలియుట లేదు - కేన - 2), 'ప్రత్యస్తమితభేదం యత్ సత్తామాత్రమగోచరమ్, వచసామాత్మ సంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితమ్' (జాత్యాది భేదరహితము, కావుననే వాక్కుకు అగోచరము, అపక్షయాది వికారహితము, స్వయం ప్రకాశము, జ్ఞాన గుణైక నిరూపణీయము అగునది బ్రహ్మగా చెప్పబడినది - వి.పు. 6-7-53) అని, 'తత్త్వేన యస్య మహిమార్ణవశీకరాణుః శక్యోనమాతుమపి శర్వపితామహాద్యైః' (ఎవని మహిమ అను సముద్రము యొక్క అల్పభాగము యథార్థముగా కొలుచుటకు శివుడు, బ్రహ్మమొదలగు వారికి కూడ శక్యముకాదో - స్తోత్రరత్నే. 7) అనియు, 'యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభో2పి ప్రభుః, కాలం మాతుమియత్తయా' (ఏ నీ మహిమను ప్రభువగు నీ భర్తయు తన యొక్క

మహిమకువలె ఇంత అనుపరిమితిచే లెక్కించుటకు సమర్థుడుకాడో -కాంతాచతుః శ్లోకి. 2), 'తనకును తన (మహిమను) స్వభావమును తెలియని వాడు' (తి.వా. 8-4-6) అని, 'తెలిసికొనుటకు అశక్యములైన వస్తువులను తెలిసిన వేదరూపశాస్త్రములు తెలిసికొనుటకు అశక్యమని భగవానుని తెలిసినదని స్వీకరింపుడు' (తి.వా. 9-3-3) అనియు, 'దామోదరునకు శరీరముగానున్న రుద్రునకు, బ్రహ్మకును నాకు సేనను అనుగ్రహించిన, నా సముద్రునకు, బ్రహ్మకును నాకు సేవను అనుగ్రహించిన, నా సముద్రవర్ణుని మహిమ తెలియతరమా?' (తి.వా. 2-7-10) అనియును పల్కురీతిలో నీ స్వరూపము అపరిచ్ఛేద్యమనుట సిద్ధమైయున్నను ముముక్షువులగు ఆత్మలకు యథావస్థితమైన పరమాత్మజ్ఞానముచే మోక్షము పొందవలసి యుండుటచే, 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (బ్రహ్మసత్య స్వరూపము, జ్ఞాన స్వరూపము అనంతము - తైత్తి. ఆనంద. 1) అనియు, 'ప్రాణోబ్రహ్మ' (బ్రహ్మ ప్రాణము-ఛాందో. 4-10-5), కం బ్రహ్మ ఖం బ్రహ్మ (బ్రహ్మ సుఖ స్వరూపము - ఛాందో. 4-10-5) అనియు, 'అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే, సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే' (స్వరూప స్వభావ వికారములు లేనివాడు, క్లేశకర్మాదిరాహిత్యరూపశుద్ధిని కలవాడు, నిత్యుడు, పరమాత్మయు, ఎల్లప్పుడు ఒకే విధమైన స్వరూపములను కలవాడు, అన్నిటిని తన వశమున నుంచు కొను స్వభావమును కలవాడు అగు విష్ణువునకు నమస్కారము వి.పు. 1-2-1) అని, 'నిత్యమై, స్వయంప్రకాశమైన జ్ఞానమును స్వరూపముగా కలవాడా! పరిచ్ఛేదింపవీలుకానివాడా! నరనారాయణావతారమును ఎత్తినవాడా!' (కలివైరి సూరి సూక్తము. 3-8-1) అని, 'పరిపూర్ణజ్ఞానానంద స్వరూపి' (తి.వా. 1-1-2) అని, 'ఆ సమయమునకు ఆ సమయము నాకు అపర్యాప్తామృత స్వరూపమైన వాడా! (తి.వా. 2-5-4) అనియును చెప్పబడు ప్రమాణములచే స్వరూపము నిరూపితమైనను, నిరూపితస్వరూపమునకు విశేషణములైన 'వశీవదాన్యో గుణవాన్ ఋజుశ్శుచిః మృదుర్దయాళుః మధురః స్థిరస్సమః, కృతీకృతజ్ఞః త్వమసి స్వభావతః సమస్త కల్యాణ గుణామృతోదధిః (సర్వమును నీ వశమున కలవాడవు, గొప్పదాతవు, గుణవంతుడవు, ఆర్జవమును కలవాడవు, భావశుద్ధిని కలవాడవు, మృదువైన వాడవు, (మనోమార్దవమును కలవాడవు) దయగలవాడవు, మనోహరమైన వాడవు, చలింపని వాడవు, అందటి పట్ల సమముగా ప్రవర్తించువాడవు, దక్షుడవు, కృతజ్ఞుడవు, స్వభావముచేతనే సమస్త కల్యాణ గుణములను అమృతమునకు సముద్రమువంటి వాడవై నీవున్నావు - స్తోత్రరత్నే - 18) అని చెప్పబడు ధర్మములలో ప్రధాననిరూపకయైన లక్ష్మీదేవి 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' (నీకు భూదేవి, లక్ష్మీదేవియు భార్యలు - తైత్తి. నారా. ) అని, 'అస్యేశానో జగతో విష్ణుపత్నీ' (ఈ జగత్తునకు ఈశ్వరి, విష్ణువునకు పత్ని - నీళాసూక్తే. ) అని, 'శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే' (శ్రద్ధాదేవి అనబడు లక్ష్మిచే దేవుడు దేవత్వమొందుచున్నాడు - కాఠకే. 3-3) అని, 'నారాయణః పరంబ్రహ్మ శక్తిః నారాయణీచసా, వ్యాపకావధి సంశ్లేషాదేక తత్త్వమివస్థితా' (నారాయణుడు పరబ్రహ్మ, ఆ నారాయణి శక్తి, వీరిరువురు వ్యాపకావధిసంశ్లేషము వలన ఏకతత్త్వమనునట్లుందురు) అని, 'అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా' (సూర్యునితో వెలుతురు వేరైనది కానట్లు నేను రాముని కంటె వేరు కాను. రామా - సుందర. 21-15) అని, 'కంచుకముతో కూడిన స్తనములను కల్గిన' (తిరువిరుత్తము - 53) 'లక్ష్మీదేవితో, భూదేవితో కూడి నిలువ' అని పల్కురీతిలో నిత్యానపాయినియై, వక్షఃస్థలమున వేంచేసియుండుటచే ఇపుడు అభిషేకమను ఒక నెపమునుగొని వేంచేసి నీ ఎదపై అలంకరించిన ఎట్టికలువల మాలను ఇట్లు విన్నవింప వీలగునట్లున్నది. ఎట్లనగా -

**అత్యాయతేత్యాది** - స్వామీ! 'విశాల వక్షఃస్థలశోభి లక్షణమ్' (విశాలమైన వక్షఃస్థలమున ప్రకాశించు శ్రీవత్సమును లక్షణమును కలవాడవు - స్తోత్రరత్నే - 32) అనియు, 'పీనవక్షాః విశాలాక్షః' (బలమైన వక్షస్సును కలవాడు, విశాలములైన కన్నులను కలవాడు - రామా. బాల. 1-11) అని, 'కవాట విస్తీర్ణ మనోరమోరః' (కవాటమువలె విస్తీర్ణమైన, అందమైన వక్షస్సును కలవాడు) అని, నాకు పురుషకారభూతయగు లక్ష్మీదేవి చేరునట్టి వక్షఃస్థలమును కల స్వామీ' (తి.వా. 7-2-9) అని, 'కొండవంటి దివ్య వక్షఃస్థలమున' (కలివైరిసూరి సూక్తము 8-5-2) అనియును పల్కురీతిలో దేవేరికి బంగారుప్రాకారమై, మిక్కిలి విస్తరించియున్న నీ వక్షఃస్థలమున అలంకరించిన ఎట్టికలువ 'వేదాంతా

స్తత్త్వచింతా మురభిదురసి యత్పాద చిహ్నైస్తరంతి' (వేదాంతములు విష్ణువు వక్షఃస్థలములోని ఏ లక్ష్మీదేవి పాదముద్రలచే పరతత్త్వచింతను దాటుచున్నవో - శ్రీగుణరత్నకోశే - 4) అని, 'పద్మనివాసిని నివసించు వక్షఃస్థలమును కలవాడా' (తివా. 6-10-10) అనియు నుడువునట్లు తాము కోరిన విధమున విహరించు చుండు దేవేరి యొక్క మాణిక్యమంజీరముల ప్రకాశము యొక్క పరంపరవలె ఉన్నది.

**అవతారిక:-**

**శ్లో॥ రంగేశ రజనీ చర్ణా రాజతే తవ వక్షసి।**
**దేవ్యా హిరణ్యవర్ణాయాః దేహకాంతి రివోత్థితా॥ 20**

స్వామి!సర్వజగత్ కారణభూతుడవై, సర్వస్వామివై, సర్వకర్మ సమారాధ్యుడవై, సర్వరక్షకుడవై, సర్వశేషివై, సర్వోపాస్యుడవై, సర్వనియామకుడవైయున్న నీవు 'చైత్ర శ్రీమానయం మాసః పుణ్యః పుష్పిత కాననః' (ఈ చైత్రమాసము శోభను కల్గినది, పవిత్రమైనది, పుష్పించిన వనములను కల్గినది - రామా. అయో. 3-4) అనునట్లు నీవలె శ్రీమంతమై, పావనమై, 'సర్వగంధః సర్వరసః (పరబ్రహ్మ అన్ని గంధముల రూపమైనవాడు, అన్నిరసముల రూపమైనవాడు - ఛాందో. 3-14-2) అని చెప్పబడు నీ వలె భోగ్యమైన ఈ మాసమునందు పూలు ముడుచుకొని, 'వసంతే వసంతే యజేత' (ప్రతి వసంతమున యాగము చేయవలెను - ఆపస్తంబశ్రౌత సూత్రము) అని పల్కురీతిలో నీవును ఒక యజ్ఞమును చేయుటకు దీక్షగొని, 'శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా' (వేదములు, స్మృతులు నా ఆజ్ఞయే - విష్ణుధర్మే. 6-31) అని నుడువునట్లు నీ ఆజ్ఞారూపమైన వేదము యొక్క అర్థములకు ఉపబృంహణమైన శ్రీభగవచ్ఛాస్త్ర (పాంచరాత్ర) క్రమముతో 'యజ్ఞేన యజ్ఞ మజనయంత దేవాః' (యజ్ఞ రూపుడైన విష్ణువుతో దేవతలు యజ్ఞమును ఉద్భవింపచేసిరి. - పురుషసూక్తే. ) అను విధమున నీవు నిర్వహించునదియు యజ్ఞమై, అందు నేనే ప్రాప్యము ప్రాపకమును అగుదును' అను ఈ రహస్యమును ప్రకటింపగోరి అభిషేక మాడుటకు వేంచేయు నీ వక్షఃస్థలమున అలదిన హరిద్రా చూర్ణము ఇట్లు పలుకతగినట్లున్నది.

'నాకు పురుషకారిణియైన లక్ష్మీదేవి చేరు వక్షఃస్థలమును కల స్వామీ' (తి.వా. 7-2-9) అని, 'పద్మనివాసిని నివసించు వక్షఃస్థలమును కలవాడా' (తి.వా. 6-10-10) అని, 'లక్ష్మీదేవికి అద్వితీయుడైన నాయకుడనెడి గొప్పతనమును కల స్వామి' (తి.వా. 1-6-9) అని వచించిన అభియుక్తుల సూక్తుల చొప్పున, 'హిరణ్యవర్ణాం హరిణీమ్' (బంగారు వన్నెను కల్గినది, మనోహారిణి - శ్రీసూక్తము) అని పల్కుశ్రుత్యర్థము యొక్క రీతిలో నీ వక్షఃస్థలమున వేంచేసియున్న హిరణ్య వర్ణయగు లక్ష్మి (దేవేరి యొక్క) దివ్యదేహము యొక్క ప్రభవలెయున్నది.

**అవతారిక:-** భట్టరు ఒకానొక సమయమునందు రేవతీ నక్షత్రములో శ్రీరంగనాథుని అర్చామూర్తి అభిషేకమును స్వీకరించుటను, ఒక గొప్ప యాగమును నిర్వహించి, చివరలో యజమానుడు అవబృథస్నానము చేయునట్లుగా ఒక శ్లోకమున రూపణమును చేసిరి. శ్రీరాముని యజమానిగా, రావణవధను యాగముగా, మిగిలిన పలు కథాంశములను యాగములోని అంశములుగా వర్ణించు అందము భట్టరుకు మాత్రమే సొంతము.

**శ్లో॥ సర్వస్మాత్ పర! సాంపరాయనవనే శక్తి స్తవేచ్ఛాత్మికా**
**పత్నీ పాత్రగణాశ్చ హేతివతయః ప్రాప్తర్త్విజో బాహవః।**
**పౌలస్త్యాః పశవో దశాననముఖాః రక్షాఫలం జ్ఞానినాం**
**శ్రీమన్! మజ్జనకైతవాత్ అవబృథ స్నాతేవ రంగేశ్వర॥ 21**

**'శ్రీ సేవా' వ్యాఖ్యా:**

స్వామీ! 'యస్సర్వజ్ఞః సర్వవిత్' (ఎవడు అన్నిటిని తెలిసినవాడో, అన్నింటిని పొందువాడో-ముండక. 1-1-10) అని, 'పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికే జ్ఞానబల క్రియాచ'' (పరబ్రహ్మ యొక్క స్వాభావికమైన శక్తి వివిధమైనదిగా వినబడుచున్నది. జ్ఞానము, బలము, క్రియలను కల్గినది-శ్వేతా-6-8) అనియు, ''మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ' (నాకంటె మిక్కిలి గొప్పదైనది

వేరొకటి కొంచెమైనను లేదు ఓ ధనంజయా! భగ. 7-7) అనియు పల్కు రీతిలో సర్వజ్ఞుడవై, సర్వశక్తివై, అవాప్త సమస్త కాముడవైన నీవు లీలావిభూతియగు ఈ లోకమున - 'రావణో నామదుర్వృత్తో, రాక్షసో రాక్షసేశ్వరః' (దుష్టచారిత్రుడైన, రావణుడను ప్రసిద్ధిని కల రాక్షసుడు, రాక్షసుల ప్రభువు - రామా. యుద్ధ. 17-10) అనునట్లు నీ నాభీకమలమునందు ఉత్పన్నుడైన బ్రహ్మయొక్క మానవపుత్రుడగు విశ్రవసువు అను మహర్షికి రావణుడను పేరును కల రాక్షసరాజు పుత్రుడై జనించెను. 'నైనం సూర్యః ప్రతిపతి పార్శ్వేవాతి న మారుతః, చలోర్మి మాలీతం దృష్ట్వా సముద్రో2పి న కంపతే' (అతనిని సూర్యుడు తపించుటలేదు, అతని పార్శ్వమునందు వాయువు వీచుట లేదు. చలించు కెరటములను కల సముద్రుడు అతనిని చూచి చలించుటలేదు. రామా. ) అను రీతిలో అతని ఆజ్ఞకు వశమై సూర్యుడును తన కిరణములను పూర్తిగా ప్రకాశింపచేయుట లేదు. వాయువు స్పర్శించుటకును భయపడును. మృత్యువు తాను భయహేతువై యుండగా, భయము తనదిగా గొని, అతని నియమనమునందు వర్తించు చుండును. సముద్రుడును అతని ముద్రాధారణమును చేయువాని వలె స్తంభించి యుండును. స్థాణువును సకలములైన ఆశలతో కల్పించియు, వైశ్రవణుని శ్రవణ రహితుని వలె అధ్యవసించి, అతని పుష్పకమును తనదిగా చేసికొనియు యజ్ఞము లను చెఱచియు, ఋషులను బాధించియు, ఇట్లు పలు దుర్వృత్తులను కలవాడగుటచే బ్రహ్మాది సకలదేవతలును తప్తులై, 'ఛాయావృక్షమివాధ్వగః' (దారిలోనున్న ఛాయావృక్షమునువలె) అని పలుకు విధముగ సమస్త తాప హరుడవగు నిన్ను శరణుజొచ్చిన సమయములో 'తతః పద్మపలాశాక్షః కృత్వాత్మానం పితరం రోచయామాన తదా దశరథం నృపమ్ చతుర్విధమ్' (అంత పద్మ పత్రముల వంటి కన్నులను కలవాడు తనను నాల్గు విధములుగా చేసికొని, తండ్రిగా అపుడు దశరథుడును రాజును వరించెను. రామా. - బాల. 15-31) అని నీవు దశరథాత్మజుడవై అవతరించినవాడవైన కాలమున దశముఖుడు హిరణ్యాపహారమును చేయువారి వలె, హిరణ్యవర్ణయగు సీతాదేవిని సౌందర్యము కారణముచే కొనిపోగా, నీవును మహారాజుతో (సుగ్రీవునితో) బయలుదేరి జల(డ) ప్రకృతియైన సముద్రమును బంధించి, అదాక్షణ్య పరుడవగుటచే యుద్ధమున

దీక్షను కలవాడవై, వేంచేసితివి. ఆ శ్రమముతీర జన్మదివసమున అభిషేకమును స్వీకరించ వేంచేసియుండుట యజమానుడొకడు యజ్ఞమొనర్చి పూర్తిచేసి, అవబృథమును చేయునట్లు తోచుచున్నది. ఎట్లనగా-

**సర్వస్మాత్ వర! సాంపరాయ సవనే శక్తిః తవేచ్ఛాత్మికా పత్నీ**- 'ఇచ్ఛాశక్తి రియం లక్ష్మీః' (ఈ లక్ష్మి ఇచ్ఛారూపమైనది) అనునట్లు ఇచ్ఛాశక్తి పత్నిగా, (పాత్ర గణాశ్చ హేతిపతయః) - 'దశయజ్ఞాయుధాన్యస్య చక్రాదీన్యాయుధానిచ' (ఇతనియొక్కపది చక్రాది ఆయుధములును యజ్ఞాయుధములు అనగా యజ్ఞ పాత్రలు) అనురీతిలో దివ్యాయుధముచే యజ్ఞ పాత్రలుగా

**ప్రాప్తర్త్విజో చాహవః** - 'చత్వార ఋత్విజ స్సముత్తిష్ఠంతి' (నలుగురు ఋత్విక్కులు లేచుచున్నారు), 'ఋత్విజ ష్షోడశ భుజాః' (పదునారు బాహువులు ఋత్విక్కులు) అని చెప్పునట్లు బాహువులు ఋత్విజులుగా

**పౌలస్త్యాః పశవః దశాననముఖాః** - 'స్వభక్త ప్రత్యనీకాయే పశవో2త్ర ప్రకీర్తితాః' (తన భక్తులకు విరోధులను వారెవ్వరో వారు ఇచట యాగ పశువులుగా కీర్తింపబడిరి) అని పల్కు విధమున రావణకుంభకర్ణాదులు పశువులుగా, కుంభ నికుంభాదులు సమిత్తులుగా, నీ జ్యోతిః ప్రవాహము అగ్నిగా,

**రక్షాఫలం జ్ఞానినామ్** - సత్పురుషుల విషయమైన నీ నిర్హేతుక కృప దక్షిణగా

**శ్రీమన్ మజ్జన కైతవాత్ అవబృథ స్నాతేన రంగేశ్వర** - కావున ఇట్లు సాంగఫలయుక్తమైన సంగ్రామ యజ్ఞమును పూర్తిచేసి, అవబృథస్నాన మొనర్చి వేంచేసియున్న సన్నివేశమువలె నున్నది.

**అవతారిక:**- ఒకానొక అమావాస్యలో అభిషేకమాడిన శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తిని భట్టరు అమావాస్య లక్షణములకు తులతూగునట్లు శ్లేషభంగిమలో స్తుతించిరి.

**శ్లో॥ క్రియాదర్శే దర్శీకృతమఖ విధీనా ముపగతే**
**ప్రవృత్తస్నానత్వం పరముదయసే రంగతరణే।**

**ప్రకర్షేణోద్బుద్ధ ద్విజకుల మశేషం ప్రతిదిశం**
**ప్రహృష్టా పద్మోర్వీ భవతిచ జగత్ ధ్వస్త తిమిరమ్॥ 22**

**శ్రీ సేవా వాఖ్యః-**

స్వామి! 'విశ్వం విష్ణుః' (విశ్వము అనగా-అన్ని విధముల పూర్ణుడు, విష్ణువు - విష్ణు సహస్రనామ స్తోత్రే) అని, 'విశ్వం నారాయణం దేవమ్' (విశ్వ రూపుని, నారాయణుని దేవుని' (తైత్తి. నారాయణమ్) అని, 'విశ్వం నారాయణం హరిమ్' (విశ్వరూపుని, నారాయణుని, హరిని - తైత్తి - నారాయణమ్)అని, 'విశ్వమేవేదం పురుషః '(ఈ విశ్వము పురుషుడే-తైత్తి-నారాయణమ్), 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్' (దానిని సృష్టించి, దానినే అనుప్రవేశంచెను. తైత్తి-ఆనంద-6), ' అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః' (లోపల బయటను దానిని నంతయు నారాయణుడు వ్యాపించియున్నాడు - పురుషసూక్తే. ) అనియును చెప్పునట్లు నీవే విశ్వమై, నీవే విశ్వమును సృష్టించి, దానికి అంతర్యామియై, 'రంగనాథా! జగన్నాథా' (రంగనాథా! జగన్నాథా!) అని, 'కెఱటములు ఉవ్వెత్తుగా ఎగసిపడు సముద్రముచే పరివేష్ఠితమైన భూమిని, పరమపదమును, వానిలో ఏదియు కొఱతపడకుండునట్లు పాలించునట్టి స్వామి అధికారదండమును కల శ్రీ రంగములోని శ్రీమంతుడు' (గోదా సూక్తము. 11-3) అనియు నుడువునట్లు జగన్నాథుడవై వేంచేసియున్న నీవు ఈ అమావాస్యలో అభిషేకమును స్వీకరింపగా, విశ్వమును 'మాతాపిబతి కషాయమ్' (తల్లి కషాయమును త్రాగును, బిడ్డ రోగము తీరును) అను న్యాయముతో స్నాతమై, సుఖించినదైయున్నది. అదెట్లనగా-

**క్రియాదర్శేదర్శే కృతమఖ విధీనాముపగతే ప్రవృత్తస్నానస్త్వం పరముదయసే** - 'శ్రుతిఃస్మృతిర్మమైవ వాజ్ఞా' (శ్రుతియు, స్మృతియూ నా ఆజ్ఞయే-విష్ణుధర్మే 6-31) అని నీయొక్క సంకల్పానుసారమే నడచుకొని, నీ ఆజ్ఞాపరిపాలనమును చేయువారి యొక్క కార్యములలో నీవును కల్పించుకొనునట్లున్నది. అది ఏ విధముగాననిన - వారు ఈ దర్శలో అనగా అమావాస్యలో ఇష్టి-పార్వణాది విధ్యనుష్ఠాన క్రమమును స్పష్టముగా గ్రహించుటచే, ఈ దర్శను-అనగా అమావాస్యను వారికి ఆదర్శమని చెప్పతగినట్లున్నది. ఇట్టి దర్శలో (అమావాస్యలో) అభిషేకమాడి వేంచేసియున్న నీవును ఇందువెలుగుచున్నావు.

**రంగతరణే ఉదయసే** - నీ ఉదయమును కూడ ఇందు దర్శింప తగినట్లున్నది. దర్శలో ఆదిత్యోదయమున సర్వకృత్యములును విశ్వమున చూడతగినట్లున్నవి.

**ప్రకర్షేణోద్బుద్ధ ద్విజకుల మశేషం ప్రతిదిశమ్** - ఆదిత్యోదయమున సర్వ పక్షజాతములును అన్ని దిక్కులయందు నిద్రను విడచి, మేల్కొనును. నీ ఉదయము వలన బ్రాహ్మవర్గమంతయు అత్యంతము ప్రబోధమును కల్గినదై యున్నది.

**ప్రహృష్టా పద్మోర్వీ** - ఆదిత్యోదయమున పద్మోర్వి ఉండును. పద్మము క్షేత్రము. అది వికాసమును కల్గినదైయుండును. నీవు అభిషేకమాడి, వెలుగుచుండగా - 'పద్మాలయా పద్మా' (పద్మమును ఆలయముగా కల్గినది, పద్మ అనబడుచున్నది - అమరకోశే) అనునట్టి లక్ష్మియు, ఉర్వియగు భూదేవియును ప్రహృష్టులు అగుచున్నారు.

**జగత్ ధ్వస్త తిమిరమ్** - ఆదిత్యోదయమున విశ్వము అంధకారము తొలగినదగును. నీవు అభిషేకమాడిన తీర్థప్రభావముచే ప్రాణి సమూహము తిమిరము (పాపములు) నశించుచున్నవి. కావున ఇట్లు వేంచేసియున్న సన్నివేశము అభిషేకమును వ్యాజముతో ఆశ్రితుల సకల పాపములను పోగొట్టవలయునని తలచి, ఉద్యమించి వేంచేసియున్న స్థితివలె ఉన్నది.

**అవతారిక:-** సకలశాస్త్రపారంగతులైన భట్టరు శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తిని కొన్ని సందర్భ విశేషములలో కొన్ని శాస్త్ర విషయముల పురస్సరముగా, వానితో ఉపమించి తమకే తగిన పద విన్యాసముతో అద్భుతమైన కవిసరణిలో రసికుల మనస్సులను కొల్లగొట్టురీతిలో శ్రీరంగరాజస్తవ-ఉత్తర శతకమున విస్తృతముగా గమనించి ఆనందింపవచ్చును.ఈ రీతిలో జ్యోతిశ్శాస్త్రమున తమకు గల పాండిత్యమును ప్రకటించి, ఒకానొక అర్ధోదయ పుణ్యకాలమునందు అభిషేకమును స్వీకరించిన శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని ఆ పుణ్యకాలమునకు

సమానముగా శ్లేష భంగిమలో ఒక చక్కని శ్లోకము ద్వారా వర్ణించిరి.తిథి, వారము, నక్షత్రము, మాసము అను వీనియొక్క ఒక్కొక్క విధమైన చేరిక ఒక్కొక్క పుణ్యకాలముగా జ్యోతిశ్శాస్త్రమున తెలుపబడినది. అమావాస్య, ఆదివారము, శ్రవణా నక్షత్రము ఈ మూడును కలసినచో వ్యతీపాతమనబడును. అది నూరు సూర్యగ్రహణములతో సమానము. ఈ వ్యతీకాలమునకు అర్ధోదయమని పేరు. వీని కలయిక ఒక సోమవారమున సంభవించిన ఆ పుణ్యకాలమునకు మహోదయమని పేరు. ఈ రెండు పుణ్యకాలములును పలు ఏండ్లకు ఒక పర్యాయము సంభవించును. శ్రవణానక్షత్రమునకుబదులు అశ్విని, ధనిష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష అను వీనిలో ఏది కలిగినను వ్యతీపాతమనియే పేరు.

ఒకానొక పుష్య మాసములో ఆదివారము, అమావాస్య, శ్రవణా నక్షత్రము - అనునవి చేరిన అర్ధోదయం పుణ్యకాలము సంభవించెను. అపుడు అభిషేకమును స్వీకరించిన శ్రీరంగనాథ - ఉత్సవ మూర్తిని భట్టరు వర్ణించి, ఆ పుణ్యకాలములోని అశేషాంశములను స్వామి యందు ఆరోపించి, శ్లేషప్రక్రియలో ఒక అందమైన శ్లోకమును అనుగ్రహించిరి)

**శ్లో॥ చంద్రార్కౌ రంగధామన్! శ్రవణముపగతౌ చక్షురాకారయోగాత్**
**మాన్యోఽమాసం గమస్తే సదసి బహుమతో మిత్రవారస్య యోగః!**
**కాలోఽయం పుష్యదిష్టో భవతి మయి మహాంస్త్వత్ కటాక్షస్యపాతః**
**త్వత్కాంత్యబ్ధేశ్చ సేతుస్త్వమసి వయమిహ ప్రాప్త తీర్థా భవామ॥23**

స్వామీ! 'పృథివ్యప్సు ప్రలీయతే, ఆపస్తేజసి లీయంతే, తేజో వాయౌ లీయతే' (పృథివి జలములలో లీనమగుచున్నది, జలములు తేజస్సులో లీనమగుచున్నది, తేజస్సు వాయువులో లీనమగుచున్నది సుబాల-2) అను లయ ప్రక్రియతో పృథివ్యంతమైన కార్య వర్గమంతయు తమతమ కారణములలో లయించి, 'అక్షరం తమసి లీయతే, తమః పరేదేవ ఏకీభవతి' (అక్షరము తమస్సులో లీనమగుచున్నది, తమస్సు పరమాత్మలో ఏకమైనట్లు అగుచున్నది- సుబాల-2) అనియు, 'ప్రకృతిర్యా మయాఽ ఖ్యాతా వ్యక్తావ్యక్త స్వరూపిణీ, పురుషశ్చాప్యుభావేతౌ లీయేతే పరమాత్మని' (వ్యక్తావ్యక్త స్వరూపిణాగా నాచే చెప్పబడినదేదియో ఆ ప్రకృతి, పురుషుడు అను వీరిరువురు పరమాత్మలో లీనమగుచున్నారు. వి.పు. 6-4-39) అని, అక్షర సమష్టి వాచ్యమైన జీవసమష్టి ప్రధానతత్త్వమును పరస్వరూపములో లయించి, 'ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాతమలక్షణమ్, అ ప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః' (ఈ లోకము తమస్సులో లయించియున్నదై, అనుమానముచే కూడ తెలియబడరానిదై, తర్కముచే కూడ ఎఱుగబడనిదై, శబ్దప్రమాణముచే కూడ తెలియబడరానిదై, ఏ విధముగానైనను కార్యము సలుప వీలులేనిదై, అంతట నిద్రించినదివలె యుండెను. మను-1-5) అని, 'నాహోనరాత్రి, న నభో న భూమిః' (పగలు లేదు, రాత్రి లేదు, ఆకాశము లేదు, భూమి లేదు) అని, 'న బ్రహ్మ నేశానః నేమేద్యావాపృథివీ' (బ్రహ్మ లేడు, ఈశ్వరుడు లేడు,ఈ దివి, పృథివి రెండును లేవు-మహోపనిషత్), 'దేవతలు, లోకములును ప్రాణులును, మిగిలినవన్నియు ఏమియూ లేని ఆకాలమునందు'(తి.వా. 4-10-1) అనియు చెప్పబడు ప్రళయావస్థలో శ్రీస్తనమువలె, శ్రీకౌస్తుభమువలె, అత్యంత స్పృహా విషయమైన ఆత్మవర్గము అచిత్కల్పమై, ఏ ఒక్క పురుషార్థము నందును అన్వయింపలేని ఆకారమును కల్గియుండుటను గమనించి, 'అచిదవిశేషితాన్ ప్రళయసీమని సంసరతః కరణకళేబరైర్ఘటయితుం దయమానమనాః' (ప్రళయము నందు అచిత్తుకంటే విశేషములేని, సంసారమును చెందు జీవులను ఇంద్రియ దేహములతో కలుపుటకు దయగల మనస్సును కలవాడవై- శ్రీరంగరాజస్తవే- ఉత్తరశతకమే-41) అనునట్లు దయమానమనస్కుడవై కరణ కళేబర ప్రధాన మొనర్చి పురుషార్థములలో అన్వయింపచేసి, ఉజ్జీవింప చేయుటకు మనస్సున నిశ్చయించుకొని, 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజ ఐక్షచ తా ఆప ఐక్షరత' (ఆ పరబ్రహ్మము నేను పలువురిగా అగుదును, జనింతును అని సంకల్పించెను. ఆ తేజస్సును సంకల్పించెను. ఆ జలమును సంకల్పించినవి - ఛాందో. 6-2-3) అనియును, 'స తపో తప్యత' (ఆ పరమాత్మ తపస్సును చేసెను. తైత్తి. భృగువల్లీ. ) అనియు ఈ క్షణ తపః శబ్దాపర్యాయమైన సంకల్పమును చేసి, 'అపహతపాప్మావిజరో విమృత్యుః విశోకో విజిఘత్సోఽపి పానః సత్యకామస్సత్య సంకల్పః' (తొలగిన పాపములను కలవాడు, జరలేనివాడు, మృత్యువులేనివాడు, శోకములేనివాడు, ఆకలి లేనివాడు, దప్పిక లేనివాడు, నిజమైన

కోరికలను కలవాడు, నిజమైన సంకల్పమును కలవాడు - ఛాందో. 8-7-1) అనునట్లు సత్య సంకల్పత్వాది గుణ విశిష్టుడవగుటచే స్వ సంకల్పానుగుణముగా ఈ ప్రపంచమును సృష్టించి, 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్' (దానిని సృష్టించి, ఆ సృష్టినే అనుప్రవేశించెను. తైత్తి. ఆనంద. 6) అనురీతిలో ఈ ఆత్మ వర్గము యొక్క సత్తాస్థితి ప్రవృత్తి నిర్వాహకుడవై రక్షించియు, 'అజాయమానో బహుధా విజాయతే' (కర్మ వశమున జనింపనివాడై, కృపావశమున పలు విధముల జనించుచున్నాడు- పురుషసూక్తే. - 21) అనియు, 'జన్మలేనివాడైన పలుజన్మలను కలస్వామి' (తి.వా.2-9-5) అనియు, 'అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్ ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా' (పుట్టుక లేనివాడనైనను, మార్పులేని స్వభావమును కలవాడనైనను, సర్వభూతలములకు నియామకుడనైనను ఆత్మేచ్ఛతో నా స్వరూపమును నేనే అధిష్ఠించి, జన్మింతును. భగ. 4-6) అనియు పల్కురీతిలో స్వసంకల్పముతో స్వప్రకృతియైన జ్ఞానశక్త్యాది గుణములతో దేవమనుష్యాదులకు వినజాతీయువైయున్నను, తత్సజాతీయుడవై అవతరించి, దుష్టనిరసనాదులతో ధర్మసంస్థాపన మొనర్చి రక్షించుటయేకాక, ఈ యత్నములన్నియు కాలవ్యవధానముల కారణముచే తత్తత్కాలీన పురుషుల వరకే పర్యవసించుటచే ఈ ఆత్మలయొక్క సార్వకాలిక రక్షణమును సంకల్పించి, 'క్షీరాబ్ధేః మండలాత్ భానోః యోగినాం హృదయాదపి, రతింగతో హరిర్యత్ర తస్మాత్ రంగమితి స్మృతమ్' (క్షీరాబ్ధి కంటె, సూర్యమండలము కంటె, యోగుల హృదయము కంటెను, ఎచట హరి ఆసక్తిని పొందెనో, దానివలన రంగమని చెప్పబడుచున్నది. (శ్రీరంగమహాత్మ్యే) అని అత్యర్థప్రియ విషయత్వము వలన ఉభయవిభూతి వ్యాప్తృత్వమైయున్న శ్రీరంగదివ్యక్షేత్రమును ఆదరించి, 'రూపౌదార్య గుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్' (రూపముయొక్క ఔదార్యముచే, సద్గుణములచే పురుషుల దృష్టిని, చిత్తమును అపహరించువాడు, రామా-అయోధ్యా. 3-28) అని సౌందర్యాదిగుణములచే వీరిని ఆనందనిర్భరులను చేసి, వేంచేసియున్న నీవు అర్ధోదయమను కాలవిశేషమునందు అభిషేకార్థము బయలుదేరివచ్చి నిలచిన సన్నివేశము - 'ప్రధానపురుష వ్యక్తకాలాస్తు ప్రవిభాగశః రూపాశి స్థితి సర్గాంత వ్యక్తి సద్భావహేతవః' (ప్రధాన-పురుష-వ్యక్త-కాలములు భగవానుని భిన్న రూపములు, స్థితి-సృష్టి-అంతముల జ్ఞప్తికి, సద్భావమునకును హేతువులు-వి.పు. 1-2-17) అనియు కాలమును శరీరముగా ప్రతిపాదించుటచే ఈ కాల విశేషమును రూపమున వ్యక్తము చేయుచు వేంచేసినిలచియున్న సన్నివేశమువలెనున్నది. అది ఎట్లనగా

**చంద్రార్కౌ రంగ ధామన్ శ్రవణమువగతౌ చక్షురాకార యోగాత్** - స్వామీ! అర్ధోదయమనునది - 'అమార్గ పాద శ్రవణయుక్తాచేత్ పుష్యమాఘయోః అర్ధోదయా స్సవిజ్ఞేయో రాహు సర్వశతాధికం' అనునట్లు పుష్యమాసమున అమావాస్యయు, ఆదిత్యవారమును, వ్యతీపాతమును, శ్రవణానక్షత్రమును కూడియున్నది. 'చంద్రార్కౌచక్షుషీభూమన్' (సూర్యచంద్రులు రెండు కన్నులు) అనియు, 'చంద్రసూర్యేచ నేత్రే' (చంద్రసూర్యులు నేత్రములు- విష్ణు సహస్ర నామ పూర్వపీఠికా)అనియు పల్కునట్లు నీ దివ్యనేత్రములైయున్న చంద్రసూర్యులు ఆకర్ణాంతము 'విస్తరించిన ఆ పెద్దవైన కన్నులు' (అమల నాది పిరాన్-8) అను రీతిలో నీయొక్క కర్ణమును పొందిన వారైయున్నారు. (మాన్యోఽ మాసం గమస్తే) - ఈ కాలమున అమావాస్య యొక్క సంగమము మాన్యమై యుండును. 'నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ' (జగన్మాతయై, విష్ణువునకు సంపదయై యున్నదై, విష్ణువును విడువకనున్నదియైయున్న ఈ దేవేరి నిత్యయే - వి.పు. 1-8-17) అని 'క్షణమాత్రమైనను ఎడబాయుటకు శక్తనుకాను' (తి.వా. 6-10-10) అనియు నుడువు రీతిలో 'మా సంగమః' (అనగా) శ్రీదేవితోడి చేరిక నీకు మాన్యమైయుండును.

**సదసి బహుమతో మిత్రవారస్యయోగః** - ఈ కాలమునకు ఆదిత్య వారముతో కలయిక కాల విజ్ఞులయొక్క గోష్ఠిలోబహుమతమైయుండును. మైత్ర్యాది గుణములను కల్గిన వారైయున్న సాత్త్విక జన సంఘముల యోగము నీ గోష్ఠిలో బహుమతయై యుండును.

**పుష్యదిష్టః కాలోఽయమ్** - ఈ అర్ధోదయమను కాలము పుష్యమాసమున నిర్దిష్టమై యుండును. నీ అభిషేక కాలము సర్వాత్మల యొక్క కోరికలను పోషించు నదియై యున్నది.

**మయి మహాంస్త్వత్ కటాక్షస్యపాతః -** ఈ కాలము వ్యతీపాతమను యోగముతో కలయికను అపేక్షించి యుండును. 'కటాక్షాః కరుణాసాంద్రాః హరేరద్భుత కర్మణః' (అద్భుత లీలలను కల హరియొక్క కటాక్షములు కరుణచే దట్టమైనవి) అను రీతిలో కరణానిబిడములైయున్న నీ కటాక్షపాతములు నా వంటి ఆత్మలందరిపట్ల సంపూర్ణములైయుండును.

**త్వత్ కాంత్యర్ఘో సేతు స్త్వమసి -** ఈ పుణ్యకాలమునకు సేతుదర్శనము ప్రశస్తమైయుండును. నీ లావణ్యమును సముద్రమునకు నీ దివ్యదేహమే సేతువు అని చెప్పతగినట్లున్నది. కావున అకించనులమైయున్న దాసులము 'సద్య స్సముద్రాశ్చ స ఏవ సర్వమ్' (నదులు, సముద్రములను అన్నియు అతడే. వి.పు. 2-12-38) అనునట్లు సకల తీర్థాత్మకుడవై, తీర్థాంతర నిరపేక్షపావన స్వరూపుడవగు నిన్ను దర్శించి, ఆనందించి కృతార్థులమగుచున్నాము. ద్రష్టవ్యాంతరమున- 'బ్రహ్మాండాః తద్వర్తులగు ఆత్మవర్గములకు నిర్వాహకుడు, సంసారమునకు ఆభరణము అగు శ్రీరంగధామమందు శయనించియుండు వాడు, నాకు అమృతమవలె పరమభోగ్యుడగువానిని సేవించిన కన్నులు వేఱొక దానిని చూడవు' - (అమలనాదిపిరాన్. 10) కదా!

**అవతారిక:-** భట్టరు ఒక అభిషేక సమయములో శ్రీరంగనాథుని ఉత్సవ మూర్తిని కాలమేఘముతో పోల్చి ఒక చక్కని శ్లోకమును అనుగ్రహించిరి. వ్యాఖ్యానమున ప్రతిపదార్థ వివరణము మాత్రమే కాక స్వామికి, మేఘమునకు సమములగు అంశములను వివరించి, స్వామియొక్క వైశిష్టములను వర్ణించిరి.

**శ్లో॥ పద్మావిద్యుదలంకృతాంగ విభవం గంభీరనాదాశ్రయం**
**సాంద్రేంద్రోపల కాంతి చోరవపుషా సంతాప విధ్వంసినమ్।**
**కారుణ్యాంబుభరాశ్రయం విదధతం సచ్చాతకానాం ముదం**
**మాన్యం మేఘ మమోఘపూర్ణఫలదం రంగాధిపం మన్మహే॥ 24**

స్వామీ! 'ఏక ఇద్రాజా జగతో బభూవ'(జగత్తునకు ప్రభువు ఒక్కడే ఉండెను- తైత్తి. యజు. 4-1-8) అనియు, 'సర్వమింద్ర ఇదం ప్రశాసి' (ఇంద్రుడా! దీనినంతయు శాసింపుము) అని, 'సర్వస్యేశానః' (అందఱికి ఈశ్వరుడు బృహ- 6-4-22) అని, 'త్రయాణామపి లోకానాం రాఘవో రాజ్యమర్హతి' (ముల్లోకముల యొక్క రాజ్యమును రాఘవుడు తగియున్నాడు)అని, 'కెఱటములు ఎగసిపడు సముద్రముచే ముట్టబడియున్న భూమిని, పరమపదమును, అందు ఏదియు వదలకుండునట్లు పాలించునట్టిస్వామి, అధికార దండమును కల, శ్రీరంగము లోని శ్రీమంతుడు' (గోదాసూక్తము.11-3) అనియు పల్కు విధమున ఆబ్రహ్మస్తంభ పర్యంతమైన అఖిలభువనమునకును అసాధారణ కారణభూతుడ వై, అకారణకరుణా ప్రవర్షి విపులాయతలోచన పాలిత సర్వాశ్రిత వర్గుడవై, నిత్య నిరవద్య పరిణామ పరిపూర్ణ దివ్యవిగ్రహుడవై, అనుగ్రహకరణ జాగరూకుడవైన నీ వైభవమును పల్కి, ముగించుట అను విషయమునందు పదక్రమ ముఖరము లగు వేదములతోపాటు, ముఖ్యమైన చాతుర్యములను కలవాడగు బ్రహ్మతో పాటు, 'సర్వజ్ఞోధూర్జటిః నీలలోహితః (అమరకోశము) అనెడి రుద్రునితోపాటు, అనంతాదులైన అంతరంగపరిజనములతో పాటు, శాఖాసంచారులగు ద్విజ గణములతో పాటు, సమాధిసావధానులై తపఃకరణపరులగు తపోధనులతో పాటు భేదములేక, వర్ణించి ముగింపలేకుండునట్లు అంతులేని అవదానములకన్నిటికిని ఆకరభూతుడవగు నీవు సకల సాత్త్వికులకును నా పట్ల స్నేహప్రవాహము సహ్యము నుండి రావలెనని సహ్యపర్వతము నుండి వచ్చునట్టి కావేరినదియొక్క పరి సరమును సర్వాహనసంకులమగునట్లు ఆ వానముగా ఆదరించి, క్షీరార్ణవ శాయియై నీటిలోని శయనమును ఎఱిగిన వాడవగుటచే, భూమిశయనముయొక్క గొప్పతనమును తెలిసి, అనంతభోగి ప్రవణుడవగుటచే సకల ప్రాణులకును అనంతభోగములను ఇవ్వగల్గిన నీవు, ఇపుడు అభిషేకమును స్వీకరింపగోరి మంత్ర పరిపూతమంగళ కలశ కృతాభిషేకుడవై, నానా వర్ణమాలా కలాపమాంసలుడవై, రాగభరిత కుంకుమ కేసర రాగపాటలిత పవిత్ర గాత్రుడవై, ఐరావతము యొక్క మదధారలవలె నానావర్ణములుగా అలంకరింపబడిన మాలికలను కలవాడవై 'చంద్రమా మనసోజాతః' (చంద్రుడు మనస్సు నుండి పుట్టిన వాడు- పురుష సూక్తము. ) అని అతని ఉత్పత్తి స్థానమును ప్రకటింపతగినట్టి వక్షఃస్థలమున అందిన చందన పంకమును కల్గినవాడవై వేంచేసియున్నట్టి సన్నివేశము ఒక కాలమేఘముతో సామ్యమును పల్కతగినట్లున్నది.

## శ్రీసేవావ్యాఖ్యా

స్వామీ! లోకమున త్యాగశ్లాఘ్యులుగా గ్రహింపబడు కల్పన, కర్ణ, కామధేనువులలో, కల్పకము అందని దేవలోకములోనున్నదై, మిక్కిలి ఎత్తున కొమ్మలను కల్గినదై, దానమిచ్చునపుడును పంచత్వాపన్నమైయుండును. కామధేనువును వశిష్ఠునకు మాత్రమే వత్సలయై, ప్రదానమున ఆగిఆగి ఇచ్చునదియై, ఇచ్చునపుడును (చన్నులు క్రింద ఉండుటచే) అధోముఖముగా ఇవ్వగల్గినదై, మేయుచోట కూడ తనకు, తన బిడ్డకు అనుచు పోవును. 'ధ్వజం కర్ణః' అనునట్లు అపరాగమున (విరోధమున) కర్ణుని ఆకర్ణనము చేయకూడనట్లు కానీనుడగుటచే (కన్యకాపుత్రుడగుటచే) అతని దానమును కన్యాగర్భమై యుండును. ఇట్లుకాక కాలమేఘము మెఱపుచే అలంకృతమైన స్వాంగమును కల్గినదై, గంభీరమైన పిడుగుపాటు ధ్వనిని కల్గినదై, ఇంద్రనీలరత్నశిలవలె దట్టమైన నీలవర్ణముచే ప్రకాశించు మేనిని కల్గినదై, సస్యరాసుల సంతాపములను పోగొట్టునదియై, జలభరభరితమై, చాతక పక్షులకు సంతోషమును కల్గించనదియై, పూర్ణసస్యాది ఫలప్రదమైయుండును.

స్వామి! నీవన్నచో, 'మెఱపుతో కూడినదియు, మిక్కిలి చల్లనిదియు, ఎగిరి వచ్చునది యగు మేఘము వంటి రూపమును కలిగినవాడవు' (తిరునెదున్దాణ్డకమ్ -30) అగుటచే 'క్షణమైనను ఎడబాటును సహింపశక్తురాలను కాను అనెడి పద్మావతీదేవి నిత్య నివాసముచేయు వక్షఃస్థలమును కలవాడు' (తి.వా. 6-10-10) అనునట్లు లక్ష్మీదేవి అను మెఱపుతీగతో అలంకృతమైన దివ్యరూపమును కలవాడై, 'యుద్ధరంగమున సైన్యములో ప్రవేశించి ధ్వనించు (గర్జించు) ఆ పాంచజన్యము' (పల్లాణ్డు-1) యొక్క దివ్య గంభీరఘోషణముఖురుడవై, ఆ ఘోషతో ఆశ్రితులగు మయూర సమూహములను ఆనంద నిర్భరులగునట్లు చేయగల్గినవాడవై 'నల్లమాణిక్య పర్వతము' (తి.వా. 8-9-1) అనునట్లు నీలరూపధారుడవై, సకల ప్రాణులనుసస్యముల సంతాపమును తీర్చువాడవై, కారుణ్యాంబు భరాక్రాంతుడవై, సత్పురుషులను చాతకములను సంతోషింపగల్గినవాడవై, విపరీతులై, తామసరాజసులగు రాజహంసకులములను పారద్రోలగల్గినవాడవై ఆమేఘమువలె నశ్వరఫలప్రదుడవుకాక, శాశ్వత ఫలప్రదుడవై, ఇట్లు అందమైన 'అళగియమణ వాళప్పెరుమాళ్' (శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి) అనబడు కాలమేఘము ముందుగా వచ్చి నిలచిన స్థితివలె ఉన్నది.

**అవతారిక:-** ఈ శ్లోకమును గూర్చి పూర్వాచార్యుల పరిభాషలో చెప్పవలె నన్న 'ఇది కదా అభిషేక శ్లోకము' అని చెప్పనగును. శబ్దమాధుర్యము, అర్థ మాధుర్యము, గాంభీర్యము, సంప్రదాయ వివరణము, సిద్ధాంతసారము, వైష్ణవ మతతత్త్వము, కవితారసము, ఉన్నతమైనశాస్త్రార్థము, లౌకికరీతి అన్నియు కలిగి ముప్పిరిగొన్న ఈ శ్లోకరత్నము రసికజనుల చిత్తములను కొల్లగొట్టి, దానికి మారుగా సకల పూర్వాచార్యులచే, విద్యాంసులచే, కవులచే, వ్యాఖ్యాతలచే (పలుమార్లు ప్రమాణముగా ఊట్టంకింపబడుట ద్వారా) కొల్లగొట్టబడుచున్నది అనునట్లు మిక్కిలిగా సేవించబడినది.

ఈ శ్లోకమున శ్రీరంగనాథుని ఉత్సవమూర్తికి, ఒకచేతనునకు మధ్య ఆ చేతనుడు ఎవరి సొత్తు? అను విషయమును గూర్చి గొప్ప వివాదము ఏర్పడగా, భగవానుడు పలు ప్రమాణములను చూపి తనదే సొత్తు అని వాదులాడగా, చేతనుడు దానిని నిరాకరింప చివరగా లోకరీతిలో ఒకే ఒక ఆర్ద్ర వస్త్రమును ధరించి తులసిమాలతో భగవానుడు 'నీవు నాకు సొంతమైన సొత్తు, దానిని నేను ప్రమాణము చేయుటకు సిద్ధపడుచున్నాను. సుమా!' అని పల్కి ప్రమాణముచేయు సన్నివేశమున నున్నట్లు భట్టరు ఉత్ప్రేక్షించి శ్లోకమును అనుగ్రహించిరి. ఇపుడును అభిషేక సమయమున భగవానుడు (అన్ని దేవాలయములలో) ఏకవస్త్రధారియై, తులసిమాలతో సేవను అనుగ్రహించుటను చూచి, అనుభవింపవచ్చును. ఇందలి ఒక రసానుభవమును రసికులు అనుభవించుటను తప్పరాదు. భగవానుడు 'త్వం మే' అనిన వెంటనే జీవుడును బదులుగా 'త్వం మే' అని పల్కియున్నచో స్థితియో వేరుగా నుండెడిది. వివాదమే లేకుండా పోయేది. ఏల అనగా, జీవుడు భగవానుని చూచి 'నీవు నా సొత్తు' అన్నచో భక్తవర తత్పరుడగు భగవానుడు వాదులాడుటకు దారిలేక 'అవును' అని సంతోషపడియుండును. భక్తులసొత్తే భగవానుడనుటలో ఎవరికైనను ఆక్షేపముండుట న్యాయము కాదు. అట్లుకాక, చేతనుని నోటతో 'అహం మే' అను మాటను పల్కించి కవి వివాదమును బలపఱచి రసికజనులను పరవశులను

చేసిన అందము భట్టరు ఒక్కరికే తగిన గొప్పదనము కదా!. ఇక శ్లోకమును గమనించెదము.

**శ్లో॥త్వం మ్యేహం మే కుతస్తత్ తదపికుత ఇదం వేదమూలప్రమాణాత్**
**ఏతచ్చానాది సిద్ధాదనుభవవిభవాత్ తర్హి సాక్రోశ ఏవ!**
**క్వాక్రోశః కన్య గీతాదిషు మమవిదితః కోఽత్రసాక్షీ సుధీస్స్యాత్**
**హంత త్వత్పక్షపాతీ స ఇతి నృకలహే మృగ్యమధ్యస్థవత్ త్వమ్॥**

స్వామీ! 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' (హ్రీదేవియు, లక్ష్మీదేవియును నీకు ఇద్దఱు పత్నులు-తైత్తి.నారా.  ) అనియు, 'వైకుంఠేతు పరేలోకే శ్రీసహాయో జనార్దనః ఉభాభ్యాం భూమి నీళాభ్యాం సేవితః పరమేశ్వరః' (పరమపదమగు వైకుంఠమున శ్రీదేవితో కూడిన జనార్దనుడగు పరమేశ్వరుడు భూదేవి, నీళాదేవులను ఇద్దరిచే సేవింపబడుచున్నాడు-విష్వక్సేనసంహితా.  ) అని, 'రూపములో సాటిలేని కమలావాసినియైన లక్ష్మీదేవి, అట్టి స్వభావమునే కల భూదేవి స్పృశించ తగిన మృదువైన పాదములను'(తి.వా. 9-2-10) అనియు, 'శ్రీదేవి, భూదేవియు ఇరువైపులా ప్రకాశింపగా' (కవివైరిసూరి-సూక్తము.3-10-1) అనియు పల్కురీతిలో లక్ష్మి భూమి నీళా నాయకుడై' యతోవా ఇమాని భూతాని జాయంతే'' (ఎవని వలననే ఈ ప్రాణులు పుట్టుచున్నవో-తైత్తి.భృగు-1) అనియు, 'స దేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్'' (చంద్రుని వలె సంతోషమును కల్గించువాడా! సృష్టికి పూర్వము ఈసత్తు మాత్రమే ఉండెను. ఛాందో.6-2-1) అనియు, 'సకారణం కరణాధిపాధిపః' (అతడు కారణము, కరణాధిపుడగు ఆత్మకు అధిపతి శ్వేతా-6-9) అనియు, 'స్థితి సంయమకర్తాఽసౌ జగతోఽన్య జగచ్చ సః' (ఈ జగత్తు యొక్క స్థితి, నియమనముల కర్త ఇతడు, లోకమును అతడే-వి.పు. 1-1-31) అనియు, 'అద్వితీయ రూపమును కలవాడై, త్రివిధకారణమును తానై' (తి.వా 1-5-4) అనియును పల్కు విధమున సకల జగత్కారణభూతుడై'' అవహత పాప్మావిజరో విమృత్యు ర్విశోకోఽ విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః' (తొలగిన పాపములను కలవాడు, జరలేనివాడు, మృత్యువు లేనివాడు, శోకములేనివాడు ఆకలి దప్పికలు లేనివాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు. ఛాందో. 8-7-1) అనియు, 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబల క్రియంచ' (ఈ పరమాత్మ యొక్క స్వాభావికమైన శక్తి వివిధమైనదిగానే వినబడుచున్నది. అది జ్ఞానము, బలము, క్రియలను కల్గినది. శ్వేతా. 6-8) అని, 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' (పరబ్రహ్మ సత్యస్వరూపుడు, జ్ఞాన స్వరూపుడు, అనంతుడు తైత్తి. ఆనంద. 1) అని, 'సమస్త కల్యాణ గుణాత్మకః' (అన్ని కల్యాణ గుణములను స్వభావముచేతనే కలవాడు వి.పు. 6-5-84) అనియు, 'గుణానా మాకరో మహాన్' (గుణములకు గొప్పగని రామా-కిష్కింధా 15-20) అని, 'బహవో నృప! కల్యాణగుణాః పుత్రస్య సంతితే' (రాజా! పలు కల్యాణ గుణములు నీ కుమారునకు కలవు-రామా. అయో 2-26) అనియు, 'వశీ వదాన్యో గుణవానృజుః శుచిః' (అన్నిటిని తన వశమున కలవాడు, వదాన్యుడు, గుణములను కలవాడు, ఋజువైన వాడు, భావశుద్ధిని కలవాడు, స్తోత్రరత్నే - 18) అని మొదలిడి 'సమస్త కల్యాణగుణామృతోదధిః' (అన్ని కళ్యాణ గుణములును అమృతమునకు సముద్రము-స్తోత్రరత్నే. 18) అనియు, 'దయాక్షాంత్యౌదార్య' (దయ, క్షాంతి, ఔదార్యము-వరద రాజస్తవే. 19) అని ఉపక్రమించి 'సులభతాద్యాః పరగుణాః' (సౌలభ్యము మొదలగు గొప్పగుణములు-వరదరాజస్తవే. 19) అనియు, 'మఱపు మొదలగు దోషములు లేని నిత్య సూరులకు అధిపతి' (తి.వా. 1-1-1) అనియు, 'పరమపదములో నిత్యసూరులు పరిశుద్ధమైన తీర్థముతో అభిషేకమొనర్చి, పవిత్రమైన, సమర్పింపతగిన పూమాలికలను గొని, మంచి పరిమళము కల సాంబ్రాణి మొదలగువాని పొగను సమర్పించుచు నిలచియుండగా - తిరు విరుత్తము. 21) అనియును చెప్పు విధమున నిత్యసూరులచే అనవరతముగా వరిచరింపబడునట్టి చరణనళినయుగళుడవై యున్నాను 'స్వ ఏకాకీ న రమేత' (అతడు ఒంటరివానివలె ఆనందింపలేడు-మహోపనిషత్.  ) అనునట్లు తిన్నది ఒంటికి పట్టనట్టు, దేశాంతరగతుడగు పుత్రుని పట్ల పితృహృదయముండునట్లు సంసారి చేతనుల పట్ల మనస్సు స్థిరముగా నిలచి 'అనుగ్రహాయ పుణ్యానా మాస్థితోఽకుంఠమహం ప్రభో, క్షీరోదం మండలం భానోః ఔపేంద్రం శతధా దివి' (ప్రభూ!, పుణ్యాత్ములను అనుగ్రహించుట కొఱకు అకుంఠమగు వైకుంఠమును, క్షీరసాగరమును, సూర్యమండలమును, ఉపేంద్రుని రూపమును

ఇట్లు పలు విధములుగా దివిలో పొందియున్నాను)అనియు, 'అవతార రహస్యాని కల్పే కల్పే కరో మ్యహమ్, (ప్రతి కల్పమందు అవతార రహస్యములను నేను చేయుదును) అనియు, 'ప్రజానా మనుకంపార్థం పునరర్చాత్మనా భువి' (ప్రజల యొక్క అనుగ్రహము కొఱకు తిరిగి భువిలో అర్చారూపమున), 'అవతారమునకు తరువాతి వారు ఆశ్రయింపతగిన జ్యోతియై - తిరునెడున్దాణ్డకమ్-10) అనియు సకల చేతనోజ్జిజీవిషచే పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చాదులలో అత్యంత సులభమై చతుర్ముఖ-ఇక్ష్వాకు ప్రభృతి దశరథనందన విభీషణ ధర్మవర్మ తపః ఫల భూత శ్రీరంగేశయ రూపమున అవతరించి, 'ఆద్యం ప్రోక్తం స్వయం వ్యక్తం విమానం రంగ సంజ్ఞికమ్' (మొదటి స్వయంవక్తముగా శ్రీరంగవిమానము చెప్పబడినది-శ్రీరంగమహాత్మ్యే. ), 'అందమైన మత్స్యములు విహరించు నీటిని కల శ్రీరంగము' అని, 'కోయిలలు కూయు, చల్లని పూపొదరిండ్లచే పరివేష్ఠితమైన శ్రీరంగము' అని, 'విషయాంతర సంగరహితులగు వారు పరివేష్ఠించి, నివసించు చోటు అగు అందమైన చల్లని తీర్థమును కల శ్రీరంగము' (తిరుచ్చందవిరుత్తము-52) అనియు పల్కురీతిలో భగవదభిమతములైన శ్రీరంగమున వేంచేసియున్న నీవు ఈ విశేషోత్సవమునందు అభిషేకమాచరించి నిలచియున్న సన్నివేశము ఇట్లు విన్నవించవీలగునట్లున్నది. అదెట్లనగా-

**త్వం మే** - ఇత్యాది 'ఏకోహవై నారాయణ ఆసీత్' (నారాయణుడొక్కడే ఉండెను-మహోపనిషత్. ) అనియు, 'ఏక ఏవా భవ తత్ర దేవో నారాయణః ప్రభుః' (అచట దేవుడును, ప్రభువును అగు నారాయణుడొక్కడే ఉండెను) అని పల్కురీతిలో సకల జగత్కారణభూతుడవగు నీకు 'మాటి మాటి పలు జన్మలను జన్మించి' (తి.వా. 2-6-8) అని వచించు విధమున జన్మపరంపరలలో మగ్గుచూ నిత్య సంసారియైయున్న నీవు పలుకగా 'అహం మే' దేహాత్మాభిమాని యైన నేను' ఈశ్వరో2హ మహం భోగీ' (నేను ఈశ్వరుడను, నేను భోగములను అనుభవించువాడను - భగ. 16-14) అనియు, 'నేనే, నాదే అనియుంటిని' (తి.వా. 2-9-9) అనియు స్వతంత్రాభిమానయుక్తుడనైన నాకే నేను శేషభూతుడను అని జీవుడు పలుకగా -

**కుత స్తత్** - అది ఎందువలన? అనగా-

**తదపి కుతః** - అదియు దేనివలన అనగా-

**ఇదం వేదమూల ప్రమాణాత్** - 'వాచా2విరూప నిత్యయా' (వికారములేని నిత్యమైన వాక్కుతో) అని, 'అనాధినిధనాహ్యేషా వాగుత్సృష్టా స్వయంభువా' (మొదలు, అంతమును లేని ఈ వాక్కు స్వయంభువుచే సృష్టించబడినది కదా!. భారతే. శా. మోక్ష. 231-56) అనియు, 'మిక్కిలి ప్రకాశించు శ్రుతులలో' (తి.వా. 1-1-7) అనియును నిత్య - అపౌరుషేయమై, వేదరూపమైన లిఖిత ముండుటచే-అనగా-అందు చెప్పబడినది ఏది?-అనగా, 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్' (లోకము నకు పతి, తనకు తానే ఈశ్వరుడు' (తైత్తి. నారా. 10) అనియు, 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దైవతానాం పరమంచ దైవతమ్' (ఈశ్వరులకు మహేశ్వరుడగు అతనిని, దైవములకు గొప్పదైవమును అగు అతనిని-శ్వేతా-6-7) అనియు, 'క్షరాత్మనౌ ఈశతే దేవ ఏకః' (క్షరమనబడు ప్రకృతిని, ఆత్మను ఒకడైన దేవుడు నియమించుచున్నాడు. శ్వేతా. 1-10) అని, 'ప్రధాన క్షేత్రజ్ఞ పతిర్గుణేశ' (ప్రధాన-జీవాత్మలకు పతి, గుణముల నియామకుడు - శ్వేతా. 6-16) అనియు, 'భోక్తాభోగ్యమ్ ప్రేరితారమ్ చ మత్వా' (భోక్తఅగు జీవుని, భోగ్యమగు అచిత్తును, ప్రేరకునియు తలచి - శ్వేతా. 1-12) అనియు, 'నిత్యోనిత్యానాం చేతన శ్చేతనానామ్' (నిత్యులకు నిత్యుడు, చేతనులకు చేతనుడు - కఠో. 5-13), 'అంతఃప్రవిష్టఃశాస్తాజనానాం సర్వాత్మా' (జనుల యొక్క లోపల ప్రవేశించినవాడు, శాసించువాడని, అందఱికి ఆత్మ-యజురా. 3-24) అని, 'యస్య ఆత్మశరీరమ్' (ఎవనికి ఆత్మ శరీరమో-బృహ. 5-7-22) అని, 'యస్య పృథివీ శరీరమ్' (ఎవనికి పృథివి శరీరమో-బృహ. 5-7-4) అనియు, ఈ విధముగా నున్న నాకు శేషభూతుడని తెల్పుటచే అనగా,

**ఏతచ్చానాది సిద్ధాదనుభవ విభవాత్** - అనాది అనుభవము నాదికదా-అనగా-

**తర్హిసాసాక్రోశఏవ** - అయినచో దానికి ఆక్షేపము కలదు సుమా! అనగా-

**క్వాక్రోశః కస్య** - ఎవరు ఎచట ఆక్షేపమును చేసిరి? అనగా

**గీతాదిషు మమ విదితః** - గీతాదులలో నేను ఆక్షేపమును చేసితిని-అనగా-

ఆక్షేపమును చేసిన విధమేది?-అనగా 'ద్వావిమౌ పురుషౌలోకేక్షరశ్చాక్షరఏవచ, క్షరః సర్వాణి భూతాని కూటస్థో2క్షర ఉచ్యతే, ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః యో లోకత్రయ మావిశ్య విభర్త్య వ్యయ ఈశ్వరః (లోకమున క్షరుడు, అక్షరుడును ఈ ఇద్దఱును ప్రసిద్ధులు, క్షరుడు బ్రహ్మాదిస్తంబ పర్యంతమైన సర్వ భూతములు అని, అక్షరుడు కూటస్థుడు, అనగా ముక్తాత్మ అనబడుచున్నాడు. ఎవడు లోకత్రయమును వ్యాపించి, ధరించుచున్నాడో,అట్టి అవ్యయుడైన, ఈశ్వరుడైన ఉత్తమపురుషుడు వేరొకడు- భగ. 16-15,16) అనికదా అనగా -

**కో2త్రసాక్షీ** - దానికి ఎవరు సాక్షి అనగా -

**సుధీఃస్యాత్** - జ్ఞానియే సాక్షి అనగా -

**హంత! త్వత్ పక్షపాతీ నః**- అంతియేనా! 'ప్రియోహి జ్ఞానినో2త్యర్థ మహం సచ మమ ప్రియః' (జ్ఞానునకు నేను మిక్కిలి ప్రియుడను కదా! అతడును నాకు ప్రియుడు - భగ. 7-17) అని అతడు నీకు పక్షపాతి అగుటచే కూడ సాక్షి అనగా-

**ఇతి నృకలహే** - ఇట్లు నీతో చేతనుడు వివాదము చేయు సమయమున

**మృగ్యమధ్యస్థవత్ త్వం** - 'ప్రమాణం కర్తు ముద్యుక్తః మృగ్యమధ్యస్థ ఈరితః'' (ప్రమాణమును చేయుటకు సిద్ధపడిన వాడు మృగ్యమధ్యస్థు డనబడుచున్నాడు - అమరకోశే. ) - అతడు మారు మాట్లాడకుండునట్లు ప్రమాణమును చేయు యత్నమును చేయుచున్నట్లున్నది.

**అవతారిక:-**

**శ్లో॥ ఉత్తరీయపటికా విరాజతే**
**రంగరాజ! భవతో భుజాంతరే।**
**సత్పథే శతమఖోపలప్రభే**
**జాహ్నవీవ శరదభ్రనిర్మలా॥** 26

**శ్రీసేవావ్యాఖ్యా:-**

నీ సౌందర్యచంద్రికానిష్యందమున సకల జనుల లోచన చకోరములను పానము చేయునట్లొనర్చి, నీ పొంగిపొర్లు కరుణారసవర్షముతో విష్ణుపదాశ్రయ మగు శరణాగత ఛాందస (వైదిక) సమూహమును సానందము చేయవాడవై, నీ శ్యామమైన దివ్యదేహమున చారుచారమధారణికులగు వారాంగనలనబడు వనశిఖండులను (నెమళ్లను) తాండము చేయునవిగా చేయువాడవై ఇట్లు వేంచేసియుండి పావనమనోహరమైన దివ్యదేహమున గంధోదకవర్షముతో అంతట నిండునట్లు సమర్పించి, అంగరాగమును అలది, ఆ పిమ్మట, సమర్పించిన ఉత్తరీయము ఇంద్రనీలభంగ నిభయగు వియదంతరమున విజృంభమాణమగు విష్ణుపథతో (గంగానదితో) సామ్యారూఢ (సామ్యమును పొందినది) అని పలుకతగినట్లున్నది.

**అవతారిక:-**

**శ్లో॥ పశ్యత్సురాసురగణం సుమనోవికాస**
**సత్సిద్ధచారణ సమూహ నిషేవ్యమాణమ్।**
**సందృష్టచారుతరసారతరామృతౌ ఘం**
**త్వాం రంగరాజ! కలయామి హి మందరాద్రిమ్॥** 27

**శ్రీసేవావ్యాఖ్యా:-**

స్వామీ! 'వైకుంఠేతు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, ఆస్తే రచింత్వాత్మా భక్తైర్భాగవతైః స్సహ' (వైకుంఠమను పరమపదమున అంచిత్యాత్ముడగు జగన్నాథుడు శ్రీదేవితో పాటు భక్తులు, భాగవతులతో పాటు ఉన్నాడు. లైంగే.

) అనునట్లు, 'సుడికల్గి వ్యాపించియున్న కాంతిని కల జ్యోతి' (తి.వా.-2-8-4) నందు, 'అందమైన కంకణములను కల శ్రీదేవితో' (తి.వా. 4-9-10), 'వైకుంఠములోని అమరులును, మునులును' (తి.వా. 10-9-9) తగిన దాస్యమును చేయగా, 'ఏడు లోకములలో అద్వితీయమైన ఆజ్ఞ చెల్లగా' (తి.వా.4-5-1), 'జయముగల గొప్ప సింహాసనమున' (తిరుప్పావై-23) వేంచేసియుండి, 'నాశములేని ఆనందము యొక్క చరమావధిని యందు తి.వా. 5-3-4) దాటియున్న నీవు నిత్యసూరులవలె నిరతిశయపురుషార్థమైన నిత్యకైంకర్యమును ఇద్దరి కలయికలో (భగవానుడు దేవేరుల కలయికలో) చేయుటకు నిరతులై యుండుటలో నిరుపాధిక (సహజమైన) సంబంధమున్నను దానిని కోల్పోయి, దేహము చూపిన దారిలో పరిభ్రమించి, జన్మ అను కడలిలో పడి, మునిగివున్న చేతనుల స్థితిని మనస్సున భావించి, ఆ విభూతిలో (పరమపదమున) అనుభవము ఒంటపట్టక పోవుటచే, వీరిని (సంసారులను) కూడ వారితో (ముక్తులతో) ఒక వరుసలో చేర్చుటకు నిష్ద్వర దీర్ఘకానిపతిత నిజాపత్యాదిత్యావతీర్ణపితృ క్రమమున (అదునుతో కూడిన నూతిలో పడిన తన సంతానమును రక్షించుటకై అందు దిగిన తండ్రి (క్రమమున) బురదలో పడియున్న సంతతిని చూచిన తండ్రి ఆదరముతో లేవనెత్తుటకై వచ్చునట్లు ఈ దారిలో అవతరించినవాడవై, 'ప్రళయముననను నశింపని, గొప్పదైన బ్రహ్మలోకాదులు ఉజ్జీవింపగా' (కులశేఖర సూక్తము. 1-10), నాశములేనివై (క్రూరములైన అవిద్యాది వ్యాధులను తీర్చుటకై' (తి.వా. 8-3-6) 'అందమైన తోటలచే చుట్టబడి యున్న శ్రీరంగనగరములో' (కలివైరిసూరి సూక్తము. 11-8-8), మణి సదృశ్యమైన రూపముతో 'విభీషణునకు విలక్షణుడైన స్నేహితుడు' (కలివైరిసూరి సూక్తము. 6-8-5) అగుట ప్రకాశింప, 'విభీషణుని పట్ల గల ప్రేమచే దక్షిణదిక్కును కటాక్షించి పరుండియుండి' (కులశేఖరసూక్తము 1-10), అంతయే కాక అఖిలలోకములకును అవలోకన దానమును అనుగ్రహించుట కొఱకై దివ్యోత్సవవ్యాజముతో తిరువీధులలో 'రూపమున సాటిలేని, పుష్పనివాసినియగు లక్ష్మీదేవి, మిగిలిన భూదేవియు స్పృశించు మృదువైన పాదములను' (తి.వా. 9-2-10) గొని అందఱును అభినివేశమును పొందునట్లు సమర్థుడు నాట్యము చేయువిధమున పర్యటించి, లోచన చర్చసాహసాసహమై, పుష్పహాస సుకుమారమైన దివ్యరూపమున (కల్గిన) అలసట తీరునట్లు తిరుమంజనమాడి, చంద్రచందనపంక మకరంద భరిత సుమనోబృంద సుందరుడవై వేంచేసియున్న సన్నివేశము మందర పర్వతమని తలచునట్లున్నది- అదెట్లనగా-

**పశ్యత్సురాసురగణమ్** - మందర పర్వతము 'పెద్దదైన ఒక పర్వతము తన వీపులో వ్యాపించియుండి భ్రమించుచున్న' (కలివైరిసూరి సూక్తము. 11-4-2) అనునట్లు అమృత మథన సమయమున భ్రమించుచు వచ్చు విధముచే సంస్థాన విశేషముతో ఏర్పడిన శోభాతిశయముచే సారించిన కన్నులు త్రిప్పుకొనకుండనే చూడతగినట్టి స్థితి మథనోద్యోగ పారీణులగు దేవాసుర గణమును కల్గినదై యుండును.

నీవు 'సాక్షాన్మన్మథమన్మథః' (సాక్షాత్తు మన్మథునకు మన్మథుడు- భాగవతే. 10-32-2) అనునట్లు మన్మథునకును ప్రణయవిరహ బాధను కల్గించునట్టిదియై, 'పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్' (పురుషుల దృష్టిని, చిత్తమును అపహరించు వానిని-రామా. అయో. 3-28) అనునట్లు సౌందర్యముచే వివశులై, ప్రవాహమున కొట్టుకొని పోవువారివలె గుంపులు గుంపులుగా చేరి, దివ్యరూపమున ఎల్లప్పుడు దర్శించుచుండు, అనుకూల ప్రతికూల విభాగరహితులైన, సర్వప్రాణులను కల్గిన వాడవైయుందువు.

**సుమనోవికాసత్సిద్ధ చారణ సమూహ నిషేవ్యమానమ్** - మందర పర్వతము భోగ యోగ్యప్రదేశముచే వికస్వర మనస్కులై, గాంభీర్యానుగుణ యౌవనాది వైలక్షణ్యమును కల్గిన వారైన సిద్ధ చారణ రూప దేవజాతి విశేష పరిషన్నిషేవ్య మానమైయుండును. నీవు 'సచానంత్యాయ కల్పతే'(ముక్తుడు అనంత రూపములను కల్గి యుండుటలో సమర్థుడగుచున్నాడు శ్వేతా. 5-9) అనియు, 'ఉన్న జగత్తు పర్యంతము నేనును ఉన్నవాడను' అనియు పల్కునట్లు సాంసారిక సంకోచము తీరి, నమః శబ్దోపలక్షిత జ్ఞాన భక్త్యాదులను కల్గినవారైన ముక్తుల యొక్క 'సూరయో నిత్యసంసిద్ధాః సర్వదర్శినః' (దివ్యసూరులు నిత్య సంసిద్ధులు, సర్వమును దర్శించువారు) అని చెప్పబడు 'గొప్పవారైన అమరులగు' (తి.వా.

3-6-7) నిత్య సిద్ధుల సమూహముచే '(సంసారమందు) భ్రమలేని వారైన, మంచి తపస్సు కల వారైన సనకాది మునులును, సంసారావధిని చూచిన ముక్తులును, చలనములేని నిత్యసూరులును వీరందఱును మంగళాశాసన మొనర్చువార' (తి.వా. 8-3-10) అనునట్లు నిరంతరము సేవింపబడువాడవు.

**సందృష్టచారుతరామృతౌఘమ్** - మందరపర్వతము తనచే అమరత్వావహ రూపచాతుర్యమును కల్గినదై, మాధుర్యాతిశయముచే సారతరమైన అమృత ప్రవాహమును కల్గినదైయుండును.

నీవు - 'తామరనేత్రుని, నిత్యసూరులు పొగడుస్వామియు' (తి.వా. 2-6-3) అనురీతిలో జ్వర సన్నిపతితుల వలె క్రమము తప్పి స్తోత్రము చేయునట్లు కటాక్షింపబడినవారై, అస్పృష్ట సంసారగంధులగుటచే చారుతరులై, అస్థాన రక్షావ్యసనమును కలవారినిగా చేయునట్టి ప్రేమాతిశయముచే సారతరమగు నిత్యసంఘమును కల్గినవాడవైయుందువు.

**త్వాం రంగరాజ!, కలయామి మందరాద్రిమ్**-కావున ఈ రీతులచే 'అమృతము కంటెను, అరుదైన, స్త్రీ రూపామృతము' అయిన లక్ష్మిని జనింప చేయుటచే కల్గిన ఉపకారస్మృతి మనస్సున ఊరియుండి, భావనాప్రకర్షముచే హర్షము ముదిరి, లక్ష్మీరంగమున నీవును, లక్ష్మియును కలసి మందరసామ్యమును అంగీకరించి నిలచిన సన్నివేశము వలె ఉన్నది.

## అనుబంధము

ఇవి **శ్రీ పరవస్తు గోవిందాచార్యులు** గారిచే 1940 వ సంవత్సరమున శ్రీనివాసముద్రణాలయమున ప్రచురింపబడిన భట్టరు ముక్తక శ్లోకములు. ఇవి అన్నియు చక్కని వేదాంతార్థములను ప్రతిపాదించుచున్నవి.

## జీవేశ్వర సంవాదము

**శేష స్త్వం మే మమ త్వం కిమితి కిమితి తే వేదమానాత్తతోమే**
**శాస్తృత్వం కర్మణో మే త్వదనుసరణత స్తేన మే సాక్ష్యచిన్మే**
**సాక్షిత్వం కిం జడాయా స్తమిహ వద ఋతం సప్రమాణం వదత్వం**
**స్వస్వామిత్వం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగః॥**

ప్రభువు ఎవ్వరను విషయమున జీవేశ్వరుల మధ్య జరిగిన వివాదమును ప్రస్తుత శ్లోకముత్ప్రేక్షించుచున్నది.

**శేషస్త్వం మే** - నీవు నామశేషభూతుడవని భగవానుని వాక్యము.

**మమ త్వం** - నీవే నామశేషమని జీవుని ప్రత్యుత్తరము. భగవానుడు భక్త పరతంత్రుడు కదా.

**కిమితి** - ఎట్లు? - అని భగవానుని ప్రశ్న.

**కిమితి తే** - నేనును నీకధీనుడననుట ఎట్లు? - అని జీవుని ప్రశ్న.

**వేదమానాత్** - వేదప్రమాణము వలన-అని స్వామి బదులు.

**తతోమే** - ఆ వేద ప్రమాణము వలననే నాకు నీవు అధీనుడవనుట స్పష్టము - అని జీవుని మాట. 'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్' (భగ. 7-18), 'మమ ప్రాణాహి పాండవాః' (భారతే. ), 'మహాత్మభిర్మామవలోక్యతాం నయక్షణే2పి తేయద్విర హో2పి దుస్సహః' '(స్తోత్రరత్నే. 56) అను మొదలుగా గల పలు ప్రమాణములు, వీనికి మూలమైన 'సదా పశ్యంతి సూరయః' (విష్ణుసూక్తము) ఇత్యాది వైదిక సూక్తులు భగవానుని భక్తపరాధీనత్వమును చాటుచున్నవి.

**మే శాస్తృత్వమ్ -** నాకు శాసించు స్వభావము కలదు అని భగవానుని వచనము. భగవానుడు జనులకు "అంతఃప్రతిష్టః శాస్తాజనానామ్ సర్వాత్మా" అను రీతిలో అంతఃప్రవిష్టుడై, శాసకుడై, సర్వాత్మయైయుండును కదా!.

**కర్మణో మే -** శాసించుశక్తి నీకు లేదు, నా కర్మకే కలదని జీవుని ప్రతివచనము. జీవులు కర్మపరతంత్రులు కదా!.

**త్వదనుసరణతః తేన మే -** నీవు నన్ను అనుసరించుచున్నావు. కావున నాకే శాసకత్వము కలదు - అని స్వామి వచనము. భగవానుని అనుసరించు ఆత్మలకు, అచేతనములైన కర్మలకును శాసకత్వము లేదుకదా!

**సాక్ష్యచిన్మే -** నేను నిన్ను అనుసరించుటలేదు. ఇందులకు నాకు అచిత్తుసాక్షి - అని జీవుని బదులు. అనాదియైన అచిస్యంబంధము వలన జీవులు భగవానుని అనుసరింపక, అచేతనమైన కర్మయే తమను శాసించుచున్నదని కొందఱు, తామే స్వతంత్రులమని కొందఱు భ్రమింతురు.

**సాక్షిత్వం కిం జడాయాకత్వ మిహ వదం బ్రుతం -** జడమైన ప్రకృతికి సాక్షత్వమెట్లు సంభవము? నిజము పల్కుము అని భగవానుని మాట. జడమనగా తనకుతాను ప్రకాశింపక ఇతరులనే ప్రకాశించునది. జడులనగా జ్ఞానము లేనివారు. వీరు సాక్షులు కాజాలరు అని తాత్పర్యము.

**స ప్రమాణం వదత్వమ్ -** ప్రమాణమును అనుసరించి నీవు పలుకుము. మనకిద్దఱికి అంగీకార్యమైన ప్రమాణము లేనపుడు నీమాట నాకెట్లు ప్రమాణము - అని జీవుని ప్రశ్న.

**స్వ స్వామిత్వం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః-** ఇట్లు వివాద మేర్పడగా తన స్వామిత్వమును నిరూపించుకొనుటకు చేయబడిన శపథము కలవానివలె స్నాతకుడగు రంగనాథుడు తోచుచున్నాడు.

ఈ శ్లోకమున ప్రస్తుతములైన భగవానుని వాదము, జీవుని వాదములనిట్లు సంగ్రహముగా చెప్పవచ్చును. భగవానుడు అందఱిని శాసించువాడని వేద ప్రమాణము లుండుటచే కర్మాదులు అచేతనములు కావున స్వతంత్రముగా తాము ఫలమునిచ్చు శక్తిని లేనివగుటచే, అందఱు భగవానుని అనుసరించు వారగుటచే భగవంతుడే ప్రభువని మొదటి వాదము. జీవుడు స్వతంత్రుడగుటచే, భగవానుడు భక్తపరతంత్రుడని శాస్త్రసిద్ధమగుటచే, శాస్త్రములలో కర్మయే చేతనులకు సమస్త ఫలితములిచ్చుచు తగురీతిలో శాసించుచున్నదని కానవచ్చుటచే, జీవులు భగవానుని అనుసరింపక ప్రకృతి పరవశులైయుండుటచే కర్మయే ప్రధానమని, జీవుడే స్వతంత్రుడని రెండవ వాదము.

వీనిలో ద్వితీయవాదము ప్రమాణవిరుద్ధము, యుక్తిదూరమును. అయినా మొండిగా వాదించువారిని విజృంభింపనీయరాదని తలచిన రంగనాథుడు వారు మరల వాదింపకుండునట్లు చేయుటకై ప్రమాణము చేయుటకు సిద్ధపడినట్లు ఉన్నాడని తాత్పర్యము.

## నిత్యేశ్వరుల వివాదము

**శ్లో॥మయ్యాధిక్యం త్వదాస్తే మయి కిమితి కథం రూపచిహ్నైస్తదాస్తే**
**మయ్యేతన్మేగుణౌఘై స్తదపి మయి మయి శ్రీ రురస్థామదీయా।**
**సృష్ట్యాదౌ మే2స్తి శక్తి ర్నతవ తదఖిలం ప్రాకృతత్వేన హీనం**
**వక్తుం పశ్చాదశక్తిః కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః॥**

**త్వత్ మయి ఆధిక్యం ఆస్తే -** నీ కంటె నాయందు ఆధిక్యము కలదని భగవద్వాక్యము.

**మయి -** నాయందే నీకంటే ఆధిక్యమున్నదని నిత్యుని ప్రతివచనము.

**కిమితి -** ఎందువలన? అని భగవానుని ప్రశ్న.

**కథమ్ -** ఎట్లు నీయందు ఆధిక్యము గలదని నిత్యుని ప్రతిప్రశ్న

**రూపచిహ్నైః -** రూపములచే, చిహ్నములచే నీకంటె నాయందు ఆధిక్యము కలదని భగవానుని సమాధానము. భగవానుని రూపము హిరణ్మయము అగుటచే, నీలమేఘ నిభమగుటచే, శంఖచక్రాది చిహ్నములు కలిగినదగుటచే, అప్రాకృతమైన దగుటచే ఆధిక్యమున్నదని తాత్పర్యము.

**తదాస్తే మయి -** అట్టి రూపముచే, చిహ్నములచే ఆధిక్యము నా యందును

కలదు. 'నిరంజనః పరమం సామ్య ముపైతి' అని కదా శ్రుతి. అందుచే నీలమేఘ సమానరూపము, శంఖచక్రాది చిహ్నములును నిత్యునకును కలవని భావము.

**ఏతన్మే గుణౌఘైః -** ఈ ఆధిక్యము నాకు గుణసమూహముచే కలిగెనని భగవానుని వచనము. భగవానుడు అసంకుచిత జ్ఞానానందాది గుణయుక్తుడు కదా!.

**తదపి మయి -** ఆ ఆధిక్యము నా యందును కలదు అని నిత్యుని మాట. నిత్యునకును అసంకుచిత జ్ఞానానందాదులు కలవు.

**మయి శ్రీః -** నాయందు లక్ష్మీదేవి కలదు అని భగవానుని వేరొక మాట. లక్ష్మీపతిత్వము సర్వోత్కృష్ట సూచకమని, భగవానుని అసాధారణ లక్షణమని ప్రసిద్ధి కదా!.

**ఉరస్థా మదీయా -** నీ వక్షఃస్థలమందున్న ఆలక్ష్మి నాకు సంబంధించినది అని నిత్యుని వచనము. లక్ష్మి జీవకోటిలోనికి చేరునది. జీవుడు కౌస్తుభస్థానీయుడని, 'ఆత్మాన మస్య జగతో నిర్లేప మగుణామలయమ్, బిభర్తి కౌస్తుభమణి స్వరూపం భగవాన్ హరిః' అను విష్ణుపురాణ (2-22-68) సూక్తి తెలుపుచున్నది. కౌస్తుభమణి, లక్ష్మీదేవియు ఒక చోటనే-అనగా క్షీరాబ్ధిలో పుట్టిరి. అందుచే లక్ష్మీచేతునకు సోదరి. లక్ష్మి వలన విష్ణువునకు ఆధిక్యము కలదనినచో, ఆ లక్ష్మియే చేతనుని సోదరి అగుటచే చేతనునకు ఆధిక్యము ఆమె వలన కలదు కదా! అని యుక్తి.

**సృష్ట్యాదౌ మే2స్తి శక్తిః న తవ -** సృష్ట్యాదులలో నాకు శక్తి కలదు కాని నీకు లేదని భగవానుని వాక్యము.

**తదఖిలం ప్రాకృతత్వేన హీనమ్ -** అది అంతయు ప్రాకృతమగుటచే హీనమైనదని నిత్యుని ప్రతివచనము. జగత్కారణత్వము ప్రాకృతము. ప్రాకృత జగత్సంబంధము లేకుండుటయే ఉత్కర్షను కల్గించును కాని ప్రాకృత ధర్మము ఉత్కర్షను కల్గింపదని భావము. ఇట్లు నిత్యుడు వాదులాడగా -

**పశ్చాద్వక్తుమశక్తః -** ఆ పిమ్మట ఏమియు బదులు పలుకలేక అశక్తుడై,

**కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః -** చేయబడిన శపథమును కలవానివలె శ్రీరంగనాథుడు తోచుచున్నాడు. జగద్వ్యాపారము ప్రాకృతమైనను ఆ జగద్వ్యాపారమునందు మోక్షప్రాపకత్వముండుటచే ఉత్కర్షావహమేనని భావము. నిత్యునకు భగవంతునితో అత్యంత సామ్యము కలదనుట ఈ శ్లోక సారాంశము.

## ప్రకృతి - ఈశ్వరుల వివాదము

**శ్లో॥ సృష్ట్యాదౌ కర్తృతా మే మమ హి కథమిదం జీవమద్యోగసిద్ధం**
**మత్సంకల్పాదనాదేః సహజ విధి వశాత్కాచితఃకర్తృతా తే।**
**కాసా వ ప్రాకృతాత్వత్ స్థితిరసదివతే నిర్గుణా మద్వినాసా**
**వక్తుం తస్యై స్వసత్తాం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగః॥**

**సృష్ట్యాదౌకర్తృతా మే -** సృష్టి మొదలగు వానిలో నాకు కర్తృత్వము కలదని భగవానుని వచనము.

**మమ హి -** అది నాకే కలదు కదా! - అని ప్రకృతి ప్రతివచనము.

**జీవమ ద్యోగసిద్ధమ్ -** జీవునియొక్క, నాయొక్క కలయిక వలన సిద్ధించినది - అని ప్రకృతి వచనము. జీవ-ప్రకృతుల కలయిక వలననే సృష్టి సంభవించుచున్నది అని తాత్పర్యము.

**అనాదేః మత్సంకల్పాత్ -** అనాదియగు సంకల్పమువలన సృష్టి జరుగుచున్నదని భగవానుని వాక్యము.

**సహజవిధివశాత్ -** సహజముగా, విధివశమునను సృష్టి జరుగుచున్నదని ప్రకృతి వచనము. సృష్టి స్వభావము వలననే సంభవించుచున్నదని, అదృష్టవశమున జరుగుచున్నదని భావము. భూమిలో గింజ మొలచుట వంటి సృష్టికి కర్త భగవానుడని ఒప్పుకొనక్కరలేదు, స్వభావము చేతనే ఆ సృష్టి జరుగుచున్నదని కొందఱి వాదము. అదృష్టమనునది ఒకటి కలదు, అదియే సృష్టికి హేతువని మరికొందఱి మతము.

**కా2చితః కర్తృతా తే -** అచిత్తు అగు నీకు కర్తృత్వము ఏమి? అని భగవానుని ఆక్షేపము. ప్రకృతి అచేతనము. అచేతనమైన వస్తువేదియు స్వయముగా ఏపనిని చేయలేదు. జీవుడు చైతన్యమును కలవాడైనను కర్మాధీనుడగుటచే సృష్టిని

చేయజాలడు. కావున సత్యసంకల్పుడగు భగవానుని సంకల్పము వలననే సృష్టి జరుగుచున్నదని తాత్పర్యము. 'సో2భాధ్యాయ శరీరాత్ స్వాత్ సస్పృక్షుర్వివిధాః ప్రజాః, సర్వభూతాదిభూతాజాః ప్రాదురాసీత్తమోనుదః' అని మనుధర్మశాస్త్రమున (1-8) తెలుపబడినది కదా!

**కాసావప్రాకృతా** - నీవును ప్రకృతి రహితముగా చేయు ఆ సృష్టి విధానము ఏమి? అని ప్రకృతి ప్రశ్న. చైతన్యము లేని ప్రకృతికి సృష్టికర్తృత్వము సంభవింపనట్లే, ప్రకృతి లేకుండ కేవలాత్మకు సృష్టికర్తృత్వము సంభవింపదని తాత్పర్యము.

**త్వత్ స్థితి రసదిన** -నీ స్థితియే అసత్తువలె ఉండునట్టిది అని భగవానుని వచనము. సతత పరిణామియగునది కదా అసత్తు.

**సా తే స్థితిః మద్వినా నిర్గుణా** - అట్టి నీ స్థితి నేను లేనిచో నిర్గుణమే కదా! అని ప్రకృతి ఆక్షేపము. నేనెంత అస్వత్రాదునైనను నేను లేనిచో నీవు నిర్గుణుడవేనని తాత్పర్యము. భగవానుని సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వం జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజో వాత్సల్య సౌశీల్యాది గుణములకు సార్థకత ప్రకృతిలోని మార్పులను ఉద్దేశించియే కదా ఏర్పడును. అట్టి మార్పు ప్రకృతికి లేనిచో భగవద్గుణములకు సార్థక్యము లేదని భావము.

**వక్తుం తస్యై స్వసత్తాం కృతశపథ ఇవ స్నాతకో భాతిరంగః** - పై విధముగా ప్రకృతి వాదింపగా, ఆ ప్రకృతికి సమస్తకల్యాణ గుణాకరుడగు తన సద్భావమును తెలియజేయుటకై చేయబడిన శపథమును కలవానివలె శ్రీరంగనాథుడు భాసించుచున్నాడు.

భగవానుడే సృష్టికర్త. ప్రకృతి స్వభావము వలననే సృష్టి సంభవించుచున్నదనుట యుక్తియుక్తము కాదు. సృష్టి లేకుండుటయే స్వభావమేలకారాదు? కాన, అదృష్టమని దేనినో ఒకదానిని అంగీకరించిన గాని సృష్టికుదరదు కదా! నిరూపించుటకు సాధ్యముకాని, అచేతనమైన అదృష్టమును అంగీకరించుటకంటె సత్యసంకల్పాత్వాదిగుణయుక్తుడైన భగవానునే సృష్టికర్తగా ఒప్పుకొనుట యుక్తము కదా! భగవానుని గుణములు స్వాభావికములే కాని, ఔపాధికములు కావు. కావున అపరిమితములు. భగవద్గుణముల వలన ప్రకృతిలో మార్పు కల్గినంతమాత్రమున ప్రకృతి లేనిచో ఆ గుణములు లేవని వాదించుట అయుక్తము. భగవానునకు స్వాభావిక గుణముల వలన కల్గు ఉత్కర్షకు లోపములేదని శ్లోక తాత్పర్యము.

## ప్రకృతి - ఈశ్వర సంవాదము

**శ్లో॥ భృత్యావావా మనాదీ తదపి చితి మహాన్పక్షపాత స్తవాస్తే**
**కస్సర్యస్యార్జకో2హం మదిహ తదఖిలం తేన భోగ్యం కరోషి**
**కృత్వాతం మద్వియుక్తం నయసి తవపదం తద్ద్వయం పాపమేవే**
**త్యుక్తః కర్మేతి వక్తుం కృత శపథ ఇవ స్నాతకో భాతి రంగః॥**

**భృత్యావావామనాదీ** - జీవుడు నేను అను మేమిద్దఱము నీకు అనాదిగా సేవకులము.

**తదపిచితి మహాన్ పక్షపాతస్తవాస్తే** - అయినను నీకు జీవునిపట్ల ఎక్కువ పక్షపాతము కలదు - అని ప్రకృతి ఆక్షేపము.

**కః** - ఏమి? - అని భగవానుని ప్రతిప్రశ్న.

**సర్వస్యార్జకో2హమ్** - నేను సమస్తమైనభోగ్యజాతము యొక్క సంపాదకుడును.

**మదిహ తదఖిలం తేన భోగ్యం కరోషి** - ఆభోగ్యజాతమునంతటిని నాకంటె ఆ జీవుని చేతనే అనుభవింపదగినదానినిగా చేయుచున్నావు.

**కృత్వాతం మద్వియుక్తం నయసి తవపదమ్** - ఆ జీవుని నాతో వియోగమును కలవానినిగా చేసి నీ పాదములను పొందింపచేయుచున్నావు.

**తద్ద్వయం పాపమేవ** - ఆ రెండు పనులును పాపములే

**ఇతి ఉక్తః** - అని ప్రకృతిచే చెప్పబడినది. అపుడు భగవానుడు

**కర్మేతి** - దీనికి కారణము కర్మయే అని

**వక్తుం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగః**-పల్కుటకు చేయబడిన ప్రమాణమును కలవానివలె రంగనాథుడు తోచుచున్నాడు.

ప్రకృతి, జీవుడు - అను మేమిద్దఱము నీకు అనాది సేవకులము. అయినను నీకు జీవుని పట్ల పక్షపాతము మెండు. ఈలోకములోని భోగ్య పదార్థములన్నిటిని

నేనే ఆర్జించుచున్నాను. సంపాదించినవాడే కదా అనుభవింపనగును. కాని, నీవు ఆ భోగ్యవస్తువులను జీవుడు అనుభవించునట్లు చేయుచున్నావు. పిమ్మట జీవుని ప్రకృతి సంబంధ వినిర్ముక్తుని చేసి నీపాద సన్నిధికి కొనిపోవుచున్నావు. ఇట్లు ఈ లోకమున, పరలోకమున జీవునకే ఫలము కలుగచేసి పక్షపాతము చూపుచున్నావు. ఈ రెండు పనులును పాపములే సుమా! అని ప్రకృతి భగవానుడగు శ్రీరంగనాథునితో వాదులాడగా అపుడు శ్రీరంగనాథుడు జీవుడు తాను చేయు పూర్వకర్మలవలననే ప్రకృతి సంబంధమగు ఫలములనొందుచున్నాడు. అంతియే కాని, నాకు పక్షపాతము అతని పట్ల లేదు అని భగవానుడు తెలియజేయుటకై శపథ మొనర్చుచున్నట్లున్నాడని శ్లోక తాత్పర్యము. సర్వముక్తి ప్రసంగపరిహారార్థము భగవానుడు జీవునియందు ఒకానొక విశేషమును చూపియే అనుగ్రహించునని సారము.

## భూ-నీళా సంవాదము

**శ్లో॥ అంఘ్రీమౌ మే, మమేమౌ మమ పదయుగళం మధ్యమాయాః వదంతే**
**మధ్యం జ్యైష్ఠ్యాదురః శ్రీరధివసతి హి నః కః క్రమోనైత్యికానామ్।**
**దత్తౌ మే మే2ధికాహం మయి రతి రధికా2హం ప్రియా2హం ప్రియైవం**
**పృష్ట స్తాభ్యాం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగః॥**

**అంఘ్రీమౌమే** - ఈ పాద ద్వయము నాది అని నీళావచనము

**మమేమౌ** - ఇవి నావే అని భూదేవి వాక్యము.

**మమ పదయుగళమ్** - నాకు పాద ద్వంద్వము.

**మధ్యమాయాః వదంత్యే మధ్యమ్** - శ్రీ భూనీళలని చెప్పబడుమన ముగ్గురిలో మధ్యన నున్న నీ స్థానము నడుము,

**జ్యైష్ఠ్యాదురః శ్రీరధివసతి హి నః** -మనలో లక్ష్మీదేవి పెద్దది అగుటచే వక్షఃస్థలమును అధివసించుచున్నది కదా! - అని నీళా వాక్యము. శ్రీ భూ నీళలు అని చెప్పబడు మనలో పెద్దది అగు లక్ష్మి వక్షఃస్థలమున ఉన్నది. మధ్యమగా చెప్పబడు నీకు నడుము, చివరగా పేర్కొనబడిన నాకు (నీళకు) పాదములును స్థానములని తాత్పర్యము. కావున నేనే పాదముల వద్ద నుండి సేవింతునని భావము.

**నైత్యికానాం కః క్రమః** - ఎల్లప్పుడు సేవించు వారికి ఏమి క్రమము కలదు? కావున,

**మే దత్తౌ** - ఈ పాదములు నాకివ్వబడినవి అని భూదేవి ప్రతివచనము. ఎప్పుడో ఒకప్పుడు సేవించువారికి నియమము ఉండును కాని నిత్యము సేవకులగువారికి క్రమము ఏమియు ఉండదు. నాయందే (భూమియందే) భగవానుడు పాదములు మోపును కావున ఈ పాదములు నాకివ్వబడినవి. అందుచే నేనే పాదసేవను చేయుదునని తాత్పర్యము.

**మే** - నాకే ఈ పాదములు ఇవ్వబడినవని నీళావచనము

**అధికా2హమ్** - నేను అధికమైనదానను అని భూదేవి వాక్యము.

**మయి రతిరధికా** - నా యందు అనురాగము మెండు అని నీళావచనము. 'తుల్యశీల వయోవృత్తామ్, తూల్యాభిజనలక్షతామ్' అనురీతిలో నీళాదేవి కృష్ణునకు మిక్కిలి తగినదగుటచే ఆమెయందు స్వామికి అధికానురాగముకలదని తాత్పర్యము.

**అహం ప్రియా** - నేను ప్రియురాలను అని భూమి వచనము.

**అహం ప్రియా** - నేనే ప్రియురాలను అని నీళా వాక్యము.

**ఏవం పృష్ట స్తాభ్యామ్** - ఇట్లు వారిద్దరిచే ప్రశ్నింపబడిన వాడై

**ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగః** - సమాధానమును పల్కుటకు చేయబడిన శపథమును కలవానివలె శ్రీరంగనాథుడు తోచుచున్నాడు. భూదేవి, నీళాదేవులు ఇరువురు సమానులే అని తాత్పర్యము.

## ముక్త-శ్రీదేవి సంవాదము

**శ్లో॥ సేవాకార్యా మయైవ తత్పదకమల యుగస్యాస్య విష్ణోః కృతాతే**
**మద్వృత్తి స్సామమోక్తా బహిరితి న చ మే కిం వధూ త్వాద్వధూత్వమ్।**
**కిం రూపం త్వద్వివాహో త్రియరతిసుఖదం తత్కథం నిత్యతృప్తేః**
**పృష్టస్తాభ్యాం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః॥**

## శ్రీసేవావ్యాఖ్యా

**సేవాకార్యా మయై తత్పదకమల యుగస్యా** - నా చేత ఈ పదపద్మ యుగము నకు కైంకర్యము చేయతగినది - అని ముక్తుని వచనము.

**అస్య విష్ణోః కృతాతే** - ఈ విష్ణువునకు నీయొక్క సేవ చాలును.

**మద్వృత్తిః సా** - అది నా పని అని లక్ష్మి వచనము. విష్ణు సేవ నా కర్తవ్యమని లక్ష్మిభావము.

**మమోక్తా** - ఆ సేవ నాకు చెప్పబడినదని ముక్తుని ప్రతివచనము. నాకు మోక్ష మందు భగవత్సేవ విధింపబడినది. నీవు స్వామికి బయటికే కైంకర్యమును చేయదగినదానవు కావు అని ముక్తుని మాట.

**బహిరితి న చమే కిం వధూత్వాత్** - నేను భార్యయగుటచే వెలియైన కైంకర్యము అని నాకు కైంకర్యమును చేయు అవకాశము లేకుండునా? అని లక్ష్మీదేవి ప్రశ్న.

**వధూత్వం కిం రూపమ్** - నీవధూత్వము ఎట్టిది? అని ముక్తుని ప్రశ్న.

**తద్వివాహాత్ ప్రియ రతి సుఖదమ్** - ఆయనను వివాహమాడుట వలన ప్రియమైన రతి సుఖమును ఇచ్చునది అని లక్ష్మి సమాధానము.

**తత్కథమ్** - అది ఎట్లు? అని ముక్తుని మరల ప్రశ్న. ఆయనను వివాహమాడుట, నీ స్త్రీత్వము, ఆనందమును ఎట్టివి? ఏ విధముగా సిద్ధించినవి? అని ముక్తుని అభిప్రాయము.

**నిత్యతృప్తేః** - నిత్యమైన తృప్తివలన అని లక్ష్మి బదులు. ఇట్టి నిత్య తృప్తి నాకును ఉండును కదా అని ముక్తుని అభిప్రాయము. భగవత్కైంకర్యము ఇద్దఱికిని సమానమే కదా!

**సృష్టస్తాభ్యాం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః**- ఇట్లు ముక్త- శ్రీదేవులచే ప్రశ్నింపబడిన శ్రీరంగనాథుడు (జవాబుగా) చేయబడిన శపథమును కలవాడుగా భాసించుచున్నాడు.

### లక్ష్మీశ్వర సంవాదము

**శ్లో॥ అజ్ఞానాదాశ్రితాహం తవ కిమకరవం తన్మమాలం కుతస్తత్**
**భూనీళేమే సపత్న్యౌ తవపదకమల ద్వంద్వసేవాది దిష్టే**
**త్వం మే వక్షస్య భేదస్థితి రసిరసిక స్వాంగభోగాన్నమేన్య**
**జానేనేతిత్యదన్యాం కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః॥**

**అజ్ఞానాదాశ్రితాహమ్** - నేను అజ్ఞానము వలన ఆశ్రయించిని - అని లక్ష్మీ వచనము.

**తవకిమకరవమ్** - నీకేమి చేసితిని? అని భగవానుని ప్రశ్న.

**తన్మమాలమ్** - అది నాకు చాలును అని లక్ష్మీదేవి బదులు.

**కుతస్తత్** - ఎందువలన అది? అని భగవానుని ప్రశ్న.

**భూనీళేమే సపత్న్యౌ** - భూదేవి, నీళాదేవియు నాకు సవతులు.

**తవపద కమల ద్వంద్వ సేవాది దిష్టే** - నీ పాదకమలయుగళ సేవాదులలో ఆజ్ఞాపింపబడిరి - అని లక్ష్మీ వాక్యము.

**త్వం మే వక్షస్య భేదస్థితిరసి** - నీవు నావక్షస్సులో అభేదస్థితిని కలదానవైయున్నావు - అని భగవద్వచనము.

**రసిక! స్వాంగభోగాత్ నమేన్యత్** - రసికుడా! నీ శరీరభోగము కంటె నాకు వేరొకటి లేదు - అని లక్ష్మీదేవి వాక్యము. ప్రీతిరహితమైన కేవల శరీర భోగమే నాకు ప్రాప్తించినది. ప్రీతితో అనుగ్రహించిన పాదసంవాహనాది సేవలు భూనీళలకే లభించినవి అని లక్ష్మీదేవి ప్రణయరోష వాక్యము.

**జానేనేతి త్వదన్యామ్** - నీకంటె అన్యస్త్రీని నేను ఎఱుగను అని

**కృతశపథ ఇవ స్నాతకోభాతిరంగః**- చేయబడిన ప్రమాణమును కలవానివలె శ్రీరంగనాథుడు తోచుచున్నాడు. లక్ష్మీని కూడ భగవానుడు ప్రీతిపూర్వకముగా ఆజ్ఞాపించుటచే, 'దేవి!, త్వామనునీళయా సహమహీదేవ్యస్సహస్రం తథా యాఖిస్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియంశ్లాఘనే' అనుచు భట్టర శ్రీగుణ రత్నకోశమున పల్కిన రీతిలో భూనళలు లక్ష్మీదేవికి అంగభూతలే కాని అన్యలు కాదు కావునను లక్ష్మీకంటె ఇతర స్త్రీలను నేను తెలియనని భగవానుడు

చెప్పతగినంత అనురాగము ఆమె యందున్నదని తాత్పర్యము.

**ప్రకృతి - జీవ సంవాదము**

**శ్లో॥ ప్రేష్యస్త్వం మే మమ త్వం కిము కిము వశతస్తే మదాధారకత్వా**
**ద్భోగ్యత్వం మే తదస్మజ్జనితమిహ మమశ్రోత్రనాసామనోక్షైః।**
**కర్తృత్వం మే కదాద్యైరితిహ చిదచితోః నష్టమైత్ర్యోః పునస్త**
**చ్ఛాంత్యై తథ్యం ప్రవక్తుం కృతశపథ ఇవ స్నాతకో భాతి రంగ॥**

**ప్రేష్యస్త్వం మే** - నాకు నీవు పనిచేయు అనుచరుడవు అని జీవుని చూచి ప్రకృతి పల్కిన వాక్యము.

**మమ త్వమ్** - నీవే నాకు అనుచరురాలవు అని జీవుని ప్రతివచనము.

**కిము** - ఏమి? అని ప్రకృతి ప్రశ్న

**కిము** - ఏమి? అని జీవుని ప్రశ్న.

**వశతః** - నాకు నీవు వశుడగుటవలన అని ప్రకృతి మాట.

**తే మదాధారకత్వాత్** - నీవు నన్నే ఆధారముగా కలదానివగుటచే అని జీవుని వచనము. జీవుని ఆధారము వలననే ప్రకృతిలో వికారములు కల్గును.

**భోగ్యత్వం మే** - భోగ్యమైయుండు స్వభావము నాకే కలదని ప్రకృతి వాక్యము.

**తదస్మజ్జనితమ్** - ఆ భోగ్యత నా వలన పుట్టించబడినదని జీవుని మరు వచనము. నేను భోగ్యమని తలచిన కదా నీకు భోగ్యమగునని జీవుని హృదయము.

**ఇహ మమ శ్రోత్రనాసా మనోక్షైః** - ఇచట నా చెవి, ముక్కు, మనస్సు ఇంద్రియములచేతనే భోగ్యత్వము సిద్ధించునని ప్రకృతి వాక్యము. జీవుడు భోగ్యమని తలచుట ప్రకృతి సంబంధమైన శ్రోత్రనాసికాది ఇంద్రియములచే విషయములను గ్రహించునపుడు అనుకూల జ్ఞానము ఏర్పడుట వలననే అని భావము.

**కర్తృత్వం మే** - కర్తృత్వము నాకు కలదు అని జీవుని వాదము. జీవుడే కదా కర్త.

**కదాద్యైః** - ఎపుడు గ్రహించితివి? అని ప్రకృతి ప్రశ్న.

**ఇతి హ చిదచితోః నష్టమైత్ర్యోః** - ఈ విధమైన వివాదము వలన నశించిన మైత్రిని కల చిదచిత్తులకు

**పునః తచ్ఛాంత్యై తథ్యం ప్రవక్తుమ్** - తిరిగి వానియొక్క ఉపశమనము కొఱకు తథ్యమును పల్కుటకై - 'ప్రకృతేః క్రియ మాణాని గుణైః కర్మాని నిత్యశః, అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే', 'తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః, పశ్యత్యకృతిబుద్ధిత్వాత్ నస పశ్యతి దుర్మతిః' ఇత్యాది రూప తథ్యమును పల్కుటకు

**కృతశపథ ఇవ స్నాతకోభాతి రంగః** - చేయబడిన శపథమును కలవానివలె శ్రీరంగనాథుడు భాసిల్లుచున్నాడు.